# విషయసూచిక

ఛాయాచిత్రములు



# మార్చిమాసపు చిత్రప్రశ్నకు సమాధానము.

మార్చిమాసపు గృహలక్ష్మిలో శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు ఇచ్చిన చిత్రప్రశ్నకు సమాధానము:

"భక్తవిజయము"

మేముపెట్టిన గడువులోపల సరియైనసమాధానమునిచ్చిన గృహలక్ష్మిపాఠకురాండ్ర నామములను వరుసక్రమమున దిగువనుపేర్కొనుచున్నాము:—

1. జొన్నలగడ్డ శారదాంబ; 2. గిడుగు లక్ష్మీకాంతమ్మ; 3. పీలంరాజు సుబ్బాయమ్మ; 4. యస్. వి. సరళాదేవి; 5. వె. మీనాక్షమ్మ; 6. కోటమర్తి రాజేశ్వరమ్మ; 7. వి.అన్నపూర్ణ; 8, క. వర్ధనమ్మ; 9. శిరిపురపు సీతాఅన్నపూర్ణమ్మ; 10. ఎస్. సావిత్రి; 11. జంపన సుశర్మిలాంబ; 12. కుసుమ సరస్వతి, 13. భోగు చెంచురత్నము; 14. యస్. రుక్మిణమ్మ; 15. జి. వెంకటరామమ్మ; 16. ఎస్. వేదవల్లితాయారమ్మ; 17. గాది తాయారమ్మ; 18. అద్దంకి అనసూయాదేవి; 19. ఎం. పద్మావతి; 20. వల్లమన్నాటి సూరమ్మ; 21. కోకా భానుమతి; 22. కాకాని శారదాంబ; 23. దివాకరుని విశాలాక్షి; 24. అమరవాది లక్ష్మీనరసమ్మ; 25. పత్రి బుజ్జమ్మ; 26. చింతా కృష్ణవేణమ్మ; 27. మాగంటి శకుంతలాదేవి; 28. మద్దాలి సత్యవతి; 29. మెవ్వ చండికామహాలక్ష్మమ్మ; 30. అ. పార్వతీదేవి; 31. పాలపర్తి సరస్వతి; 32. కొత్త లోపాముద్రికమ్మ; 33. జంపాల లక్ష్మీదేవమ్మ; 34. మంత్రిప్రగడ కనకవల్లి; 35. నాదెళ్ల గౌరీమహాలక్ష్మి; 36. దా. వెంకటసుబ్బమ్మ; 37. వేమానిసూర్ల సీతారామమ్మ; 38. గాడిదమడుగు శారదాంబ; 39. టి. బి. సూర్యకాంతమ్మ; 40. కాశీభట్ల పర్వతవర్ధనమ్మ; 41. దినవహి సత్యవతి; 42. నిమ్మకాయల సత్యవతి; 43. వేమూరి అమృతము; 44. ఇందుకూరి సీతాయమ్మ; 45. సూరంపూడి బాలాత్రిపురసుందరి; 46. అనుపోజు సుబ్బాయమ్మ; 47. నిప్పాణి పద్మావతి; 48. కొత్తపల్లి లక్ష్మీనరసమ్మ; 49. పమిడిముక్కల ఈశ్వరమ్మ; 50. ఆమంచి వేదవతమ్మ; 51. పుష్పలూరి వేంకటసీతారత్నమ్మ; 52. భ. సీతమ్మాళ్; 53. నీలాపాళెం వేంకటసుబ్బమ్మ; 54. అడిదం మహాలక్ష్మమ్మ; 55. గంటి కామేశ్వరమ్మ; 56. డి.పి. వేణి; 57. సువర్ల లక్ష్మీనరసమాంబ; 58. యస్. సావిత్రీదేవి; 59. అప్పల శేషమ్మ; 60. సూకల సూర్యకాంతము; 61. నాయని హనుమాయమ్మ; 62. చాగంటి సునందనమ్మ; 63. పనుపులేటి లక్ష్మీదేవమ్మ; 64. పాకల కనకరత్నమ్మ;

65. పాకల రత్నమాల; 66. కంభంమెట్టు లక్ష్మీకాంతమ్మ; 67. అక్కిరాజు సీతారామమ్మ; 68. మందపాటి సీతామహాలక్ష్మి; 69. వ. భువనేశ్వరీదేవి; 70. సమయమంత్రి రాజ్యలక్ష్మి; 71. పి. సీతారామమ్మ; 72. ముస్తా కోటీశ్వరమ్మ; 73. కోడాలి ధనభాగ్యము; 74. కల్లూరి సౌభాగ్యము; 75. ఇందుమతి.

# మార్చిమాసపు యుక్తిలెక్కకు సమాధానము.

మార్చిమాసపు గృహలక్ష్మిలో శ్రీమతి ఎమ్. పద్మావతిగారిచ్చిన యుక్తిలెక్కకు సమాధానము:

| | | రూ. అ. పై. |
|---|---|---|
| ఒకసంచిలో... | ... | 9—9—9 |
| రెండవ సంచిలో... | ... | 12—6—3 |
| జరశి రూ... | | 22—0—0 |

మేముపెట్టిన గడువులోపల ఈయుక్తిలెక్కకు సరియైనసమాధానము తెలిపిన బాల బాలికలనామము వరుసక్రమమున పేర్కొనుచున్నాము. బ్రాకెట్టులలోని అంకెలు వారి ఏండ్లను తెలియజేయును. వయసు తెలుపనివారి నామములు చేకొనబడలేదు.

1. వరదా సత్యవతి (10); 2. టి. బి. సూర్యకాంతమ్మ (11½); 3. కాశీభట్ల సూర్యనారాయణ మూర్తి (9); 4. యడవల్లి వేంకటేశ్వర్లు (11); 5. చలసాని వెంకటేశ్వరవర్మ (11); 6. త్రిపురసుందరి (12); 7. ఎ. వెంకటరావు (11); 8. జి. రఘురామమూర్తి (10); 9. బి. వేంకటస్వామి (11); 10. యస్. చక్రవర్తి (8); 11. యన్. శాంత (8); 12. పిల్లారిశెట్టి సావిత్రమ్మ (11); 13. కొనుమ సరస్వతి (11); 14. జంపన సుకన్యలాంబ (12); 15. యన్. సావిత్రి (12); 16. పాకల రాజామణి (11); 17. మురళీధర (9); 18. కొప్పర్తి సీతాబాయి (11).

---

# ప్రస్తావిక

శ్రీమతి రాజేశ్వరిగారు రచియించిన 'పరాసు పతివ్రతలు' అను గద్యవ్యాసము ఈసంచికయందు పూజ్యస్థానము నలంకరించుచున్నది. ప్రథమప్రకరణమున స్త్రీజన సాముదాయికప్రశస్తి. అనంతరము ఫ్రెంచిస్వాతంత్ర్యవిజయమునాటి దారుణచరిత్రస్మరణము. అటుపిమ్మట 'అభీషణకాలగర్జాఘోషమున నిట్టెపొడసూపి కాటుకమింటఁ గలసిపోయిన' నాలుగువిద్యుల్లతలు తెరమీాద ప్రసారితమొనర్పబడినవి. ఆవిద్యుల్లతలు నాలుగును నలుగురు స్త్రీలు. ఆనలుగురుస్త్రీలును భర్తలకొఱకు ప్రాణములొడ్డిన వారు. ఒక్కొక్కరినిగూర్చి ఒకటిరెండుముక్కలుమాత్రము కవయిత్రి చెప్పినది. ఆ ఒకటిరెండు ముక్కలతోడనే వారు విద్యుత్ప్రకాశమున పాఠకులమనస్సును ఉచ్చలితముచేయుచున్నారు. అలతిపదములలోని అర్థసారస్యమట్టిది ; సంగ్రహశైలియొక్క సమర్థత అట్టిది. అతిలోకప్రవర్తనముచే 'రక్తతారక'లైన ఆపరాసు పతివ్రతల 'అక్షరములగు ఆత్మజ్యోతులకు' పతివ్రతాధర్మమునకు పంటపొలమగు భారతభూమిని పుట్టుపుగన్న వ్యాసకర్త్రితోబాటు భారతస్త్రీలోకమంతయు 'నమోవాక' మర్పింపగలదు.

ఈసంచికయందు ప్రథమపద్యవ్యాసము శ్రీవడ్లమూడి వేంకటరత్నము 'త్యాగము' అనునది. పురుషుడు స్వార్థపరుడు ; స్త్రీత్యాగరాశి. స్వార్థపరుడైనను ఉచితజ్ఞతగోల్పోవని ఒకభర్త ఈవిషయమై ఆలోచనప్రారంభించినాడు. తనభార్య 'అహమ్' అనుభావమును వదలినది ; ప్రాణముప్రాణముగా మెలంగెడి చెల్మికత్తెలను విసర్జించినది ; తనరక్తములోరక్తమగు తల్లిదండ్రులను విడిచినది ; తన్నుగొల్చుచున్నది. స్వార్థగుణసంవాసితమగు నాతనిహృదయమునకు ఈనిరుపమానత్యాగమహిమ అర్థమైనదికాదు. కావున భార్య నిట్లుప్రశ్నింపుచున్నాడు:

"అరుగో! తండ్రియొసంగినట్టి మధురాహారంబులం దామెయొం
టరిపాటన్ దినలేక గ్రుక్కిలిడుచున్గాంక్షించుచున్నారు నీ
కొఱకై సోదరు లీక్షణంబులరుమల్ గ్రుక్కంగ నీపట్టు లే
మరిదైనం దిలకింపఁగోర విధిదేమాహాత్మ్యమో ? మానినీ !"

ఇంతటిమాహాత్మ్యముగలిగి జాయారూపమున పురుషుని గొల్చుచున్న స్త్రీని 'అబల'యను పర్యాయాభిధానమున వ్యవహరించుపురుషు లాతనిదృష్టిలో లొచ్చుఅయినారు. ఆభర్త అప్పుడు తనభార్యకు

'చాగమునయందు నీతోడఁదూఁగువారు
భువనమునలేరు ; ముందును బుట్టఁబోరు'

అని యోగ్యతాపత్రమిచ్చినాఁడు. ఈయోగ్యతాపత్రమున స్త్రీజాతికంతకును తొలంగింపరాని వారసత్వముగలదు. స్త్రీలుచేయుత్యాగమునందలి మేలెంచిమెచ్చుకొనగల ఈ ఖండకావ్యమునందలిభర్తవంటి భర్తలు నేటి భారతదేశమున నెందఱున్నారు? ఇట్టి ఉత్తమభర్తపాత్రను సృష్టించి లోకజ్ఞత ప్రకటించినకవియైనను దీనికి తగినసమాధానమీయగలుగునా?

శ్రీరాయసము వేంకటశివుఁడు 'పిచ్చికమ్మ'అనునది ఈసంచికయందలి తొలుతటికథావ్యాసము. కథయందలి ప్రధానపాత్ర ఒక పిచికపిల్ల. అయితే ఈసబునీతికథలయందలిజంతువులవలె నిది మాట్లాడదు. మఱి జరుగరానివిషయమొక్కటియు నిందులేదు. పిల్లనుగోల్పోయిన ఒకస్త్రీ తల్లినిగోల్పోయిన ఒకపిచికపిల్లను సాకుచున్నది. మనుష్యునకును జంతువునకును ప్రేమవిషయమున అభేదముకల్పింపబడినది. కల్పింపబడనిచో ఆఁడుపిచ్చుక తన్నుసాకినస్త్రీదగ్గఱకువచ్చినవాలగా మగపిచ్చుకరాక చెట్టుకొమ్మపై నిలిచియున్నప్పుడు కవి 'ఆహా! ఏజాతియందును అల్లుని పోకడలిట్టివియొకదా!' అని మీనాక్షిచే నేలపలికించును? రొమాంటిక్కురివైవల్ కాలమున ఆంగ్లసారస్వతమున నిట్టి కథలు విస్తరిల్లినవి. తెనుగువాణి కిట్టివిక్రొత్తలు.

—ఆంధ్ర శేషగిరిరావు బి.ఏ.

3

# విషయసూచిక

త్రివర్ణ చిత్రము
దేవాలయమునకు

ఛాయా చిత్రములు

1. కొంటెతనము
2. శ్రీమతి యస్. సుభద్రమ్మగారు
3. లీలాకన్యసినీమానటి
4. రత్నాలుచెక్కిన రవ్వల్లపండు
5. చిన్ననాటిప్రేమ
6. మాధురికన్య
7. మోహిని
8. కాంతామతి
9. శాస్త్రీకళాశాల, బొంబాయి
10. బొంబాయిలోని ఒకబ్రహ్మాండభవనము
11. "మడమలను దాకబోయెడిమనుమరులు"
12. ఖద్దరువస్త్రధారిణులగు బాలికలు

శ్రీమతి లక్ష్మమ్మగారి పాత్రధారణము

# ఏప్రియలుమాసపు యుక్తిలెక్కకు సమాధానము

ఏప్రియలుమాసపు గృహలక్ష్మిలో శ్రీమతి బి. మాణిక్యాంబగారిచ్చిన యుక్తిలెక్కకు సమాధానము.

| | | | | |
|---|---|---|---|---|
| తల్లిమూడుతట్టలలో (తట్టకు 27 వంతున) పెట్టినఫేణీలు | | | ... | 81 |
| మొదటి ఆమె తినినవి | ... | ... | ... | 35 |
| రెండవ ఆమె తినినవి | ... | ... | ... | 26 |
| మూడవ ఆమె తినినవి | ... | ... | ... | 20 |
| | | మొత్తము | ... | 81 |

మేముచెప్పిన గడువులోపల సరియైనసమాధానము తెలిపిన బాలబాలికల నామములు ఈక్రింద వరుసక్రమమున పేర్కొనుచున్నాము. వయసు తెలుపనివారి నామములు చేకొనబడలేదు.

1. టి. నరసింహారావు (8) 2. టి. రాజరామమోహనరావు (11) 3. కాకర్లమూడి లక్ష్మీనరసమ్మ (10) 4. దామెర్ల వెంకటరమణమాంబ (11) 5. ఎస్. శకుంతల (10) 6. కుసుమసరస్వతి (11) 7. జి.ఎస్. రామకృష్ణారావు (12) 8. బండారు వెంకటరత్నము (8) 9. ఎగుబోటి సుబ్బమ్మ (10) 10. చిన్నట్టి కమలమ్మ (10) 11. సూరంపూడి రామలక్ష్మి (11) 12. వావిలికొలను సుశీలమ్మ (10) 13. మొంద్రేటి ప్రభావతి (10) 14. వేదుల సుబ్బలక్ష్మి (12) 15. భట్టిప్రోలు రామామణి (10) 16. గాద తాయారమ్మ (11) 17. కస్తూరి శేషగిరిరావు (10) 18. వెలువలి బాలాత్రిపురసుందరమ్మ (10) 19. యమ్. లక్ష్మీబాయమ్మ (12) 20. కాశీభట్ల సూర్యనారాయణమూర్తి (8) 21. నాకల సుబ్బలక్ష్మి (12) 22. పెద్దిశెట్టి సూర్యనారాయణమ్మ (11) 23. చింతలపాటి మూర్తిరాజు (11) 24. జంపన అన్నపూర్ణ (11) 25. జంపన కృష్ణతులశమ్మ (12) 26. దామోజీపురపు సత్యవతి (12) 27. చేమర్తి దుర్గామల్లికార్జునవీరవరప్రసాదరావు (8) 28. వేలూరు త్యాగరాజు (11) 29. తల్లాప్రెగడ సుబ్బలక్ష్మి (11) 30. కొప్పర్తి సీతాభాయి

(11) 31. కొప్పర్తి సుమ్మడు (10) 32. పోతుల నరసింహారావు (10) 33. చీమలకొండ రామసుబ్బమ్మ (10) 34. మేడిశెట్టి జయమ్మ (11) 35. గిడుగు సీతామహాలక్ష్మి (11) 36. యస్. రామదాసు (12) 37. కార్యమపూడి లక్ష్మమ్మ (11½) 38. జి. మేరీరత్నం (8) 39. పి. గ్రేసిసంతోషం (10) 40. పల్లా రామరత్నము (10) 41. గుజ్జాడ సత్యవతి (12) 42. ముక్తినూతలపాటి రామచంద్రరావు (10½) 43. పత్రి కామేశ్వరరావు (10) 44. దూడగడుపు రుక్మిబాయి (12) 45. యస్. లక్ష్మీదేవి (11) 46. పి. దొరసానమ్మ (11½) 47. నీలాపాశెం వెంకటసుబ్బమ్మ (11) 48. భూపతిరాజు బంగారయ్యమ్మ (11) 49. బలిజేపల్లి లక్ష్మీసుబ్రహ్మణ్యవతి (12) 50. కలిగొట్ల అనసూయ (12) 51. బి. పార్వతమ్మ (11).

---

# శ్రీ బుగ్గదేవాలయమాహాత్మ్యము

చిత్తూరుజిల్లా నగరిస్టేషనుకు 5 మైళ్లదూరమున నగరియేరు అను పేరుగల కుశస్థలీనది ప్రవహించుచున్నది. దాని ఉత్తరతీరమున బుగ్గదేవాలయమను పుణ్యక్షేత్రమున్నది. తత్సమీపమున సుందరవనమున్నది. దేవాలయ పరిసరప్రాంతములందు మామిడితోపులుగలవు. కాశిలోనుండి భూమ్యధోభాగము ద్వారావచ్చెడి అయిదు బుగ్గలు ఇచ్చట వెల్లివిరియుచున్నవి. అవినిరంతరము ఉల్లోలకల్లోలమై ప్రవహించుచున్నవి. ఇట్టి దివ్యక్షేత్రమందు శ్రీకాశీవిశ్వేశ్వర, కాలభైరవ, శ్రీ తీర్థప్రయాగమాధవస్వామ్యభిధానములతో త్రిమూర్తులర్చావతారులై నెలకొనియున్నారు. ఇయ్యది పురాతనదేవాలయము. ప్రతిపుణ్యక్షేత్రమందును హరిహరాదులుండుటరుదు. సంతానహీనులు సంతానార్థమై సంకల్పపూర్వకముగా నీకుశస్థలీతీర్థమందు స్నానమాచరించి స్వామినిదర్శించి తీర్థప్రసాదములం గైకొన్నమాత్రాన కామితార్థసిద్ధినొందుట సత్యేతరముకాదు. తదర్థమై పలువురు యాత్రికులు తరుచుగా నేతెంచుట ప్రత్యక్షముగా చూడనగును. కాశికిపోవ వీలులేనివారనేకులు అపరకాశియగు నీబుగ్గక్షేత్రమందలి తీర్థమందే స్వర్గీయులగువారి అస్థులను దెచ్చి పునీతపరచుట ఈప్రాంతమున ఆచారమై యున్నది. పుణ్యదినములలో అనేకయాత్రికులు అస్థులను దెచ్చి బుగ్గలోగలుపుట కన్నారజూడనచ్చును. తీర్థశ్రాద్ధాదులనుగూడ నిందే పెట్టుచున్నారు. బుగ్గజలము నైర్మల్య, సౌగంధ్యములకు పుట్టినిల్లయి హృద్యమై లఘుత్వమును గలిగియున్నది. సకలవ్యాధులను పోగొట్టుచున్నది. సుప్రసిద్ధగాంగజలమై వెలయుచున్నది. మహనీయులకు వాసయోగ్యము. స్నానాచమనాదులకు దివ్యతీర్థము. చూడసుందరమై క్రమముగానైదు ఘట్టములలో బుగ్గనీరు రమారమి 4 అడుగుల ఎత్తునుండి పడిప్రవహించుట ప్రేక్షకులచిత్తము నపహరించుచున్నది. ఉన్నతోద్యోగములందినవారు విజయము చేయుటకును; తాలూకాబోర్డు, జిల్లాబోర్డు సంఘసభలు జరుపుటకును; స్వచ్ఛందసేవాదళము వ్యాయామము చేయుటకును వనభోజనాదులకును; పౌర్ణమిపూజలకును సుప్రసిద్ధస్థలము. యాత్రికులు వసించుటకేగాక అన్నపానాదుల పచనము చేసికొనుటకును తీర్థశ్రాద్ధాదుల పెట్టుటకును శయనావాసనాదులకును వసతిగృహము లేర్పరుపబడియున్నవి. ఇట్టి యనేకసౌకర్యములు గలిగింపకోరి యింకను యాత్రికులకునలయు వసతిగృహము లమర్చుటకు గట్టి ప్రయత్నములు చేయబడుచున్నవి. వేరేల? యీదివ్యస్థలము నొకమారుతిలకించి సేవంబులకించిన ధన్యులు పలుమరురాగోరుటయేకాక తమబంధుమిత్రులకును యీక్షేత్రమహిమను పలువిధములజెప్పి వెంటబెట్టుకొనివచ్చి తామానందించి తమవారినానందింప జేయుదురనుటతప్పనిసరి. పలుమాటలేల. దక్షిణకాశియగు నీదివ్యక్షేత్రము (బుగ్గదేవాలయము) సాధువులకు సంతానవృక్షము. భక్తులకు ముక్తిప్రదము. యాత్రికులకు దివ్యక్షేత్రము. వారు వీరననేల? మానవకోటికియ్యది ఇహపరసుఖదాయి. హరిహరాదులకునికి పట్టయిన దీనింబొగడ వరులెంతటివారు?

ఎన్. సుబ్రహ్మణ్యశర్మ, మెంబరు, శ్రీబుగ్గదేవాలయజీర్ణోద్ధారణకమిటి, మద్రాసు.

# ప్రస్తావిక

ఆసుదిగ్గై ఆంధ్రదేశమున అవతరించిన మంత్రిరాక్షసు డనదగిన నాయకురాలి వీరగుణవిస్ఫూరితమైన జాత్యహంకారమును వికచీకృతమొనర్చు శ్రీమతి మదమంచి అనంతమ్మ 'నాయకురాలు' అనుపద్యవ్యాసము ఈసంచికయందు తొలిపూజలందినది. మదమంచివారిది మంచి జాతీయమైన కవిత. ఇంతవఱకు గృహలక్ష్మిలో ప్రచురితమైన 'సీతమ్మ పెండ్లి' 'మాంచాల' 'పల్లెపదాలు' అను వారిపద్యవ్యాసత్రయము వారి 'రసభావభావనామహనీయకవితానముల్లాసము'ను వెల్వరించినది. ప్రస్తుత వ్యాసమగు 'నాయకురాలు' ఆమూలువ్యాసముల కెంతమాత్రమును దీసిపోవక అన్నియు నొక్కకుదుటిలోనివేయగుట వెల్లడించుచున్నది.

'నాయనిప్రక్కలో నాగుబాామై' నలగామునివద్ద సాచివ్యమునవదరించిన నాయకురాలిని పాఠకులకు పరిచయముచేయుటలో కవయిత్రి ప్రథమమున ఉపన్యాసకురాలైనది. అనంతరము చిత్రకారిణియైనది. 'గేస్తురాలు' 'ధీరురాలు' 'మాన్యురాలు' 'బలవంతురాలు' అని విశేషోపన్యాసము విసరినను కవయిత్రికి తృప్తిగలుగలేదు. చిత్రకారిణియై భావశబలతచే నాయకురాలిని పాఠకులకండ్లయెదుట చిత్రించినది. కాళ్లపై జీరాడకట్టిన 'పాట్నాగులాబిపావడ'క్రింది పిల్లాణి నటునిటుబెట్టుకొనుదృశ్యమొకటి. మనికట్టుకు మహిమదెచ్చుచున్న పోచీలు మాటికి ముంగోట ములుపుకొనుదృశ్యమొకటి. మోముపైదూగాడు ముంగురులను దిద్దుకొనుదృశ్యమొకటి. పావలపై పాదతలముంచి వేమారు చివ్వునలేచియాసీనయగుదృశ్యమొకటి. కలమువైచిన చిత్రములుగావున ఇవి ఇంతింతలో ఒక్కసీసమున ఇరవొందినవి. కుంచెవైచినచో నాలుగుదృశ్యములకు నాలుగు ప్రత్యేకచిత్రములుండవలసినదే.

ఈఖండకావ్యమున నాయకురాలి వీరగుణవిస్పష్టమైనజాత్యహంకారము చక్కగ పోషింపబడినది. 'భరతభూమి వీరాంగనల రక్తధారాళవృష్టిచే ప్లావితంబై భాగ్యధాత్రియైనది; భరతభూమి విపులధాత్రియైనను అది అంతయు పరమపావన పతివ్రతలచరిత్రలచే విన్నాణమొందినది'అను సత్యవిలసితములగు వాక్యములు నాయకురాలి నాలుకనుండి ఉద్గారితములై ఎంతటి జాత్యభిమానమును విరియబోయుచున్నవో ! ఈ మాట లోకలెక్కయా ? మోహరించినిలచిన బాలచంద్రుని ఆమె ఏమనుచున్నదో చూడుడు :

"పడతి చెల్లుబడిని పచరించువాట
నిలుపమన సెటులాడె వెలమబాలులకు ?
గాజులుగల్లన్న కర్ణముల్ మూయు
మగవారి కీరితి మసుపతో రణమా? "

ఇంతిమాత్రమేగాదు. పురుషునిదౌష్ట్యమును సభలలోనిరసించి స్త్రీస్వాతంత్ర్యము కావలయునని వేనోళ్లచాటు నేటివిధిజ్ఞురాండ్రనుదలపించుచు ఆఱు శతాబ్దులకు పూర్వముననున్న నాయకురాలిట్లుగర్జించినది:

"ఆడుది సింహాసనాధీశయైన
కనుగట్టెనే నిన్ను కన్నబాలునకు?
సర్వేశ్వరునిసృష్టిజాలంబులోన
స్వాతంత్ర్యమనునది సర్వులకొకటె
పశుపక్షులైనను పారతంత్ర్యాన
మధురజీవనాప్తి మనియుండఁగలవె?"

భారతదేశమున బహుకాలముగ సాగుచున్న పురుషునినిరాఘాటప్రభుత్వముపై తిరుగుపాటుకనబఱచిన భారతస్త్రీలలో నాయకురాలు మొదటిజట్టునకు చెందును. కావుననే ఆమెయందు 'నేను ఆడుదానను' అను అభిమానము హద్దునెఱుంగకయున్నది. నాయకురాలి గుణగణములలో ముఖ్యమైన జాత్యహంకారమును ఎంచిదీసి దానిసమగ్రపోషణకు వలయుసన్నివేశములను సమకూర్చుకొని కవయిత్రి ఈఖండకావ్యమును కథకుదీర్చినది.

సన్నివేశకల్పనము, గుణపోషణము మాత్రమేకాదు ఈకావ్యమున మెచ్చదగిన విషయములు. 'తగరుదూకిన చట్టువగిలి'నదని వర్ణించిన కవయిత్రి పరిశీలనాశక్తి, 'జిలుగురత్నాలపోసీలు ముంజేయిమీద మూటికి ముంగోట ములుపుకొనుచు' అనివ్రాసిన ఆమె వర్ణనాచమత్కృతి, 'నాలుగు పగ్గాలదూరాన' అనినప్పటి ఆమె జాతీయపదప్రయోగము మొదలగునవి సమ్మాననార్హ విషయములు. ఈకావ్యమునందలి 'పచ్చిరక్తమ్ము విరజిమ్ము పసిడివ్రాలు'అను పద్యపాదము చదువునపుడు నిజముగ పచ్చిరక్తమును విరజిమ్ముచున్నది. తిక్కనసోమయాజికిజ్యానాదము 'గభీరమధురమై శ్రావ్యంబై' చెలఁగినది; విల్లు 'విద్యుద్దండము నిల్చిపాల్చినగతిని అందమైన'దైనది; పోరు'ఘోరంబైనను అభిరామమైన'దైనది. 'ఉగ్రమైనను సుందరమైన'దైనది. 'వ్రేలుచూపింపని ఈవిదుషీమణికి' పచ్చిరక్తమ్ము విరజిమ్ముప్రాలు పసిడివ్రాలైనది. పసిడివ్రాలుతో పచ్చిరక్తమ్ము విరజిమ్మబడుచుండగా ఈ కావ్యమునపలుతావులఘటిల్లినఛందోభంగాదులపై దృష్టిపారించువారెవరు?

—ఆంధ్రశేషగిరిరావు బి. ఎ.

# విషయసూచిక

త్రివర్ణ చిత్రము

'అర్జునుడు, ఇందుమతి'

ఛాయా చిత్రములు

1. వియన్నాలో జరిగిన అంతర్జాతీయ స్త్రీలమహాసభకు వెడలిన భారతస్త్రీ ప్రతినిధులు
2. ప్రథమ అఖిల ఆశియా స్త్రీలసభ ప్రతినిధురాండ్రు.
3. ఇండియా స్త్రీలసంఘము వారి 1930-వ సంవత్సరపు సాధారణసంఘసభ.
4. సులోచన కన్య.
5. నార్వేదేశపుస్త్రీలు: పుస్తకపఠనము.
6. నార్వేదేశపుస్త్రీలు : గృహపరిశ్రమ.

# మే మాసపు చిత్రప్రశ్నకు సమాధానము

మే మాసము గృహలక్ష్మిలో శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారిచ్చిన చిత్రప్రశ్నకు సమాధానము. గోదావరి

సరియైన సమాధానమిచ్చిన గృహలక్ష్మి పాఠకురాండ్రనామములు వరుసక్రమమున దిగువను పేర్కొనుచున్నాము.

1. వాకిలాల సుందరమ్మ. 2. కలపటపు సీతాబాయి. 3. నుసర్ల లక్ష్మీనరసమాంబ. 4. చాగంటి సునందనమ్మ. 5. కస్తూరి రంగనాయకమ్మ. 6. నీళాపాళెం సావిత్రి. 7. ఈమూరి సూర్యకాంతము. 8. బొడ్డు సీతామహాలక్ష్మి. 9. బెంగుళూరు నాగరత్నము. 10. గాడిచెమడుగు శారదాంబ. 11. గొల్లపూడి కమల. 12. మొవ్వ చండికామహాలక్ష్మమ్మ. 13. ముద్దన నారాయణమ్మ. 14. కామినేని కృపావతి. 15. కంభంమెట్టు లక్ష్మీకాంతమ్మ. 16. యమ్. సత్యబాలసుశీలాదేవి. 17. ఇవటూరి వెంకటరత్నమ్మ. 18. పసిడిముక్కుల ఈశ్వరమ్మ. 19. వి. వెంకటరత్నమ్మ. 20. పద్మారాధాకృష్ణన్. 21. పి. కనకరత్నమ్మ. 22. మొవ్వ సుందరమ్మ. 23. శిఖరం స్వయంప్రభ. 24. జొన్నలగడ్డ శారదాంబ. 25. గిడుగు సీతామహాలక్ష్మి. 26. గిడుగు లక్ష్మీకాంతము. 27. ఆరాధ్యుల వెంకటసుబ్బమ్మ. 28. పల్లా మీనాక్షి. 29. కాశీభట్లు పర్వతవర్ధనమ్మ. 30. గుండారెడ్డి సౌభాగ్యమ్మ. 31. వి. చిదంబరరావు సతి. 32. పసుపులేటి లక్ష్మీదేవమ్మ. 33. పసుపులేటి రామానుజమ్మ. 34. ధవళ రాజేశ్వరమ్మ. 35. కొత్తపల్లి శారదాంబ. 36. శెట్టిలూరి రామరాజ్యము. 37. పాకల రత్నమాల. 38. నాగలింగమ్ బసవపున్నమ్మ. 39. నాగలింగమ్ సుందరసరోజినీదేవి. 40. మానాప్రగడ సీతాయమ్మ. 41. ద్రోణంరాజు లీలావతి. 42. రావుకూటము లలితమ్మ. 43. యస్. లక్ష్మీదేవి. 44. దాసరి వెంకటసుబ్బమ్మ. 45. కసుమ సరస్వతి. 46. మాగంటి శకుంతలాదేవి. 47. మద్దాలి సత్యవతీదేవి. 48. పిల్లుట్ల కనకదుర్గామహాలక్ష్మమ్మ. 49. గోపు ఆదినారాయణమ్మ. 50. కూరెళ్ల సూర్యకాంతమ్మాళ్. 51. కొడాలి దమయంతమ్మ. 52. డి. వనలత. 53. పాటిమళ్ల శకుంతలాదేవి. 54. యమ్. లక్ష్మి. 55. వి. యస్. లక్ష్మి. 56. భోగు చెంచురత్నము. 57. పరిపత్రి శకుంతలాదేవి. 58. నీలంరాజు సుబ్బాయమ్మ. 59. చల్లా భారతి. 60. జయంతి కమలావతి. 61. మోగంటి మాణిక్యాంబ. 62. గాడి తాయారమ్మ. 63. దమయంతి. 64. పడమన్నాటి సూరమ్మ. 65. చో. రంగనాయకమ్మ. 66. బి. మాణిక్యాంబ. 67. బోయిశెట్టి రత్నమాణిక్యాంబ. 68. చౌదరి వై. కె. తాయారమ్మాళ్. 69. పత్రి బుజ్జమ్మ. 70. చింతా కృష్ణవేణమ్మ. 71. మహేంద్రవాడ లక్ష్మీనరసమ్మ. 72. అయ్యదేవర బాలా త్రిపురసుందరమ్మ. 73. వ. కృష్ణమ్మ. 74. యిల్లింద రంగనాయకమ్మ. 75. పాలపర్తి సరస్వతి. 76. పిండిప్రోలు కొండయాంబ. 77. సరస్వతి. 78. జీ. విలియాపుష్పమ్మ. 79. ద్వారభాతి వైరివీరసంహారణాభిదానాంబ. 80. యస్. లీలావతి. 81. అమరవాది లక్ష్మీనరసమ్మ. 82. ఎగుబోటి సుబ్బమ్మ. 83. తెన్నేటి అలవేలుమంగతాయారమ్మ. 84. చీమలకొండ రామసుబ్బమ్మ. 85. దామోజీపరపు రామాయమ్మ.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గృహలక్ష్మి ఏజెంట్లు

| | |
|---|---|
| తెనాలి: | కొమ్మారికాశీవిశ్వనాథంగారు, పోలీసు స్టేషను ఎదుట, |
| బళ్లారి: | వి. రాజ మెండలియార్ & సన్సు, బ్రాహ్మణవీధి. |
| బెజవాడ: | నాముల అంతోని. |
| మచిలీపట్టణము: | కె. బాలకృష్ణ |
| | జె. వి. శర్మ, న్యూసు ఏజెంటు. |
| తిరుపతి: | వై. వి. సుబ్బయ్య & కంపెని, వెంకటేశనివాస్. |
| హైదరాబాదు: | ఎన్. లక్ష్మీబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చార్ సు మార్కెట్టురోడ్డు,(మన ప్రాంతపు 1 రూ ఉస్మానియా రూ 1-3-0 అగును). |
| నిడదవోలు: | శాస్త్రీబ్రదర్సు, న్యూసుఏజంట్సు. |
| కొవ్వూరు: | జి. వి. రామరావుగారు. |
| ఏలూరు: | ఎస్.పి. ఆచార్లుగారు, పవర్ పేట |
| రాజమండ్రి: | ఎస్.బి. కృష్ణరావుగారు. |
| తాడేపల్లిగూడెం: | కాశిరాజు శ్రీరాములుగారు |
| బరంపురం: | గోనియా శెట్టిగారు, గొల్లపల్లి. |
| కొల్లూరు: | కాజా సుబ్బయ్యగారు, |
| జేక్సన్ పూరు: | టి. వి. రమణయ్య. |
| గుంటూరు: | విన్ డ్ సన్ కంపెని. |
| అమలాపురం: | కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం. |
| చికాకోలు: | తాటిగడప మాణిక్యరావుగారు. |
| పాలకొల్లు: | వేమరాజు నరసింహంగారు, హెడ్మాస్టరు, మట్టపర్రు. |
| విజయనగరం: | కేసనపల్లి రామలింగంగారు, పాతూరివారి వీధి. |
| విశాఖపట్టణం: | అందే కృష్ణమూర్తి బ్రదర్సు. |

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి", తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.

# ప్రస్తావిక

శ్రీ వడ్లమాని అప్పారావు 'పద్మిని' అనుపద్యవ్యాసము ఈసంచికయందు పూజ్యపీఠమునందినది. ఇదియొక ఊహాసంభాషణము. కవి ప్రశ్నించుచున్నాడు. పద్మిని ప్రత్యుత్తర మిచ్చుచున్నది. కవి తనప్రశ్నలోనే పద్మినిని ప్రస్తుతించుచున్నాడు. పద్మిని తనప్రత్యుత్తరములోనే తన ప్రథితగుణములను ప్రదర్శనముగావించుచున్నది. రచయిత చమత్కార మీవిషయమున మిక్కిలి రమణించుచున్నది. కవివైచిన హృదయము కలంచు ప్రశ్నలకు వీరహృదయము గల పద్మిని ఎంతటి హృదయంగమమైన సమాధానము లిచ్చినదో! అయినను కవి వైచుప్రశ్నలకు అంతులేదే. సంభాషణము కవియే ప్రారంభముచేసినాడు. ఆప్రారంభమును ప్రశ్నతోడ. సంభాషణము కవియే ఉపసంహరించినాడు. ఆఉపసంహారమును ప్రశ్నతోడనే.

"చనియు సడలని తావకచరితమందు
జీవితామలనవ్యసౌశీల్యవృష్టి
నెడతెగక రాల్చి, కవిలోక మెందుకిట్లు
ముగ్ధబాష్పంపురోదలలో మ్రోగునిపుడు?"

ప్రశ్నలోనే ప్రస్తుతిని ప్రసవింపగల ప్రజ్ఞాధురీణుడగు ఈకవి ప్రశ్నకు ఒరులు సమాధాన మీయవలసిన అవసరమేది? పద్మిని చరిత్ర 'చనియు సడలని'ది కావున కవిగ్రామణు లద్దానిని ముగ్ధబాష్పంపురోదలలో మ్రోగింతురు.

శ్రీమతి రాజేశ్వరి 'అభిప్రాయభేదము' అనునది ఈ సంచికయందు ప్రథమగద్యవ్యాసము. భగవానుని సృష్టిచమత్కారమునకు అవధి, పురుషునకు 'ఆనందనిష్పత్తికి తరుగనిగని' అయిన స్త్రీనిగూర్చి పాశ్చాత్యులలో గల అభిప్రాయభేదము లీవ్యాసమున ప్రసర్పణము గావింపబడినవి. అచ్చట స్త్రీని కొందఱు నెత్తికెత్తి పూజించినారు; కొందఱు నేలనుపెట్టి మట్టినారు. ఈ అభిప్రాయభేదప్రదర్శనము వ్యాసకర్త్రికిప్రబర్హముకాదు. దానినుండి ఆమె సారమైనసత్యము నొకదానిని గ్రహించినది. 'ఈ అభిప్రాయభేదములకు వర్ణ్యమానవస్తువెన్నడును కారణముగాదు. ఆయాభావధోరణుల సమయములట్టివి.' ఈ సందర్భమున ఆమె భారత

దేశమునందలి పరిస్థితులను గూర్చి వెల్లడించిన విమర్శక వాక్యము చూడుడు: 'స్త్రీదూషణపూర్వకంగా పురుష మనశ్చాంచల్యము బాపుటకై పూర్వపుభారతతత్త్వజ్ఞులు ప్రయత్నించిరే కాని స్త్రీజాతినెన్నడును తక్కువపర్చే ఉద్దేశంతో కాదు.' ఇది ముమ్మాటికి నిశ్చయము. ముమ్మాటికి నిశ్చయమనుటకు వ్యాసకర్త్రి శ్రీమచ్ఛంకరభగవత్పాదుల అమరుకము, 'మాతృదేవోభవ' అనుపూతవాక్యము, 'కలకంఠకంఠి కన్నీరొలికిన సిరియింటనుండనొల్ల' దను లోకోక్తి అను మూడింటిని నిదర్శనముగ నిచ్చినది. అవి చాలును. అయితే చివరకు తేల్చినదియేమి? 'పాతివ్రత్యము ఈ దేశమున నేలగిల్లినదారకు సమృద్ధసస్యము. కావుననే అట్టి అభిప్రాయభేదము లీదేశమున పొడసూపలేదు' అని. ఇది ఇట్లుగూడ చెప్పవచ్చును. 'అట్టి అభిప్రాయభేదము లీదేశమున పొడసూపలేదు కావుననే పాతివ్రత్యము ఈ దేశమున నేలగిల్లినదారకు సమృద్ధసస్య'మైనది. ఈవ్యాస రచనమున కవయిత్రి విషయసంగ్రహణశక్తి, సారగ్రహణ సామర్థ్యము, విమర్శకవైదుష్యము జాడుకొనియున్నవి.

శ్రీ చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు 'పుస్తకముకన్న ప్రకృతియే జ్ఞానాభివృద్ధి నతిశయింపజేయును' అను నీలమువంటినీతిని 'ప్రకృతి' అను గద్యవ్యాసమున పోషించినాడు. జ్యోతి, మాధవుడు భార్యాభర్తలు. మాధవుడు ఉత్తపుస్తకభుక్కు. కావున నాతడు గృహస్థాశ్రమము స్వీకరించిన ఋష్యశృంగుడుగా నుండినాడు. ఉండగా ఒక నాడు అతడు అదృష్టవశమున ప్రకృతిమాత ఒడిలోబడినాడు. సూర్యుడు అస్తమించినాడు; కమలకాంత కనులు మూసినిద్రించినది—చంద్రుడు ఉదయించినాడు; కలువకన్నె కన్నులు విప్పి కలకలనవ్వినది. ప్రకృతిలో ఎటుచూచినను అన్యోన్యత. ఒకే తొడిమగలిగియున్న జాజిపువ్వులజంటను కోయుటకు అతడు ఎప్పుడు సంశయించినాడో అప్పుడే 'అతని హృదయము ప్రేమమకరందముతో' నిండిపోయినది. ఇక ఇప్పుడాతడు ఋష్యశృంగుడు కాడు. ప్రణయరాజ్యమునకు ప్రధాని.

—ఆంధ్ర శేషగిరిరావు బి. ఏ.

# విషయసూచిక

## జూను మాసపు యుక్తిలెక్కకు సమాధానము

జూను మాసము గృహలక్ష్మిలో శ్రీమతి నున్న సావిత్రీదేవిగారిచ్చిన యుక్తి లెక్కకుసమాధానము:

28 రోజులలో.

మేము పెట్టినగడువులోపల సరియైన సమాధానమిచ్చిన బాలబాలికల నామములు వరుసక్రమమున క్రిందపేర్కొనుచున్నారము. బ్రాకెట్లలో వారివయసు తెలుపబడినది.

1. వావిలాల వాసుదేవశాస్త్రి (6) 2. ఆరాధ్యుల సూర్యకాంతం (9) 3. వి. యం. బి. శాస్త్రి (8) 4. చాగంటి సుందరరావు (8) 5. కుసుమ సుబ్బారావు (9) 6. టంకాల పద్మావతి (9) 7. పాకల వేంకటకామేశ్వరీదేవి (9)

పలువురుముప్పదిదినములని ప్రమాదపడిరి. నూర్గురకు పైగా సమాధానము పంపిరి. అందుసరియైన సమాధానము తెలిపినవారు ఈ ఏడ్గురే. వీరికి మాశుభాశీస్సులు.

—సంపాదకుడు.

# గృహలక్ష్మి శ్రావణమాససంచిక

## ఆంధ్రమహాశయులకు విన్నపము

శ్రావణమాసము పుణ్యస్త్రీలకు మిక్కిలి ప్రియమైన మాసము. మంగళగౌరీవ్రతములు, వరలక్ష్మీపూజలు, పేరంటములు, వేడుకలు, చిన్నమోచిదరో సువర్ణలాభము. పుణ్యస్త్రీల కిన్నివిధముల సంతోషప్రదమైన శ్రావణమాసపుమాహాత్మ్యమును ప్రస్తరించిప్రస్తుతించుచు 'గృహలక్ష్మి' తరపున నొకప్రత్యేకసంచిక వెలువరింపతలపెట్టినాము. పై మాసపుఅనగా ఆగస్టు మాసపు గృహలక్ష్మిసంచిక శ్రావణమాససంచికగ వెలువడును. ఆప్రత్యేక సంచికకు విలువగలప్రత్యేకవ్యాసములనర్థించుచున్నాము. శ్రావణమాసము: ప్రకృతి; వర్షఋతుచర్య; శ్రావణమాసము: మానవుని జీవితము, అతని ఆరోగ్యము; శ్రావణమాసము: వ్రతములు; మంగళగౌరీవ్రతము, దాని అంతర్యము, దాని కథ, దానికి సంబంధించిన పాటలు; వరలక్ష్మి పూజ, అందలి విశేషము, దానికథ, దానికి సంబంధించిన పాటలు; శ్రావణపూర్ణిమకు ముందరి శుక్రవారము యొక్క ఘనత; శ్రావణమాసపూజలకు జ్యోతిష, ఖగోళ, ఆరోగ్య, సాంఘికశాస్త్రములకు గల సంబంధము; శ్రావణపూర్ణిమ: యజ్ఞోపవీతధారణము; శ్రావణము: చాతుర్మాస్యవ్రతము; శ్రావణమాసము: వరాహజయంతి, శ్రీకృష్ణజయంతి, నాగపంచమి మొదలగు పండుగలు; 'శ్రావణపట్టీ:' స్త్రీలకు దాని విలువ; ఆషాడపట్టీ మున్నగువిషయములలో నొకదానికి సంబంధించినగద్యవ్యాసముగాని, పద్యవ్యాసముగాని, శ్రావణమాసమందలి ఆచారములచే నిర్వహింపబడు కథావ్యాసముగాని, ఆఆచారములందలి లోటుపాట్లను ప్రదర్శించు హాస్యవ్యాసముగాని, శ్రావణమాససంచికకు యథోచితమని తమకు తోచు మఱియితరవిషయకవ్యాసముగాని అనుగ్రహించి గృహలక్ష్మి నాదరించి మాయుద్యమమునకు తోడ్పడవలయునని మిక్కిలి ప్రార్థించుచున్నాము. పూర్వకవిరచితములగు కావ్యములనుండి, పాటలనుండి, పదములనుండి శ్రావణమాసవిషయములను ప్రస్తావించు భాగములనుగూడ వీలగుచో సేకరించి పంపగోరుచున్నాము. శ్రావణమాససంచికకు పంపబడు వ్యాసములన్నియు జూలై 7-వతేదీలోపున మాకు చేరునట్లు పంపప్రార్థన.

ఈప్రత్యేకసంచికయొక్క విడికాపీలు కోరువారు ముందుగనే వ్రాయుట మంచిది. అదనముగ కొద్దికాపీలు మాత్రమే ముద్రించుచున్నాము.

శ్రావణసంచిక వెల రు 0-6-0 అణాలు మాత్రమే

**గృహలక్ష్మి కార్యాలయము** పోస్టుబాక్సు నెం. 752, ఎగ్మూరు.

# విషయసూచిక

## చిత్రప్రశ్నకుసమాధానము

జూలై మాసపు గృహలక్ష్మిలో శ్రీమతి మాడభూషి చూడమ్మగారిచ్చిన చిత్రప్రశ్నకు సమాధానము:

కవికర్ణరసాయనము

మేము పెట్టినగడువులోపల సరియైనసమాధానమిచ్చినవారినామములు వరుసక్రమమున క్రిందపేర్కొనుచున్నారము:

1. నుసర్ల లక్ష్మీ నరసమాంబ. 2. వావిలాల లక్ష్మీసావిత్రి. 3. ములుకుట్ల సుకన్య. 4. వరహారిశెట్టి నాగరత్నాంబ. 5. వనుపులేటి లక్ష్మీదేవమ్మ. 6. నీలయపాళెం సావిత్రి. 7. పాకల చంద్రకాంతామణి. 8. పాకల శ్రీలక్ష్మీకామేశ్వరీదేవి. 9. తూములూరి సీతమ్మ. 10. ముక్త్యాల వర్ధనాంబ. 11. భాస్కర పంతుల వెంకటసుబ్బమ్మ. 12. ఇవటూరి రోహిణీబాలామణి. 13. సామినేని హనుమాయమ్మ. 14. అక్కెళ్ల కామేశ్వరమ్మ. 15. కన్నేపల్లి వరలక్ష్మి. 16. గోవారు వెంకటభారతమ్మ. 17. మలిపెద్ది మల్లమ్మ. 18. క్రొత్తపల్లి శారదాంబ. 19. సామవేదము సీతారామమ్మ. 20. చిరంజీవి వసంతాదేవి. 21. భోగు వెంచు రత్నము. 22. తెన్నేటి అలవేలుమంగతాయారమ్మ. 23. కొప్పర్తి కృష్ణవేణి. 24. ముద్దని నారాయణమ్మ. 25. దేవులపల్లి జగదాంబ. 26. మాచిరాజు సూర్యకాంతం. 27. యిల్లింద రంగనాయకమ్మ. 28. మద్దికెరధ ర్త్రాజు వేంకటలక్ష్మమ్మ. 29. చెన్నకేశవుల లలితాబాయి. 30. బి. నాగరత్నము. 31. బలిజెపల్లి లక్ష్మీ సుబ్రహ్మణ్యావతి. 32. రెడ్డి లక్ష్మమ్మ. 33. నిమ్మగడ్డ శ్యామసుందరి. 34. యస్. శాంతమ్మ. 35. వద్దిపర్తి శకుంతలాదేవి. 36. ఎమ్. వేదపల్లి తాయారమ్మ. 37. సమయమంత్రి రాజ్యలక్ష్మి. 38. చల్లా భారతి. 39. దొంతరాజు సుశీల. 40. జి. సీతాలక్ష్మి. 41. గంటి కామేశ్వరమ్మ. 42. [illegible]. 43. ఇన టూరి బాపాయమ్మ. 44. ఇ. మాణిక్యబాయమ్మ. 45. జయంతి కమలావతి. 46. నాగలింగమ్ బసవపున్నమ్మ. 47. నాగలింగమ్ సుందరసరోజినీదేవి. 48. దిట్టకవి పార్వతీదేవి. 49. కురుగంటి వేంకటలక్ష్మమ్మ. 50. కొమ్మా వెం. నర్సమ్మ. 51. కోదూరు అనసూయ. 52. అమరవాది లక్ష్మీనరసమ్మ. 53. ఎనుబోతె సుబ్బమ్మ. 54. యస్. వి. సరళాదేవి. 55. నిప్పాణి పద్మావతి. 56. దామోజీపురపు లక్ష్మీనరసమ్మ. 57. కాజ రుక్మిణమ్మ. 58. కె. రామసుబ్బమ్మ. 59. పట్నం క్రిష్ణవేణమ్మ. 60. మానాప్రగడ శేతాయమ్మ. 61. యస్. లీలావతి. 62. కర్రి కమల.

---

# ప్రస్తావిక

శ్రీసహదేవ సూర్యప్రకాశరావు 'ఏదినాగులాబి?' అనుగద్యవ్యాస మీసంచికయందు ప్రథమసత్కారమునందినది. పరధ్యానసమాధిలోనున్న పడతి ప్రవేశించుచున్నది. కట్టిన సరిగంచుదుకూలముకంటె, పెట్టిన దోసగింజ బొట్టుకంటె ఆమెచేతిలోనున్న గులాబిపుష్పమే—అది ఆమె నఖకాంతికె మసకమసకయగుగాక—ఆకర్షణీయముగనున్నది. కాని అనుపమరామణీయకము ఆమె గ్రహించినదికాదు. విలువ తెలిసికొననప్పుడు ఒకవస్తువును నాశనముచేయుటలో నరునికంటె నారి ముందంజవేయును. కావున సర్వస్వరూపనాశనమగువఱకు ఆమె ఆగులాబిని చిదిమినది. 'ఆప్రసూనరజము ఆమె పదసరోజరజములో కలసిపోయినది. తుత్తునియలై చెల్లాచెదరయిన ఆదళములను గాలి తెలియరాని ఏసీమలకో ఎగజిమ్ముకొనిపోయినది.' ఇంత జరిగినను ఆమె పరధ్యానసమాధిలోనుండి ప్రబోధితకానేలేదు. రవికానని తావులనుగూడ చూచు కవి—వస్తుసౌందర్యము, గౌరవము ఓడ్పివడబోయు వాడగుట—ఆమెచేసిన ఈఅకృత్యమునకు కంటగిల్లినాడు. గులాబిపూవు 'బాధానిశితనిశ్వాసముల' నాతడు వినినాడు; 'తప్తజీవితమహానాశ్రువుల' నాతడు చూచినాడు. రసార్ద్రుడగుట పట్టలేకపోయినాడు. 'సుకుమారులకు క్రొవ్వాడిగోళ్లు ఎందుకు? పుష్పహృదయములను చీల్చివేయుటకా? నీగోటి ప్రతినొక్కునకు ఆప్రసూనము ఎంతగానిట్టూర్చినది! ఎంతగా కన్నీరొడ్చినది!' వాఙ్మయశరమగు ఈప్రశ్న మీదబడుటతో ఆమె పరధ్యానసమాధికి భంగముకలిగినది. ఇప్పుడు గులాబికొఱకు కలువరింత. ఆరోగ్యమువలెనే ఏవస్తువ విలువయైనను పోయినతరువాత గాని తెలియదు. తెలిసిన తరువాత పరితపించి లాభములేదు. నశించిపోవుచు ఆగులాబి తనముల్లుతో ఆమె అంగుష్ఠముపై వెలయించిన రక్తము ఆమెహృదయమునకు హత్తినది. కాని గులాబిని తిరిగిపొందవలెననుకోరిక తీరనిదియై 'ఆమె హృదంతరములో ఆమరణాంతము నిలిచిపోయినది.' అజ్ఞానమునచేసిన అకృత్యములఫలము కూడ అనుభవింపక తప్పదు.

ఈసంచికయందు ప్రథమపద్యవ్యాసము కుర్రా వేంకటసుబ్బారావు చౌదరి 'ఆడువారలసొమ్మొద్ది అట్లతద్ది' అనునది. అట్లతద్ది జాతీయములగు

తెలుగువారిపండుగలలో నొకటి. అది తుడుముమొదలు దేవతార్చనవఱకు స్త్రీలపర్వము. ఆపండుగ పచ్చందనమంతయు పాశ్చాత్యనాగరికతానుకరణ ముగల పట్టణములందుగాక జాతీయతవింకను జారవిడువని పల్లెటిసీమలందు జూడవలయును. కావుననే రైతుబిడ్డయగు కవి సాభిప్రాయముగ, సగర్వముగ 'మాపల్లెటూరిఆడువారలసొమ్మిద్ది అట్లతద్ది' అనుచున్నాడు. అది ఆడు వారల సొమ్మే. కాని అప్పుడు వారుచేయు ప్రతికృత్యమును భర్తకు సంబం ధించినదే. ముసలిమగడు రాకుండ బ్రహ్మీముహూర్తమున భోజనము; మగని చలువగోరి అభోజనము ఉట్టికిదిగువను; మగని ఆయుర్దాయమభివృద్ధి నొందు టకు గోరింటధారణము; ఊగిఊగి ఉయ్యేలదిగుచు భర్తనామముస్మరించుట. ఇంకను పేర్కొననేల? తెల్లవారుజామున, ఉదయమున, సాయంకాలమున, తొలిజాముర్రాత్రి ఈపండుగదినమున స్త్రీలొనరించు కృత్యములను కవి వరుసక్రమమున వర్ణించినాడు. జాతీయపర్వశోభను ప్రదర్శించు ఇట్టి కవిత శ్లాఘింపదగినది.

శ్రీ. కె. కుటుంబరావు 'పాతసాంప్రదాయం' అనునది ప్రథమకథా వ్యాసము. మధుసూదనరావు, సోమసుందరము, లీలావతి, హనుమా యమ్మఅను ఇందలి నలుగురుపాత్రలలో హనుమాయమ్మపాత్ర ఎక్కువ ఆకర్షణీయమైనది. కథలో సమస్య ఆమెమూలముననే గలుగుచున్నది. ఆమె జీవితము పాతసంప్రదాయములో పండినది. కాగా క్రొందుకు మధుసూదన రావు లీలావతిని రజస్వలానంతరము పరిణయమై ఆమెతోగూడ ఇంటికి వచ్చినప్పుడు హనుమాయమ్మ మాతృహృదయమును విప్పలేకపోయినది. కేవల గృహస్థధర్మములో వారికి కాల్లుకడుగుకొనుటకు నీళ్లిచ్చినది. పాత క్రొత్తలకు మేలుకలయిక ఎట్లు సంభవించును? అట్టి మేలుకలయికకొఱకు మధుసూదనుడు మోసము అవలంబించినాడు. అయితే ఆమోసము కటికి మోసముకాదు. కుటుంబసౌఖ్యమే పరమప్రయోజనముగ గలిగి పశ్చాత్తా పముచే తాల్మింపునొందిన మోసము. దానిచే ఉపాయముపారినది; లీలావతి అత్తయందు తల్లినిచూచినది; అత్త లీలావతినోటిలోనాలికనైన కనుగొన లేకపోయినది. లీలావతిచూచుట, అత్తకనుగొనలేకపోవుట వీనిమూలమున మధుసూదనునకు కుటుంబసౌఖ్యము సమకూడినది; కథను నిర్వహించిన సమస్య విచ్చిపోయినది.

—ఇంద్ర శేషగిరి రావు బి. ఏ.

# విషయసూచిక

---

# దసరాసంచిక

పైమాసపుసంచిక దసరాసంచికగ వెలువడును. అందు మామూలు సంచికయందు కంటె దాదాపు రెట్టింపుపుటలుండును. విదుషీమణులవ్యాసరాజములతో విరాజిల్లును. మనోహరములగు చిన్నకథలు నాలుగైదుండును. రెండుమూడు త్రివర్ణచిత్రములును. పెక్కు ఛాయాచిత్రములును ప్రచురింపబడును. దేశసేవాధురీణయగు శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారి త్రివర్ణచిత్రము ప్రత్యేకము ఈసంచికకొఱకు తయారుచేయబడినది. ప్రత్యేకము గృహలక్ష్మికొఱకు వ్రాయబడి బహుమానమునందిన శ్రీమతి దిగుమర్తి బుచ్చికృష్ణమ్మగారి 'గృహలక్ష్మి' అను మనోహరచిత్రము ముఖచిత్రము. విద్యలకుదేవియగు సరస్వతిని పూజించుట కేర్పడిన విజయదశమీదినములలో స్త్రీలకు, బాలికలకు విద్యావినోదమును కలిగించుటకు ఈసంచిక మిక్కిలి అనువైయుండును. చందాదారులకుపోను కొలదిసంచికలు మాత్రమే మిగులును. కావున ఆశాభంగము కలుగకుండ నేడే కార్డువ్రాసి ఒకప్రతికి ఆర్డరు రిజిష్టరుచేయించుకొనుట మంచిది. లేదా ఆసంచిక విలువమేరకు తపాలాబిళ్లలుపంపుడు. చందాదారులకు ఉచితము. ఇతరులకు ప్రతిఒక్కంటికి రు. 0—8—0 మాత్రమే.

1931

# శ్రీ విషయసూచిక

త్రి వర్ణ చి త్ర ము లు



ఛా యా చి త్ర ము లు

...   ...   ...

క్షీరసాగరమథనము పౌరాణికము. లవణసాగరమథనము చారిత్రికము. కవయిత్రి అలంకారచమత్కారమువలన పౌరాణికము చారిత్రికమైనది, చారిత్రకము పౌరాణికమైనది; సకలప్రపంచదృష్టి చరువులిడినది, భూదేవి నింగిదాక పొంగిపోయినది.

...   ...   ...

'చిన్నబాబు' చదివినతోడనే Hilaire Belloc రచియించిన 'A Conversation with a Cat' తలపునకువచ్చును. కాని ఆపిల్లి తన్ను రైల్వేరిఫ్రెష్‌మెంటురూములో మచ్చిక చేసిన Belloc పై విశ్వాసముచూపలేదు. కాని ఇందలి కుక్క అట్టిదికాదు. చిన్నబాబు 'పెంచుకోవడమంటే' ఏమిటో తెలిసికొని కుక్కపిల్లను పెంచుకొనలేదు. కుక్కపిల్ల 'ప్రేమించడమంటే' ఏమిటో తెలిసికొని చిన్నబాబును ప్రేమించలేదు. 'తీవ్రముగా గాలి. క్షోణీపాతముగా వాన. కొరికితినట్లుగా చలి. జంగమములు కదలవు. స్థావరము లెగిరిపోవుచున్నవి.' నిశితపరిశీలకుడగు కవిమాత్రము చరింపగల ఆప్రకృతివిక్రాంతిలో ఆకుక్కపిల్ల చిన్నబాబు దగ్గర కెట్లు రాగలిగినది? విశ్వాసమా! జవాబు చెప్పలేమి? చెప్పినను మడికట్టుకొని కుంపటిదగ్గిర చలి కాచుకొనుచున్న ముసలమ్మకు తెలియదందువా?

...   ...   ...

"ఆగదిలోనే." ఉత్కంఠింపజేసి హృదయమును ఉడికిలించు భావములకు ఈగద్యకావ్యము బావి. తన ప్రథమసంతానము అమలకు క్రీడామందిరమాగది. తన భార్య బిడ్డకట్లుఓర్చిన ఉపచారమందిరమది; స్త్రీశిశువునుగన్న ప్రసవగృహమది. మూడును శుభములు. అందుతో దుష్టదేవత విజృంభించినది. అశుభములు మూడినవి. పురుడు ఏడవరోజున శిశువు 'దేవుడిదగ్గరకు వెళ్లింది;' శిశువుకోసము మూడురోజులు లెడ తెగక ఏడ్చి తల్లి దీర్ఘనిద్రాముద్రితయైనది. 'అమ్మేదీ?' అనుచు అమల సుకుళించుకొనిపోయినది. ఆమూడు దేహములనుండియూ హంసలు ఆగదినుండియే లేచిపోయినవి. శుభముతరువాత అశుభము, వెన్నెలతరువాత చీకటి మఱింతదుర్భరములు. పాఠకులమనములు 'ఆగదిలోనే' ఉత్కంఠితములగుచున్నవిగాని ఆగది అగ్నిహవేదికి మాత్రము హృదయవిదారకదృశ్యము.

...   ...   ...

పేరంటము. పసుపుకుంకుమలకదియా? కాదుకాదు. మఱేయొట్టిది? పోరిపేరంటము. ఆహ్వానించినదెవరు? దేశమునుమఱవనికవి. ఆహ్వానింపబడువారెవ్వరు? దేశమును సేవింపగలస్త్రీలు. రాణిభవాని, ఝూన్సీలక్ష్మి, చాందుబీబీ, నాగమ్మలను స్మరించి 'నిలుపుమమ్మా శుభాంగి! పూర్వులప్రతిష్ఠ' అని కేక. పూర్వస్త్రీలవలె ఈపిదపకాలమున మేము చేయగలమా అని అందురా? చేయగలరు. చేయగలిగినవారున్నారు. సరోజని, కమల, రుక్మిణి, హంసవాజు. 'మీకునడ్డునె పూనికనిలచియున్న' అని ఉద్బోధ. తత్కాలికమైన ఉపయోగము కలదియేయైనను ఇట్టి ఉద్బోధకకవిత్వమునకును సారస్వతమున సముచితస్థానమున్నది.

...   ...   ...

'నాన్నగారు ఏకే డాక్టరును పిలవడానికి?' అని రోగియగు పిల్లవాడు వితంతుమాతను అమాయికముగ వైచినప్రశ్న, 'డాక్టరు ఏడిరా? అన్నయ్యా!' అని ఆపుత్రవతి ఆతురతతో వైచిన ప్రశ్న, డాక్టరువచ్చి చప్పరించి చల్లగజారగా ఇంకను 'వస్తున్నాడు' అని 'గుడ్లలో నీరు కుక్కుకొంటూ' అన్నయ్యాడినపచ్చి అబద్ధము-వీనితో 'దుఃఖమయప్రపంచము'న దుఃఖమునకు స్థాయీభావము. ఈకావ్యము ఎత్తుగడలో నవల, నడుమను కథ, చివర గీతము. మిగులునది వేదాంతము.

...   ...   ...

మాతృదేశమునర్పింప ఎంతటి మాహాత్మ్యనకైన పాఠమగుత్యాగమును, మాతృదాస్యహృదయోద్వేగమ్ము వేధింప స్తన్యమిచ్చుపసిపాపన్ తో జైలునారార్చి ఆవేశమూర్తిని బందిఖానాలకుచని తెగువను, గాత్రమెల్లను దండాహతమై శోణితము కాల్వలుగట్టినను వీడని శాంతమును చూపి నేటిభారతవంశమెల్లలరింపజేసిన నారీమణిని భూషించు 'భారతనారీమణి' ఈమాసపు గృహలక్ష్మికొకభూషణము.

...   ...   ...

కొన్ని స్థలములమాహాత్మ్యమట్టిది. పిరికితనమునకు పేరుమోసిన కుందేలు ఒకచోట తోడేలును ఎదుర్కొని విజయమంది ఆప్రదేశమును విజయనగరముగా చేయును. పిరికితనమునకు పేరుమోసిన కోమటికులమునబుట్టి ఒకకొమ్మ మఱియొకచోట పరరాజుల

నెదుర్కొని 'ఉష్ణకీలాలపిపాసులాడు పులిదై' ఆంధ్రదేశమును బొబ్బిలిని చేయును. 'వీరకుమారులంగనిన వెల్మకులాంగనలార! లెండు! ...వనితయె పూనుకున్న తరువాత ప్రాణముల లెక్కయేమి?' అని యుద్బోధించి యుద్ధమునకుఱికె. అద్భుతవిక్రమము నెఱపిన కోమటి కొమ్మ శేరీవెంకుచరిత్ర జానపదగీతములనుండి ఉద్ధరింపబడినది. మల్లమదేవి బొబ్బిలిముట్టడిని ఆపుచేయ విజయరామరాజునకు లేఖవ్రాయుట, విందుచూలాలు రమణమ్మ తనకుతానై పొడుచుకొని మరణించుట మొదలగు లెక్కలేని ఉత్కృష్టమైన విషయములు ఇంకను జానపదములయందే జానపదమునజాలి పడుచున్నవి. ఇట్టివానిని చరిత్రమునకెక్కింపవచ్చునా యని సంశయించువారు 'History is Fables that have been agreed upon' అను నెపోలియనువాక్యమును జపింపనగును. ధర్మయుద్ధమున జయింపజాలక వెంకును వైరులు 'విద్రోహంపువ్యూహమ్ము చేత జ్వలదగ్నికుండమున' ద్రోయించిరి. ఈకథ వినునప్పుడెల్ల ఆంధ్రధరణీసీమంతినీసంఘము జీవచ్చిత్రముకాగలదు.

... ... ...

అమావాస్య (దీపావళి)నాడు ఆరంభము. పూర్ణిమ (కార్తిక)తో పూర్తి. పెండ్లియైనతరువాత మూడుసంవత్సరములు. క్రొత్తపరిసరములుగల అత్తింటికిబోవు లేతబాలికకు వాక్సంయమశక్తి గలిగించుటకీ మూగనోము సాముగరిడీ. దీక్షాసమయమున పెదవి మెదపరాదు, పెలుచనవ్వరాదు. 'ముద్దులొలికించెడి మోవిదెరల్చి తేనియల్ జాలుకొనంగ ఒక్కనుడిచాలు వచింపు శ్రవణప్రియంబుగా' అని దీక్షావతీశుకరాంద్రగు ముత్తయిదువల వంచనాపూర్వకమగుమృదుప్రార్థన. అయినను మాఱుమాటలేదు. ప్రత్యేకముగ రాళ్లనంకె ప్రస్తావన. అయినను ఉబ్బితబ్బిబ్బుఅయి ఊసులెత్తలేదు. 'సరిగా ప్రతిపూర్తికొసర్చి' ఈపరీక్షలో జయము వడసిన జవాప్రతికు కవిచేసిన హితబోధమిదిగో:

"నోములనోచి, పెల్లుగ మ
నోరథముల్ సమకూర్చుకొన్న వా
రీమహిళావతంసలు; త
రించినవీరి యమోఘసద్వచ
స్తోమవిభూతి లేతమన
సున్ దడియార్చి కలంచుచున్న నీ
కామితముల్ ఫలించు పద
కంజములంటి నమస్కరింపవా."

... ... ...

1662-లో తంజాపురి ఆంధ్రనాయకరాజ్యమున, 1734-లో పెద్దాపురసంస్థానమున, 1757-లో బొబ్బిలి సంస్థానమున విప్లవములు జరుగగా ఆయా రాజకుమారుల రహస్యరక్షణము స్త్రీలపైబడినది. ఆస్త్రీలు కృతకృత్యులైరి. కాని తంజాపురి, పెద్దాపురరాజ్యములు తరువాత పికస్తుపడినవి. బొబ్బిలి నేటికినిగలదు.

"అపుడుజరిగిన బొబ్బిలి యాహవమున
రక్షితుండైన వెలమకుఱ్ఱని మహోర్వ
యమ్మ పలుశాఖలై భూమియందు నేడు
శాశ్వతమ్మయి కీర్తివిస్తారమయ్యె."

ఇది మల్లమదేవిదాసికి మంచియోగ్యతాపత్రము.

... ... ...

ఔరంగజేబు మద్యముముట్టని మతజీవి. అతని భార్య ఉదయపురి తనపై నాతనికిగల ప్రేమను పరీక్షించుటకు ఔరంగజేబును మద్యపానము చేయగోరెను. ఉదయపురియందలి మోహముచేత మతమును మంటగలపి ఔరంగజేబు పానపాత్ర పెదవిదగ్గఱకు తెచ్చెను. అంతట ఉదయపురి 'పరీక్షతీరినది. ఇక ఆచారమును పోనాడనేల?' అనుచు పానపాత్రనులాగి వైచినది. 'ప్రేమవాహిని'లోని నాయిక ఉదయపురి వంటి పరీక్షకురాలు మాత్రమేకాదు. రక్తదాహముకల రాక్షసి. ఆరాక్షసివలన కామాంధుడైనఆమెప్రియుడు మాతృహృదయగభీరతనుగ్రహించి అపస్మారి కాగలిగెవాడు. కొడుకుచేతికత్తివాడిమొన తనచేతిని గాయపఱచియుష్ణరక్తమును ప్రవహింపచేయుచున్నను పరికింపక కత్తిపిడిపట్టువలన కొడుకుచేయి రొక్కడ ఎడద్రెచ్చునోయని ఆతురపడిన హైందవవాఙ్మయమునందలి చాణక్యునితల్లి యదార్థవృత్తాంతముతో రిచెపిన్ రచితమగు ఈ ఫ్రెంచికథ జతపడుచున్నది.

—ఆంధ్ర శేషగిరిరావు బి. ఏ.

# విషయసూచిక

దేవ శేషమ్మగారి దైవభక్తి; కాశీబాంబు కేసులో ఇరువురు కాంతలు; శ్రీ కమలాదేవిఛటోపాధ్యాయుగారి నియామకము; గాంధిమహాత్మునకు జన్మదినబహుమానము; స్త్రీలహక్కులకై కష్టించువారిలో పేటి; నగలకు డబ్బుఅడిగినందుకు; స్త్రీలు, గృహము: మహాత్ముని వ్యాసము.



## సమస్యాపూరణ బహుమానము

సెప్టెంబరుమాసము గృహలక్ష్మిలో ప్రచురింపబడిన అగష్టుమాసపు సమస్యాపూరణములందు శ్రీమతి గండికోట సావిత్రీదేవిగారిపూరణము ప్రశస్తతరముగఉన్నదని గృహలక్ష్మిపాఠకులు పలువురువ్రాసిరి. కావున అందుకు నిర్దేశింపబడిన బహుమానము శ్రీమతి సావిత్రీదేవిగారికిపంప నిర్ణయించుటయైనది.

—సంపాదకుడు.

# గృహలక్ష్మి

## ఏజెంట్లు

| | |
|---|---|
| తెనాలి: | కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివు ఆఫ్ న్యూస్ |
| బళ్లారి: | వి. రాజుమొదలియార్ & సన్సు, కారువీధి. |
| బెజవాడ: | నామల ఆంతోని. |
| మచిలీపట్టణము: | కె. బాలకృష్ణ. |
| తిరుపతి: | వై. వి. సుబ్బయ్య & కంపెని, వెంకటేశనివాస్. |
| హైదరాబాదు: | ఎన్. లక్ష్మీబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్తా మార్కెటురోడ్డు,(మన ప్రాంతపు 1 రూఉస్మానియారూ 1-3-0అగును) |
| నిడదవోలు: | తాడిమేటి కుటుంబశాస్త్రిగారు. |
| కొవ్వూరు: | జి. వి. రామరావుగారు. |
| ఏలూరు: | ఎస్. పి. ఆచార్లుగారు, పవర్ పేట. |
| రాజమండ్రి: | ఏ. కృష్ణమూర్తి బ్రదర్సు. |
| తాడేపల్లిగూడెం: | కాశిరాజు శ్రీరాములుగారు |
| బరంపురం: | గోనియశెట్టిగారు, గొల్లపల్లి. |
| అమలాపురం: | కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం. |
| పాలకొల్లు: | వేమరాజు నరసింహంగారు, హెడ్మాస్టరు, మట్టపల్లి. |
| అనకాపల్లి: | గ్రంథి కన్నయ్యపంతులు, గాంధిమార్కెటు. |
| విజయనగరం: | కేసనపల్లి రామలింగంగారు, పొత్తూరివారి వీధి. |
| పిఠాపురం: | ఎం. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం. |
| విశాఖపట్టణం: | అందే కృష్ణమూర్తి బ్రదర్సు, న్యూస్ ఏజంట్లు. |
| జేమ్షెడ్పూరు. | టి. వి. రమణయ్యగారు, 12 టేమరియా రోడ్డు, న్యూ 'L' టౌను. |
| మదరాసు: | వై. జానకమ్మగారు, కమెర్షియలు బుక్ డిపో, 364, ఎస్ప్లనేడు. |
| ,, | ఆకుండి వేంకటశాస్త్రి. |

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి", తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.

1931

... ... ...

'నిన్న మొన్న పతిపలుకరించిన పలుకు నేరని ముగుద నేడు భర్తతోడ స్వర్గలోకప్రయాణము.' ఇట్టి ఘటనములు సహగమనములకు పారక్షేత్రమగు భారత భూమియందే. పతివియోగసంతాపము ముందు భారత స్త్రీకి చితాకాష్ఠోద్దీపితమగు వహ్నితాపము దిగదుడుపు. కావున ఆమె అనలముఖమున నిమిషవేదనకు నోర్చి పతితోడిదలోకమైయేగును. 'రాత్రిత్రయం' కష్టాంతిక కావ్యము. అయినను విచారమును రేపదు. జారిపోవుచున్న కేశభారమునుండి పువ్వులు రాలిపోవుచుండుగాక, దూరముగా పల్లెరమున అరవిరిసినవిరజాజులదండ పరిమళించుచు నేయున్నదిగదా! అయితే ఆపరిమళము నిశ్శబ్దమైనది. అట్లే ఈకష్టాంతిక కావ్యమునదుఃఖము లేదుగాని హద్దులేని నివ్వెఱపాటు ఉన్నది. కాని ఆనివ్వెఱపాటు స్తుతిలో పర్యవసించుచున్నది. మొదటిరాత్రి చెదరనినిద్ర. రెండవరాత్రి చెదరగొట్టుటకు కుక్కుటారవమునకుదోడు సమరము. మూడవ రాత్రి మూడినరాత్రియే. మూన్నాళ్లముచ్చట జీవించినజీవితము.ఆర్జించినకీర్తి కలకాలపుది.

... ... ...

బాల్యమున సాధారణముగ ఆదర్శజీవితముపై కాంక్ష ఎక్కుడు. ఆకాంక్షతీర్చుకొనుటకు ప్రయత్నించుటలో మానవుడు పెక్కుసందేహములను పొందుచున్నాడు. ఆసందేహములుతీరెనా అతడు ఆదర్శజీవనుడు కాగలడు. తీరవా అతనిపనిఅంతేయౌ. తీర్చుట, తీర్చకుండుట తల్లిచేతులలోనున్నది. "ఈవుస్వర్గమువడయంగా నెంతువేని సకలసద్గుణమూర్తివై సంచరింపు"మని ఏతల్లి అనగలుగుచున్నదో అతల్లి బిడ్డకు 'ఉత్తమలోకము.'

... ... ...

బొమ్మలకూటమునకు పేరటాండ్ర బిలుచుటలో ప్రతిశీలయగు కన్యయొకతె, భారతదేవిని భవ్యభావము లెదజాలువాణి బూజించుటలో కవయిత్రియగు కుమారియొకతె, వింతభావాలు డెందాన వెల్లివిరియ పండుగకు నేగుదెంచినపతిని అమ్మచాటుననిల్చి గాంచుటలో మీనాక్షియైన వధువుయొకతె, కాలిభూషలు సల్పుక్రమనాదములతో వీథివీథులతిరుగుచు వాస్తవ్యలక్ష్మింపు వడపప్పు బెల్లములు గొనివచ్చుటలో పురికి చెలువమునించు బాలికయొకతె శ్రీనాథునిసీసములతో దొరయగలుగు సీసములందు 'శరద్వేళ'లో చిత్రప్రదర్శనముగాంచిరి.

... ... ...

"క్రొంగ్రొత్తకవనములఁగూర్చుటతోఁ బ్రాఁబడిన కవనముల బయల్పఱచుటయు భాషాసౌందర్యమునకుఁ బోషకమేగదా!" కవనము కావ్యములలోనేగాదు జానపదగీతములందును. పండితులు శ్రీసీరిపి ఆంజనేయులుగారు జానపదగీతసంపాదనమునకు దొరకొనుట సంతోషము. తెలుగుదనమునకు లేటపలుకలు ఈ జానపదగీతములు. 'కప్పమ్మపాట' పాడునెడ సర్దారుల యందు తంగెడాకులకుబదులు వేపమండలుంచుదురు.

... ... ...

"ఆరయనాల్మగళ్లహృద
యంబు లనంబడురెండురజ్జువుల్
కూరిమి యన్ పురింబెనఁగి
కూడి యభేదమునన్ రహింపఁగాఁ
జేరినపెంపు దేవనీఁక
వేర్పడకుండఁగ జేర్పడున్ సుతా
కారపుముళ్లు, ముళ్లటె య
ఖండసుఖోదయ మూలకందముల్."

అను ఉచితజ్ఞుడగు కవివచనమును కాముకుడగు చంద్రంనాన్నయెడ సార్థకముగాదు. 'ఏంచేస్తావో చూడునన్ను' అను కొమరునివాక్యమునకు అతడు కరగలేనట్లే. కష్టపరంపరలతో క్రుంగిపోయే ఆమాతృహృదయసాగరంలో మాత్రము కనుగందగుచంద్రం ఈ మాటలు ఆశావీచికలను రేపినవి. ఉసురులునిలిపినవి.

... ... ...

మద్యపానసాత్త్వికనిరోధము. తీయనికలకండ తేనె మాటలతో ఇందలి శైలి శ్రీరాయప్రోలు సుబ్బరాయని శైలినిదలపించుచున్నది. రెండవపద్యమున ఇది స్త్రీకవిత యనిపింపజాలుభావములు 'మూర్తిదాల్చి' నిలచినవి.

... ... ...

కటికిరాయిమీద నీతకంకటి. కూర్చుండిపేదరాలు. ఇంటపెండ్లికి ఎదిగియున్నపిల్ల. మగనికి పగలు ఎముకలువిఱుగునట్టుపని. కుప్పలువడ్డకాళ్లతో రాత్రినమయమునరాక. ఆపేదరాలి మనము ఎంత కుతకుతలాడునో? 'కూతురుఁదలంపఁ గంటికిఁగూర్కురాదు' అను దుఃఖమేఘము. 'పరులమోచేతినీరుఁ జేఁబట్టఁబోడు నేమిపుణ్యామొ? నాకబ్బెఇట్టిభర్త.' అను సుఖవిద్యుల్లత. మఱునిముసమున 'మనెడుగీఁతకలదో? లేదో?' అను సందేహాశని. పేదవారివేదన లిట్టివి.

—ఆంధ్ర శేషగిరిరావు బి. ఏ.

# గృహలక్ష్మి

## ఏజెంట్లు

| | |
|---|---|
| తెనాలి: | కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివు ఆఫ్ న్యూస్ |
| బళ్లారి: | వి. రాజుమొదలియార్ & సన్సు, కారువీధి. |
| బెజవాడ: | నామల ఆంతోని. |
| మచిలీపట్టణము: | కె. బాలకృష్ణ. |
| తిరుపతి: | వై. వి. సుబ్బయ్య & కంపెని, వెంకటేశనివాస్. |
| హైదరాబాదు: | ఎన్. లక్ష్మిబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటురోడ్డు,(మన ప్రాంతపు 1 రూఉస్మానియారూ 1-3-0అగును) |
| నిడదవోలు: | తాడిమేటి కుటుంబశాస్త్రిగారు. |
| కొవ్వూరు: | జి. వి. రామరావుగారు. |
| ఏలూరు: | ఎస్. పి. ఆచార్లుగారు, పవర్‌పేట. |
| రాజమండ్రి: | ఏ. కృష్ణమూర్తి బ్రదర్స్. |
| తాడేపల్లిగూడెం: | కాశీరాజు శ్రీరాములుగారు |
| బరంపురం: | గోనియశెట్టిగారు, గొల్లపల్లి. |
| అమలాపురం: | కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం. |
| పాలకొల్లు: | వేమరాజు నరసింహంగారు, హెడ్మాస్టరు, మట్టపఱ్ఱు. |
| అనకాపల్లి: | గ్రంధి కన్నయ్యపంతులు, గాంధిమార్కెటు. |
| విజయనగరం: | కేసనపల్లి రామలింగంగారు, పాత్తూరివారి వీధి. |
| పిఠాపురం: | ఎం. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం. |
| విశాఖపట్టణం: | అందే కృష్ణమూర్తి బ్రదర్సు. |
| జేమ్షెడ్‌పూరు. | టి. వి. రమణయ్యగారు, 3 టిల్‌జగ రోడ్డు, న్యూ 'L' టౌను. |
| మదరాసు: | వై. జానకమ్మగారు, కమెర్షియలు బుక్‌డిపో, 364, ఎస్ప్లనేడు. |
| ,, | ఆకుండి వేంకటశాస్త్రిగారు. |

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి", తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.

# విషయసూచిక

# నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్

1. ఈపరీక్షలకుఁగా బంపబడు వ్యాసములలో ఉత్తమమగు దానిని రచించినవారికి "కేసరి స్వర్ణపదకమును," "రేబాల సుందరరామరెడ్డిగారి స్వర్ణపదకమును" ఒసంగబడును.

2. ఈపరీక్షలలోఁ దొలిదానికి, అనగా "కేసరి స్వర్ణపదక" పరీక్షకు స్త్రీలు మాత్రమే పోటీచేయ నర్హులు. రెండవదానికి బోధనాభ్యసనపాఠశాలలోను ఉన్నతపాఠశాలలలో 4-5-6 ఫారములలలో ఇంటర్మీడియేటు తరగతిలోను సంస్కృతాంధ్రవిద్యాశాలలో విద్వాన్, శిరోమణికక్ష్యలకంటె తక్కువకక్ష్యలలోను చదువు విద్యార్థియేని, విద్యార్థినియేని పోటీచేయవచ్చును.

3. విషయములు. (1) ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమువలన ఆంధ్రస్త్రీలకు కలుగులాభములు. స్త్రీలకు మాత్రమే. (2) భావకవిత్వము సమాదరణీయమా?

4 వ్యాసము అగ్రామ్యభాష నుండవలయును. లేఖనము కాగితమున కొక్కప్రక్కనే యుండవలయును. వ్యాసము సాధారణపు ఫూల్‌స్కాప్ కొలతగల పుటలు పదునేనింటి కెక్కువయుండరాదు. వ్యాసమున గ్రంథములనుండి అనువాదములు వెుదలగునవియున్న ఆగ్రంథాదికముపేరు లాయాపుటలయడుగుననే వ్రాయబడవలయును. దీర్ఘములైన యనువాదములుండరాదు. భాషయందు రుచిరతయు, భావమున స్వాతంత్ర్యమును, కథనమున కౌశలమును ఎక్కువగుణములు (*Marks*) పడయగలవు.

5. వ్యాసమునగాక, వేరొకపుటలో పోటీచేయువారు తమపేరును, తండ్రి లేదా పోషణకర్త పేరును, తాము చదువుచున్న విద్యాలయముపేరును విశదముగావ్రాసి అందుక్రిందనే తద్వ్యాసరచనకుఁగాఁదాను పేర్కొన్న గ్రంథాదికము తక్క నితరము చూడలేదనియు, వ్యాసముసొంతముగా నితరసహాయ్యములేక రచించితిమనియు, ఒకజ్ఞాపకమువ్రాసి చేవ్రాలుచేయవలయును. తానెరింగినంతవరకు వ్యాసము అభ్యర్థిలేక అభ్యర్థినిరచించినదేయని ఈకాగితమున దమపాఠశాల ప్రధానోపాధ్యాయునిచే వ్రాయించి యాయన చేవ్రాలు పడయవలయును. కేసరిస్వర్ణపదకపరీక్షకు పాఠశాల ప్రస్తావనమక్కరలేదు. విద్యార్థినులేగాక యెల్లరు స్త్రీలును యీపోటీయందు పాల్గొనవచ్చును.

6. పోటీచేయువారి పేరుగాని, చేవ్రాలుగాని, వారిని గుర్తింపసాధనములగు నితరచిహ్నములుగాని వ్యాసమున నెచ్చటను ఉండరాదు. అభ్యర్థులు తమ వ్యాసముల నెల్లూరు ప్రోగ్రెసివ్‌యూనియన్ కార్యదర్శి పేర 1932 సం॥ జనవరి 15 తేదికిగాని అంతకుముందేగాని చేరునట్లు రిజిష్టరు పోస్టులోఁ బంపుకోవలయును.

. . .   . . .   . . .

సీత పదహారేళ్ళ పల్లెటూరిపిల్ల. పెద్ద పెద్ద పట్టణాలు ఏవీ చూడలేదు. విలక్షణమైన కలకత్తాస్త్రీల మేలిముసుగునుగూర్చి విన్నది మొదలు ఆమెకు కలకత్తా పోయి అచ్చటి తనసోదరీమణులను చూడవలయునని బుద్ధిపుట్టినది. తనమగనికి కలకత్తాభాష తెలిసియుండుటచేత, తమయింటనున్న సరోజనీదేవి చిత్రమును నిత్యము చూచుచుండుటచేత, శకుంతలమాటలచేత ఆబుద్ధి హెచ్చరేగినది. డబ్బుఖర్చుచేసి కలకత్తాపోవుటకు ఇష్టములేని ఆమెమగడు ఆమె అమాయకగుణమును ఆధారముగచేసికొని మద్రాసును కలకత్తా చేసినాడు. తనకు ఎగ్జామినరుషిప్పువచ్చినది కాని సీతకు మేలిముసుగులసందర్శనముకాలేదు. అనుమానమునకు అవకాశములేకుండ రమణ అబద్ధమాడినాడు. అనుమానమునకు అవకాశముకలుగునట్లు ప్లీడరుగారిభార్య హాస్యమాడినది. అనుమానము దృఢపడుటకు డాక్టరుగారిభార్య ప్రశ్నవైచినది. పతి పరాస్కంది. అందుకశిక్ష, పేపర్లుదిద్దుటవలనగావచ్చినధనము కలకత్తాప్రయాణములో ఖర్చుచేయనిశ్చయించుట. ఈసారి కలకత్తాకుటిక్కెట్టు వాళ్ళపెద్దనాన్నకొడుకుచే తెప్పించుటకు సీతనిశ్చయించినది. అంతనటుకు కాంతా తీవ్రతనుకట్టియుంచుటకు 'పోనీలెండి. నేను చెన్నపట్టణమే చూడామనుకున్నాను. కలకత్తాలో ఏముందేమిటి?' అని సమాధానము చెప్పుకొన్నది. ఇంతకన్న అమాయకత ఏముండును?

. . .   . . .   . . .

సువర్ణతండ్రి ప్రౌఢావివాహవాది. కాని కూతురికి ఆడవాళ్ళపోరువలన బాల్యముననే వివాహము చేయక తప్పినది కాదు. బాల్యవివాహము చేసినను ఆదర్శమును పోనాడక సమర్థించుకొనుటకు అతడు తలపెట్టినాడు. ఆతలపులచేత సువర్ణకు మగడు బావైనాడు, మంగళసూత్రము ఆంజనేయునిబిళ్ళ అయినది. ఆదర్శము పొందబడుచుండ ఎంతగ సంతసించెనో ఆదర్శము భంగపడుచుండ అంతగ కళవళమునొందెను. 'ఆనాటిపెళ్ళి మీకర్థంఅయింది, యీనాటిపెళ్ళి మాకర్థంఅయింది' అని సువర్ణ అనువరకు ఆమెతండ్రికి కళవళము తగ్గలేదు. క్రొత్తపోస్తరుకథ.

. . .   . . .   . . .

గృహలక్ష్ములారా! వినుడు. సామజములకుపోలె మీసత్వము మీకు తెలియదు. ఘోలానిగంటలమ్రోత సామజములకు వానిసత్త్వము జ్ఞప్తికిఁగొనివచ్చునట్లే కవిపోహాశించినవాక్యములమ్రోత మీకు మీసత్వమును జ్ఞప్తికిఁగొనిరాగలదు. జీవితేశ్వరుని ఖిన్నహృత్సీమయందు క్రొత్తచెలువముకూర్చుటకు ప్రణయసృష్టినికురియింపగల వర్షదేవతలుమీరు. జీవితేశుని హృదావ్యకులభావములను లయము చేయుటకు రుద్రులు మీరు. గేస్తుని సంసారసాగరమునుండి తేల్చి సౌఖ్యతీరమునకుచేర్చు పోతవాహులు మీరు. మీచూడ్కులు చీకటినివిరియించు వెన్నెలలుమాత్రమేకాదు.

మృదులగుణసంపద యొకించుకేని లేని
మనుజాకతిసాత్మ్యయొక్క క్రొమ్మించురాయి
ప్రణయమురులించి సోయగంబువరహించు

అమృతపాత్రలు. మీహాసార్ద్రరుచులు ముక్తాఫలములను సృష్టిచేయగలవు. మీప్రభావమున

పురుషభావమ్ము శేదమే యొలుగనట్టి
క్రమన్మత్యమనోజ్ఞశిఖాశళంబు

అగుచున్నది. తెలిసికొంటిరా?

. . .   . . .   . . .

సమస్యలేదు. సందేశములేదు. సంభాషణలలో వైచిత్రిలేదు, వైదగ్ధిలేదు. కానికథలో అవ్యక్తమైన ఆనందముకలదు. అయితే ఆఆనందనిష్పత్తి ఎవరివలన? కథానాయకునివలనగాదు. కథానాయికవలనను గాదు. మఱియెవరివలన? మణీదేవివలన. ఆమె హాస్యప్రియ; కార్యచతుర. ఏదోమిషకల్పించి లతాంతని చావడిలోనికిరప్పించినది. కథానాయకుని అనిమిషనయనములలో అమృతముకురియింపచేసినది. చెప్పుట దేవినిపొమ్మని, చేయుట తానులోనికిపోవుట: కథానాయికేవృత్తము. దేవి చప్పట్లుకొట్టి నవ్వుకొన్నది. చదువరులు ఆచమత్కారమునకు మురియుచున్నారు. సన్నివేశమును తానేకల్పించినది. చమత్కారమును తానేపుట్టించినది. ఇతరులుకల్పించిన సన్నివేశమునుండియు చమత్కారమును పుట్టించు నేర్పు ఆమెకుగలదు. బావ లతాంతచే మగనికి లతాంతములతో పూజచేయించినాడు. 'నేను చూపాలే! నువ్వుచేసినపూజ, లతాంతా! ఇంకేం? వ్యవహారముముదిరింది.' అని మణీదేవి అందుకొన్నది. సాంసారికమగు ఈఆనందము సార్వత్రికము. యువదంపతులు మణీదేవివంటి సఖ్రీచికొఱకు అన్వేషింతురు. అట్టిసఖ్రీచి దొరకెనా వారిలేబ్రాయంపుప్రణయజీవితము ఆనందమయము. ఆఆనందము స్వప్నమాత్రమేగాదు, పర

స్వమును. కావుననే ఈకథ అన్నివేదులలో రక్తి కట్టినది.

... ... ...

'పెద్దాపురంలోడ్డే దొంగలభయం.' జీవితమార్గమున ప్రమాదభయము. 'ప్రపంచంలో నాకానాడు ఆవెంకట్రామయ్యమామంతమంచివాడు మఱి కనబడలే.' సుఖమైనవాడు మానవుడు భగవంతుని గూర్చియు నిట్లేఅనుకొనుచున్నాడు. తనజీవితకాలమున మానవుడు ఎంతమందిగాజులసెట్టులను కలిసికొనుటలేదు? గవేషణ. భగవంతుడు దబ్బునరానట్లే వేంకటరామయ్యమామయురాడు. వేంకటరావు పుంతలో నిల్చునిఉందామని బండినుండిదూకియు రోడ్డుమీదేఉన్నాడు. మానవుడు తప్పించుకొనదలచినవాని యందే బడుచున్నాడు. వేంకటరావునకు గాజుసంగరము. మానవునకుఆశ. 'అంతభయం గాజుంగరం తెచ్చిపెట్టిందినీకు చూచేవా?' అని వేంకటరావుకుప్రశ్న. 'అంతభయం ఆశయే తెచ్చిపెట్టుతుందినీకు. తెలిసికొంటివా?' అని మానవునకుప్రశ్న. గొల్లగంగన్నలాంతరు వేంకటరావుభయమును పోగొట్టినది. వెలుగువచ్చి మానవునిభయమును పోకార్చును. మానవుడు తన్నుతా తెలిసికొనును. ఆత్మజ్ఞానము. చిన్నివ్యాసమున ఎంతటి గంభీరబోధ!

... ... ...

పాలిపాటపాలకున 'గృహలక్ష్మి'కి తొలుత తెలిపినవారు మిత్రులు శ్రీకొసరాజు రాఘవయ్యచౌదరిగారు. పాలకున తెలుపుటయేగాదు సేకరించియు నిచ్చిరి. ఇంకను పలువురుమిత్రులు సేకరించిపంపిరి. అవకాశమువెంట అవి గృహలక్ష్మిలో ప్రచురింపబడుచున్నవి. పాలకుపాటుయొక్క రాటు పాటుమానినులకు కనిపింపకుండుటకై పల్లెపదములుపుట్టినవి. పాలిపాటలు కుప్పనూర్పుడుసమయములందు పాడుదురు. కుప్పనూర్చెడిపశువులుకూడ ఈపాటకు పరవళ్లుత్రొక్కును. ఇక మానవునిసంగతిచెప్పనేల? నిజమైన తెనుగుదనమును చూడదలచువారు ఇట్టిపాటలను పరామర్శింపవలయును. ప్రబంధములలో ఘనీభవించిన ఆంధ్రము-ఈపాటలలో జాలువాఱు తెలుగుదనము. ప్రబంధములలో సాంస్కృతికాంధ్రము-ఈపాటలలో జాను తెనుగు. పల్లెటిజనముల హానిచేయుట ఎఱుగనిఊహలు, పాపమునకు భయపడుపోహలు, అమాయకమగుభక్తి, పోతరమెఱుగని ఆవేశము ఈ పాటలయందు ప్రతిబింబితములైయుండును. విస్మృతిగహనము పాలుకాకుండ వీనినిసేకరించి తెలుగువారికర్పించిన మహనీయులెల్లరు వందనీయులు.

—ఆంధ్ర శేషగిరిరావు బి. ఏ.

---

1932 ౙ 550

11

# విషయసూచిక

# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

సం॥ చందా. రు. 4.

విడి ప్రతిక. అ. 6

మాదిరి ప్రతిక కోరువారు

6 అణాల స్టాంపులను పంపవలెను

ప్రకటన రేట్లు

నెలకు ఒక పుటకు. రు. 15

నెలకు ½ పుటకు. రు. 10

నెలకు ¼ పుటకు. రు. 7

6 నెలలకు పైగా ప్రకటించువారికి నూటికి 12½ వంతున కమీషను మినహాయింపబడును.

మేనేజరు

గృహలక్ష్మి

తపాలపెట్టె. 752, ఎగ్మూరు, మదరాసు.

## 1932 మార్చివరకు ఈదిగువపొత్తములు

తగ్గింపు వెలకు దొరకును

| | ఆదివెల | తగ్గింపువెల |
|---|---|---|
| 1. జనపదములు ప్రతి 1-కి | 0 4 0 | 0 1 0 |
| 2. మాతృదేశకీర్తనము | 0 4 0 | 0 1 0 |
| 3. కలరుతము | 0 4 0 | 0 1 0 |
| 4. జంటలు | 1 0 0 | 0 8 0 |
| 5. కోవెరు | 0 4 0 | 0 2 0 |
| 6. ఆగడపలు | 0 8 0 | 0 4 0 |
| 7. చిట్టికత | 0 6 0 | 0 3 0 |
| 8. చదువులదుత్త | 0 4 0 | 0 1 0 |
| మొత్తం | 3 2 0 | 1 5 0 |

ఎనిమిదిపుస్తకములుకలిపితీసికొన్న రు 1-0-0. రూపాయయును ముందు తెరువుతో పంపినవారికి వేరు తపాలఖర్చులుండవు. వలసినచో కృతికర్తలగు

కవికొండల వేంకటరావుగారు,

నరసాపురము, పశ్చిమగోదావరిజిల్లా.

అనివ్రాసినం బడయగలరు.

... ... ...

ఈమాసపుసంచిక రవీంద్రునిసంచికగ వెలువరింప ఉద్దేశింపబడినది. తదుపరానికారణములవలన ఆతలంపులు పూర్తిగ పచేళిములు కాలేదు. గృహలక్ష్మిలో నాలుగైదుమాసములుగ రవీంద్రుని వ్యాసముల కనువాదములగు వ్యాసములు విస్తరించియుండుచున్నవి. ఈసంచికయందు మరికొన్ని ప్రచురింపబడినవి. డిసెంబరు సంచికలోని శ్రీ చిరుమామిళ్ళ శివరామకృష్ణ ప్రసాదుగారి 'అక్క' అనుకథావ్యాసమును రవీంద్రుని కథకు తెనిగింపే. రవీంద్రుని ప్రతిభ, తత్త్వము వెల్లడించుటకు ఈ అనువాదములు చాలియున్నవి. భారత కీర్తిని ఖండాంతరములందు వ్యాపింపజేసినవారిలో మేటియగు రవీంద్రునకు భారతలోకమంతయు విశేషముగ ఋణపడియున్నది. పర్వతమంతటిఆఋణములో పరమాణువంతయైన ఈగికొనుటకు 'గృహలక్ష్మి' ఈ రీతిని ప్రయత్నించినది. ఇక రవీంద్రునిరచనములకు అనువాదములను 'గృహలక్ష్మి' ప్రచురింపజాలదు.

... ... ...

బంగారుపళ్లెమునకైనను గోడచేర్పు వలయును. ప్రతిభావంతునకైనను ఉద్ధారకుడువలయును. రవీంద్రుని ప్రపంచమువారిచే కవీంద్రునిగ శ్లాఘింపచేసినవాడు ఐరిషుకవిసత్తముడు ఈట్సు. ఈస్నేహితుని భారతీయు లెన్నడును మఱువజాలరు. రవీంద్రుడు కవీంద్రుడైనాడు. నోబిల్ బహుమానమందినాడు. భారతిని విశ్వభారతిగ నొనరించినాడు. డెబ్బదియేండ్లు నిండించుకొన్నాడు. వయస్సున ముదుకడే. కాని భావముల యువకుడు. కావున, ఆతనిహస్తచాలనమున ఇంకను 'అక్షయ దివ్య కళా విలాసములు పూలలు పూయును'గాక! ఆతడు ఇంకను 'ప్రకృతి శోభారహస్యముల్ ప్రతిఫలించు కావ్యములనల్లి ప్రత్యూషకాలములను మధురగళమెత్తి పాడును' గాక!

... ... ...

ఆంధ్రవాఙ్మయమున భక్తిరసము మృగ్యమని నేటి విమర్శకులందురు. ఇది సత్యదూరము. ప్రబంధకుడ్యములను దాటనివారికి ఆంధ్రవాఙ్మయమున భక్తిరసము మృగ్యమే. శతకములకు, కీర్తనలకుపోయితిమేని భక్తిరసము తొట్టికలాడుచుండును. ఆంధ్రకవులలో భక్తులై కవులైనవారు, కవులై భక్తులైనవారునుగలరు. ఆంధ్రభక్తులలో పలువురు గౌతమీతీరమువారు. భక్తశిఖామణి చైతన్యస్వామి గోదావరీమధురసలిలములను గ్రోలినవాడేయని చెప్పుదురు. 'భక్తవిరహము'లో గౌతమీగంగను సంబోధించుచు చెప్పినపద్యము హృద్యతరముగానున్నది.

... ... ...

ఉద్యోగములులేవు. ఆశమాత్రము లేకుండుటలేదు. ప్రస్తుతపరిస్థితులు 'ఉద్యోగము: ఆశ'లో ప్రస్ఫుటము చేయబడినవి. 'పెక్కు చందాలన్ బండు మాన్యక్షేత్రములు' పనికిరావు. 'ఇల్లాలి నిల్లాలితాకార' నొల్లడు. ఉద్యోగమే రొక్కుడు. ధనము గడించునంతలో వయసుదాటును. అప్పుడు అనుభవించుటకు వృద్ధత్వము అడ్డుపడును. నిజానుభవములేదు. నిత్యవస్తువును చెందు ప్రయత్నమునులేదు. నృత్తములు గీతములు గూడ నీకావ్యమున Blank Verse వలె నడచుచున్నవి.

... ... ...

కవులు పాదరసమువంటివారని ఒక ఆంగ్లకవి అన్నాడు. వారిని ఒకచో చేర్చుటయే కష్టము. ఏకసూత్రముమీద నడుపుట పొసగదని చెప్పనేల? కాని ఆంగ్లవాఙ్మయమున లీహంటును, ఆంధ్రసారస్వతమున శివశంకరశాస్త్రియు కవులను ఒకచో చేర్చగలిగిరి, ఒకసూత్రముపై నడుపగలిగిరి. అట్టి శివశంకరశాస్త్రిగారీమాసమొకభూషను 'గృహలక్ష్మి'కి అనుపదించి ప్రసాదించిరి.

... ... ...

జబ్బలపురమున నేటికిని గాజురాళ్లతో పూజలందుచున్నది ఆమెసమాధి. ఈసంచికయందు పద్యపుష్పములతో ఆమెకు పూజజరిగినది. దుర్గావతి భారతదేశపు బోయిడీషియా. బోయిడీషియావలె దుర్గావతియు నిజసైనికులకు 'ధైర్యమ్ము పుట్ట' యుద్ధభూమిలోపలికినది. 'తనయంగములందు స్వతంత్రరక్తధారామలవాహినీసముదయమ్ము గలట్టిది' కావున ఆమె 'పవిత్రమూర్తి.'

—ఆంధ్ర శేషగిరిరావు బి. ఏ.

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధసంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. దసరా ప్రత్యేకసంచికగ వెలువడు అక్టోబరుసంచిక మాత్రము రు. 0-8-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభముచేయవచ్చును. విడికాపీలువలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికిపూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనచార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకు వ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుట లెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగ కాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపమిని కాపీలు చేరనిచో తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారిచందా నెంబరును ముద్రించుటమూలముగా గృహలక్ష్మియందు ఆయామాసములయందు సూచింపబడును. ఇదివఱకువలె ప్రత్యేకముకార్డు వ్రాయజాలము. ఈసూచన చూచి తమచందాధనమును పంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులను ప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగనుండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము. ఆ వీ. పీ. ని తిరుగగొట్టినచో మాకు అనవసరవ్యయము కల్గించినవారగుదురు.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనమని వ్రాయు ఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు. ఇది ముఖ్యముగా గమనింపవలసియున్నది.

# విషయసూచిక

---

# కేసరిగారి ఔషధములు

### 1. లోధ్ర

స్త్రీలబుతుసంబంధమగు జాడ్యములకు వజ్రాయుధము. మరియు వంధ్యాత్వమును పోగొట్టును. ఆరోగ్యము రక్తపుష్టికలుగజేయును.

12 ఔ. రు. 3 0 0   6 ఔ. రు. 1 10 0

### 2. అమృత

రక్తశుద్ధిద్రావకము. నరములబలహీనత, సుఖజాడ్యములు, ఆకలిలేమి, నిస్సత్తువ మొదలగు వ్యాధులను ఖండించును.

12 ఔ. రు. 3 0 0   6 ఔ. రు. 1 10 0

### 3. అర్క

సర్వవిధములగు జ్వరములను నిర్మూలించును.

6 ఔ. రు. 2 8 0

3 ఔ. రు. 1 8 0   1 ఔ. రు. 0 8 0

### 4. జయద్రావకము: విజయవటి

కలరామందులు — వెల రు. 1 0 0

### 5. చంద్రోదయమకరధ్వజ

పుష్టిని కలిగించుటకు — వెల. రు. 5 0 0

### 6. ఆదిత్యలవణము

అజీర్ణసంహారిణి — వెల 6 ఔ. రు. 1 4 0

### 7. మార్తాండలేపము

చర్మరోగములకు — వెల రు. 0 8 0

### 8. కస్తూరివటి

కఫరోగములకు — వెల రు. 2 8 0

### 9. రాజమనోల్లాసిని

పడకటింటిమందు — వెల రు. 1 0 0

### 10. నారాయణతైలము

వాతవ్యాధులకు — 6 ఔ. రు. 2 0 0

### 11. భృంగామలకతైలము

మెదడు చల్లబడుటకు — 6 ఔ. రు. 1 0 0

### 12. ధాతువృద్ధి చూర్ణము

ఇంద్రియపుష్టికి — డబ్బీ రు. 2 0 0

### 13. మహాగంధకవటి

చర్మవ్యాధులకు — 40 బిళ్లలు రు. 3 0 0

### 14. తాంబూలరంజని

తాంబూలమాత్రలు — వెల రు. 0 4 0

### 15. మాదీఫలరసాయనము

పైత్యములకు — 3 ఔ. రు. 0 12 0

### 16. కఫకేతువటి

దగ్గు, పడిశములకు — 24 బిళ్లలు రు. 0 12 0

### 17. మధుమేహవటి

అతిమూత్రవ్యాధికి — 40 బిళ్లలు రు. 3 0 0

### 18. శిలాజితురసాయనము

సర్వరోగనివారిణి — తులం రు. 2 0 0

### 19. నీలాంజనము

కంటిజబ్బులకు — డబ్బీ రు. 1 0 0

### 20. సుదర్శనాంజనము

జన్నికలికము — డబ్బీ రు. 2 0 0

### 21. సౌవీరాంజనము

కండ్లకు చలవనిచ్చు సుర్మా — డబ్బీ రు. 1 0 0

### 22. గర్భరక్షక

గర్భిణీస్త్రీలకు — 3 ఔ. రు. 2 0 0

### 23. సోమరాజాదిలేపము

బొల్లికి — బుడ్డివెల రు. 2 0 0

### 24. విషవిధ్వంసిని

తేలుమందు — వెల రు. 0 8 0

### 25. వజ్రతైలము

దంతరోగనివారిణి — వెల రు. 0 8 0

### 26. క్షారతైలము

కర్ణరోగనివారిణి — వెల రు. 0 8 0

### 27. అతిసార గజకేసరి

గ్రహణిమందు — 24 మాత్రలు వెల రు. 0 12 0

### 28. కుముదవటి

సుఖభేదిమందు — 24 మాత్రలు వెల రు. 0 12 0

### 29. సిద్ధామృతచూర్ణము

కాఫీకిబదులు — వెల రు. 0 8 0

### 30. బాలసంజీవినివటి

శిశువులకు — 50 మాత్రలు వెల రు. 1 0 0

### 31. మధువిరేచనవటి

భేదిమందు — 24 మాత్రలువెల రు. 0 12 0

1931 మార్చి




## బౌద్ధమతము: వివాహవిచ్ఛేదములు

కొనిరావలయునని కొందఱు, కొనివచ్చుట కొరవితో తలగోకికొనుటయని పలువురు ఇట్లు నేటి హైందవస్త్రీసంఘము విడాకులనుగూర్చి అభిప్రాయభేదములతో అటమటించుచున్నది. అట్టితఱిని హిందూదేశముననే ఉత్పత్తినొంది హిందూమతముతో పెక్కువిషయములందు సాదృశ్యముగలిగి ప్రపంచమునందలి ముఖ్యమతములలో నొకటిగా పరిగణింపబడుచున్న బౌద్ధమతమున విడాకులఆచారము ఎట్లు నడచుచున్నదో తెలిసికొనుట మిక్కిలి ప్రయోజనకరముగా నుండగలదు.

నియమశృంఖలితముగా చేయబడినసంఘము నీతిశిఖరము నధిష్ఠింపజాలదనియు, ఏసంఘమునందలి వ్యక్తులు ఆత్మసంయమము అలవఱచుకొందురో ఆసంఘము అభ్రంకషమగు ఉత్తమపదమునందుననియు బుద్ధుని ఆదేశము. ఆతని యుద్దేశమున ప్రేమ మోహము యొక్క వికృతికాదు. అట్లని ఆతడు వివాహమును పాయరాని బంధముగను తలంపలేదు. వివాహమగుట, బ్రహ్మచర్యమవలంబించుట అను విషయములలో బౌద్ధమతము-ప్రాచీన జుడెయిజమువలెనే-స్త్రీలకుసంపూర్ణస్వాతంత్ర్యమిచ్చినది. కావుననే హిందూమతమున వివాహము దురతిక్రమణీయమగు మతవిధికాగా బౌద్ధమతమున,అది కేవలము సివిలుకాంట్రాక్టు * మాత్రమైనది.

అయితే అంతమాత్రమున బౌద్ధమతము క్రైస్తవమతమువలె విచ్చలవిడి వివాహవిచ్ఛేదములనుఅనుమతింపదు. క్రైస్తవమతమున దంపతులలో ఏఒకరుతలపెట్టినను విడాకు పొందవచ్చును. దంపతులు విడిపోవుటకు అన్యోన్యము సమ్మతింపవలయును, ఆసమ్మతియు ధర్మసభవారి ఆమోదము నందవలయును, అప్పుడే బౌద్ధదంపతులకు వివాహవిచ్ఛేద

---

* **A Manual of Buddhism: By Dudley Wright.**

స్వాతంత్ర్యమొనగూడును. ఈ నడుమ బర్మాలో (బర్మీయులు బౌద్ధమతావలంబులు) నొక పురుషుడు తనభార్యకు విడాకుకొఱకు నోటీసుఈయగా అది ఆమె సమ్మతిని బడయక ఈయబడినదికావున చెల్లరానిదని అచ్చటి న్యాయస్థానమువారు తీర్పుచెప్పినారు. ఈవిషయముతో పాశ్చాత్యదేశములనుండి వినవచ్చుచున్న విడాకులవృత్తాంతములనుపోల్చిచూచినచో రెండింటికినిగల్ల వ్యత్యాసము విస్పష్టమగును. పాశ్చాత్యదేశములందువలె స్వల్పాతిస్వల్పవిషయములకు బౌద్ధమతమున విడాకులుదొరకవు. ఇదియొక మెలుకువ.

పరస్పరము సమ్మతినొంది విడాకులనుబొందవచ్చు అవకాశమున్నను బౌద్ధమతస్థులు తప్పనిసరి వచ్చినగాని వానిని కోరరు. అశోకునికాలమునుండియు బౌద్ధమతమవలంబించుచున్న సింహళద్వీపనివాసులందు విడాకులనుపొందుఆచారము మిక్కిలి అరుదు. బౌద్ధమతప్రవిష్టములగు చీనా, కొరియా, జపానుదేశములందును ఈఆచారము పాశ్చాత్యదేశములందువలె పారము మీఱినదనుటకువలనుపడదు. బౌద్ధమత మవలంబించుదేశములలో హిందూదేశమునకు మిక్కిలి చేరువనున్న బర్మాదేశమునందలి విడాకులఆచారమును గూర్చి ఒకరిట్లు వ్రాయుచున్నారు.* "పలువురుతలంచునట్లు బర్మాదేశమున వివాహవిచ్ఛేదములు విశేషమనుకొనుటకు వీలుచాలదు. ఆదేశమున కుటుంబములయందలి వివిధవ్యక్తులు అన్యోన్యప్రేమబద్ధులైయుందురు. బర్మీయుడు తనభార్యను గాఢముగ ప్రేమించును. బర్మాదేశపు స్త్రీయు పురుషునిగౌరవించుగుణము పిన్నతనముననే నేర్చుకొనును. వారివైవాహికాచారములు బహునియమబద్ధములుకానిమాటసత్యమే కాని అవి అట్లు బహునియమబద్ధములు కాకుండుటచేతనే కలహములతో కలుషితములైన కాపురముల సంఖ్య ఆదేశమున మిక్కిలి తక్కువగానున్నది. జారజమగుసంతానము ఆదేశమున పరకపాటుగ నుండును. తగినకారణములేక విడాకుతీసికొను భార్యాభర్తలు బర్మాదేశమున ప్రజల మన్ననలకు సుదూరమగుదురు."

ఒండొరులు ఒడంబడికగావించుకొని విడాకులుపొందుదురుగావున వారు ఎవరిఆస్తులు వారు గైకొనుటయేగాక జాయింటుఆస్తిని చెరిసగముగ పంచుకొందురు. ఇక సంతానవిషయము. ఏడేండ్లకుపైబడిన పుత్రులు తండ్రిపోషణక్రిందకు వత్తురు. ఏడేండ్లకులోబడిన పుత్రులును, వయసుతో నిమిత్తములేకుండ అందరు పుత్రికలను తల్లిసంరక్షక్రిందకువత్తురు. ఇదియెంతసమంజసముగానున్నదో సులభముగనేగ్రహింపవచ్చును. ఒక మహాసీయుని † వాక్యములలో 'వివాహవిచ్ఛేదములవిషయమున బౌద్ధన్యాయము ఆంగ్లన్యాయమువలెవిపరీతములతోడను, వ్యత్యస్తములతోడను, తికమకలతోడనుగూడుకొని యుండలేదని చెప్పుటలో సందేహ మావంతయులేదు.'

---

* The Burman, His life & Notions: Sir James George Scott.

† Sir Gorell Barnes.

ఒక్క ఒడంబడికరూపముననేగాక మఱియొకరూపముసగూడ బౌద్ధమతమున విడాకులు పొందవచ్చును. భార్యాభర్తలు అంగీకరించి మూడువత్సరములు విడివడి జీవించుచో వారు విడాకులు తీసికొనినట్లుగనే భావింపబడును. స్త్రీయగునది తనభర్తను ఎప్పుడైనను విసర్జింపవచ్చును. అయితే ఆమె ప్రజాభిప్రాయమునకు ఎదురొడ్డి నిలువజాలు తెంపరితనము కలిగియుండవలయును. భార్య తన్ను విడనాడినను భర్త ఆమెను పోషింపవలసియుండును. అట్లొకసంవత్సరమువఱకు అతనిపోషణ ఆమెకందనిచో ఆసంవత్సరానంతరము వారిరువురు తిరిగి వారికిష్టమువచ్చినవారిని వివాహమాడవచ్చును. భర్తయే భార్యనువదలుచో ఈ సౌకర్యములేదు. అప్పుడు ఆ భార్యాభర్తలు మూడు నిండుసంవత్సరములు వేచియుండినగాని తిరిగి వివాహమాడుటకు హక్కుగలుగదు.

భార్యాభర్తలలో ఒక్కరికే వివాహవిచ్ఛేదము గావించుకొను తలంపుగలుగుచో ఆవిషయము న్యాయస్థానముననే నిర్ణీతము కావలయును. ఇష్టమున్నను లేకున్నను రెండవవారు కోర్టులో హాజరుకావలయును. ఎక్సుపార్టీడిక్రీలు ఎప్పుడును ఈయబడవు. కోర్టుకు సాక్షులుకూడరావలయును. విడాకుకోరువారు తాము దానినికోరుటకుగల ప్రబలకారణము చూపవలయును. చూపలేనినాడు వారు తమప్రత్యేకపుటాస్తిని తీసికొనిపోవుటకుమాత్రము హక్కుగలిగియుండును.

తన్ను పోషించుదానికికూడ తలమాసియున్నను, దీర్ఘరోగముచే తీసికొనుచున్నను, మతిభ్రష్టుడైనను, సోమరితనమున కేవలముసాపాటురాముడై యున్నను,తన్ను తప్పినడచినను, వివాహానంతరము అంగవికలుడైనను భార్యతనభర్తనుండి విడాకును పొందవచ్చును. భర్త భార్యనుండి విడాకునుపొందుటకు అవకాశము లింతవిరళముగాలేవు. ప్రవర్తన ప్రభ్రష్టమైనట్లు నిశ్చయమైనను, తన్ను ఎంతమాత్రము ప్రేమింపకుండినను, కుష్టురోగపీడితయైనను, సంతానవతిగాకుండినను, రాజులవిషయమున పురుషసంతానము గలుగకుండినను భర్త భార్యకు విడాకు నీయవచ్చును. చీనాదేశమున భర్తయగువాడు తనభార్య అత్తమామలయెడ వినయవిధేయతలతో మెలగకున్నను, ఆమెమాటలపోగు అసూయాపరురాలుఅయినను గూడ భార్యను విడనాడవచ్చును. చీనాదేశమున స్త్రీ తన్ను భర్తవిడిచిపెట్టినాడనుకారణమునతప్ప మఱేతరకారణముచేతను వివాహవిచ్ఛేదము గావించుకొనజాలదు. అత్తమామలుకూడ నాదరింపకపోయినచో నామె పుట్టింటికిపోవచ్చును. వివాహసమయమున ఈయబడిన కట్నములు తిరిగిపొందుటకును, మగనినుండి మనోవృత్తికోరుటకును మాత్రము ఆమెకు హక్కుగలదు.

ఋజువర్తనమువిడనాడిన స్త్రీకి బౌద్ధమతము ఎట్టిహక్కులను ప్రసాదింపదు. ఆమె చెడువర్తనము నిర్ధారితమై భర్త అభిలషించుచో ఆమెను కట్టుబట్టతో ఇంటిలోనుండి వెడలనడుపవచ్చును; అప్పుడుసంతానవిషయమై అతడేసర్వాధికారియగును; ఓలిధనముకూడ

ఆమెకీయబడదు. ఇదిఋజువర్తనమువిడనాడిన స్త్రీవిషయము. ఇక ఋజువర్తనమువిడనాడిన పురుషునివిషయమెట్టిదిగానుండునో చూతము. తన్ను అతడుమిక్కిలికష్టపెట్టుచున్న విషయముగాని, తన్ను మీరి అతడునడుచుచున్న విషయముగాని స్త్రీ నిర్ధారణచేయగలుగుచో కోర్టుకు పోవచ్చును. కోర్టులో సాక్షులసమక్షమున అతడు ఇకమీద బుద్ధిగలిగిమెలగెదనని ప్రూచీకత్తునీయవలయును. ప్రూచీకత్తు నీయనిరాకరించినను, ఇచ్చినప్రూచీకత్తును పాటింపకుండినను భార్య అట్టిభర్తతో విడాకుపొందవచ్చును. అప్పుడు అమె కట్టుబట్టతో భర్తను బయటికి పంపివేయవచ్చును. సంతానముపై సర్వాధికారము ఆమెది. ఆస్తికంతకు ఆమె కామందు. భర్త త్రాగుబోతు అయినను, జూదగాడు అయినను, నల్లమందుభాయిఅయినను, జారుడు అయినను భార్య ఇంటియందుగాని కోర్టులోగానీ సాక్షులసమక్షమున అతనినుండి ఈదుర్వ్యసనములనువిసర్జించుటకు బాండువ్రాయించిపుచ్చుకొనవచ్చును. ఒకటి, రెండుసారులు ధర్మచ్యుతికలిగినను పాటింపబడదు. మూడవసారికూడ చ్యుతికలుగుచో భార్య భర్తనుండి విడాకు గ్రహింపవచ్చును. అప్పుడు భర్తతనవంతుఆస్తి పొందుటకును, ఏడేండ్లకుపై బడిన పురుషసంతతి పోషణభారము తానువహించుటకును హక్కుగలిగియుండును.

వివాహముజరిగిన అనంతరము దంపతులలో నొకరికి కుష్టురోగము తగిలినను, పిచ్చిపట్టినను, మాన్పరాని మఱియేరోగము కలిగినను రెండవవారు వివాహవిచ్ఛేదము గావించుకొనవచ్చును. వివాహసమయమునకే ఆరోగములుండి అవిగమనింపబడనిచో నిక నావివాహము విచ్ఛేదముగావింపబడుటకు చట్టము అనుమతినీయదు.

బౌద్ధమతమునగల వివాహవిచ్ఛేదపద్ధతి నిట్లుదిఙ్మాత్రముగ ప్రదర్శించితిమి. క్రైస్తవమతమునగల వివాహవిచ్ఛేదపద్ధతికంటె నిది వేయిరెట్లు బాగుగనున్నదను సత్యమును గ్రహించుటకీప్రదర్శనము చాలును. క్రైస్తవసంఘములమాట ఎట్లున్నను బౌద్ధసంఘములయందు ఇట్లు విడాకులపద్ధతి యుండుటచే ఆసంఘములకు ఎట్టి చెరుపునులేకుండిన విధము బౌద్ధసంఘముల చరిత్ర వెల్లడిచేయుచున్నది. విడాకులచట్టముతో గృహమర్యాద కూలిపోవుననియు, మర్యాదజీవనము మంటగలయుననియు ననుమాటలు కూటవేదాంతమునకే చెందుననుట బౌద్ధసంఘచరిత్రలచే విస్పష్టమగుచున్నది. అయితే హిందూసంఘమున ఈ విడాకులపద్ధతిని ప్రవేశపెట్టుట వాంఛనీయమా కాదా యనునది వేఱుప్రశ్న. నేటిహిందూసంఘమునందు పురుషుడు హద్దుమీఱినహక్కుల ననుభవించుచున్నాడు. అట్టితఱిని విడాకులపద్ధతిని గొనివచ్చుచో ఆహక్కులకు పూర్తివిచ్ఛిత్తికలుగగలదు. అయినను ఈవిడాకులపద్ధతి గొనివచ్చుటకు మనదేశ స్త్రీలింకను సంసిద్ధముకాలేదు. గృహలక్ష్మిలో ఇంతకుమున్ను ఆంధ్రవిదుషీమణులు విడాకులచట్టమునుగూర్చిఇచ్చినఅభిప్రాయములును, మొన్నటి ఆంధ్రరాష్ట్రీయస్త్రీలసభలో దీనినిగూర్చి జరిగిన-పర్యవసానము తేలని-విశేషచర్చయు ఇందుకు నిదర్శనములు.

# పల్లెపదాలు

శ్రీమతి మదమంచి అనంతమ్మ గారు

తొంగిచూచిన నింగితో వచ్చి నట్టింట రవ్వరవ్వన చుక్కలు రాలువేళ
చిమ్మచీకటి నీలిచీర డేరావోలె కప్పుపై ముఱిముఱి గ్రమ్మువేళ
వెండితీవెలబోలి వెన్నెలనునుకాంతి సోరణగండ్లలో జొచ్చువేళ
తొలకరిమబ్బులు దోబూచులాడుచు చినుకుముత్తెములంట చెదరువేళ

ప్రకృతిచింతనచే దల్లిప్రక్కమీద
జీవనాశల రాల్చెడు చిన్నదాని
కవికుమారిక! వర్ణింపగలవటమ్మ?
శిల్పినీ! విలిఖింతువా చిత్రమందు?

చెక్కుటద్దము డిగ్గ చెమ్మటముత్యాలు గులకాలరవికపై దొలకరింప
ఉఱ్ఱంకి బెనగొంచు నొంటిపేటల్లిన బేడకాసులపేరు బెరిగిపోవ
హోరుగాలికి మోపుజార రేగడబట్టి చీరె జల్తారంచు చినిగిపోవ
తలచుట్ట సర్దులోపల నొరగిలి చేయి బిళ్లారిగాజులు పెట్లిపోవ

మూపుపై గడ్డిమోపట్టె మోసికొనుచు
మాలెతమె తాను గాభోలు మలుపుదిరిగి
వచ్చుచున్నది నకనకపడుచు నిటకు
సాయమొనరింపరాదె? సంసారిపిల్ల!

"మాయూరి గెళవులు మప్పితంబుగ బండు సాలుకు నొకపుట్టి సజ్జచేను
జంటలై నూవులపంట యింతనరాని పొలిగల్లు రేగడిపొలములందు
పాటినేలలనీరు పట్టిపోవునుగాని విరుగగాయవె లేతమిరపచేలు
కొతిమేరు లలచంద గోలుసులుదిగవారి గొఱ్ఱుకడ్డెడుబండు గుంటిమెట్ట

దేశపాండ్యా! మఱేమి, మీ దేశమిట్లు
పండదా?" యను నడబావి బండమీద
కాపుకొమరుండు సురుచిరాకారు డెపుడు
కనులపండువు చేయని కాలమేది?

రేపరేపజారె బాకెపుప్రొద్దు మడికేగి వంచెకు గోయచే చెంచలాకు
కట్టుకొయ్యలనూడగా లాగి నేయెద్లు సందెడువేసిరా జాడుదంటు
మిరపచేని మలుపుదిరిగి పరిగెలుప్రాలె వడిసెల విసరవే యెడమవైపు
మబ్బుప్రేలెను దూర్పుమల్లపైన నల్లగా పనవేయవే యోడ పరచిబొప్ప

చూచి నడువుము దుంపలు సోకుననుచు
మునుములో హెచ్చరించెడి ముగ్ధహృదయు
నర్థమెటుజేసికొనునో రవంతయైన
కవితనేర్చిన బాగుండుగాదె నాటి
ప్రకృతిచిత్రము విలిఖింప బల్లెబడుచు.
కొండవాగులజాలు గొలగొలదిగువారు బీటిపల్లవునేల బెరిమజూచి
మట్టలెత్తుచు నాలమంద క్రేళ్లురికిన బుల్కుపుల్కునజూచి ముదముజెంది
సుంకుబోసిన పాలకంకులమొనలూది చిరునవ్వుతో దృప్తిజెందిమరలి
కొనవ్రేళ్ల గొమ్మినాటిన రెబ్బలన్వంచి మెప్పుసూచించుచు రెప్పలార్చి
కర్షకా! కర్షకా! నీకెగాక యిట్టి
ప్రకృతితత్త్వమహానందభాగ్యగరిమ
మాచుకొనువారలెవరయ్య అవనియందు?
పెట్టిపుట్టితి వేపుణ్యభేదముననో.
గుబ్బకొమ్ముల మిట్టగోరాడిరంపిల్లు కోపుటెద్దుల జూచికొనుచు మఱిసి
ఉజ్జంకి చెంగలి యుఱ్ఱూతలూగెడి పడియవారిన పచ్చిపట్ల గాంచి
ఇవముగప్పెడిరీతి నివతళ్లించెడు చెట్లగుబురుల సందులేగుత్తులరసి
బొదబొదలాడు పూపొదరిండ్లు విరజిమ్ము నెత్తావి గరగరల్ నెరయబీల్చి
పిల్లగాడుపు చెమ్మట కొల్లగొట్ట
ఏలపాటలనిగ్గులో నోలలాడి
స్వానుభవమైన ప్రకృతిసంధాన మరసి
సంతసింతుగదోయి? సంసారిబిడ్డ!
నీలాలుగ్గై నేసి నిలిచిమాటాడవే జీరంగి నే గూడ చిన్నదాన
రావె సీతాకోక రంగైననాముద్దుబొమ్మరిల్లును చూచి పోదుగాని
మాయమ్మ వెంటరామానె తమ్మునిడించి కామంచి రావమ్మ కంచె దాటి
పెరటిజాకామల్లె విరగ బూచినదమ్మ తూనీగ రావచే తొంగిచూడ
దారిపొడుగున నీరీతి తలచి యడిగి
పంటకాపుకొమార్తె సంబరము గదుర
కాలిద్రోవను బట్టి పోగడగ బువ్వ
దుత్తతలపైన నటునిటు దూగియాడ.
పల్లెటూరి బయళ్లలోపలసుఖంబు
కపటమెఱుగని మా కర్షకాళి ప్రేమ
ననుభవించుటకే జన్మమైనగాని
పల్లెబుట్టింపవే నన్ను పరమపురుష!

## శ్రావణపూజ

శ్రీమతి రాజేశ్వరిగారు

శ్యామనభోవిటంకమున శ్రావణలక్ష్మి వసించి సవ్యశం
పామృదువీక్షలంబరపి మంజుఘనారవభాషణమ్ములన్
ప్రేమసుధాపరీతమతి మేల్కొలుపంజనుచున్న దియ్యెడ నీ
నోములునోఁచి కాంచుము మనోరథసిద్ధిఁ గుమారికామణీ!

చదువున కాసచేసెదవొ సంపద కావలెనో సుఖంబు నెం
చెదవొ సదానురాగపరిషిక్తభవత్ప్రియమానసమ్మె నీ
సదనముగాఁగఁగోరెదవొ సంతసమార, కుమారి! కామిత
ప్రదములుగాన సల్పుమిఁక శ్రావణమాసశుభవ్రతంబులన్.

పేరంటమునకునై పిలువంగఁదొలినాఁడు సఖులతోఁజనిన యుత్సాహపటిమ
లేఁతవేఁకువవేళ లేచినప్పుడు కన్నుదమ్ములలో వెల్గు తరుణశోభ,
జలకంబుగావించి వెలిపట్టుచీర సింగారించుకొన్న చక్కందనమ్ము,
దేవతోపాసనాదృష్టిమై నోఁచుకొన్నప్పటి భక్తిశీలాతిశయము.
పేరటాండ్ర నెంతేనియు గారవించి
వాయనములిచ్చునప్పటి వైభవంబు
శ్రావణంపు మంగళవాసరముల నెవరి
మానసంబులనింపు నింపవు, కుమారి!

మొన్న మొన్ననె పెండ్లిముచ్చటల్ దీరిన పాలప్రాయంపు వధూలలామ,
ప్రియుని లేనవ్వుల వెలితినొందకయె యాహ్వానించుకొనగ మోహపడుముగ్ధ,
ముద్దుపాపని బుగ్గబొట్టుదిద్దుచు సంతతానందవార్ధినోలాడుకాంత,
మనుమలఁగనుగొన్న యనుపమభాగ్యంబునోము వృద్ధసుహాసినీమతల్లి,
వనితలెల్లరు నిత్యసౌభాగ్యభాగ్య
మభిలషించిలక్ష్మిపూజ నాచరించి
శ్రావణపవిత్రశుక్రవాసరములందు
పరమసంతోషముననుండెదరు కుమారి!

ఓ వనితా! భవత్పరిణయోత్సవమాదిగఁబంచవర్షముల్
శ్రావణమాసభౌమదివసంబుల నోములునోఁచుకొమ్ము, జ
న్మావధిశుక్రవాసరములందు, సదాగృహలక్ష్మి భక్తిమైఁ
బూవులఁబూజసేయు, మొదవున్ భవదీయమనోరథార్థముల్.

దాంపత్యధర్మబద్ధపరస్పరార్పితస్నేహలతాంకూరదోహదములు,
భవసింధుయాత్రానుభవమగ్నజీవనౌకనుకూలపవన్మారుతాంకురములు,
శ్రీసంపదానందజీవనాసారదానాధారభూరిధారాధరములు,
వరగృహలక్ష్మీకృపాసమన్వితనృత్యనిత్యకల్పనదక్షనీరజములు,

హైందవాచారసంప్రదాయానుబద్ధ
ధర్మములుగాన నారీమతల్లికలకు
నవి సదాచరణీయంబు లగుటవాని
నెన్నఁటికి వీడరాదుసుమీ కుమారి!

ఇరుగమ్మకెంతయదృష్టమో పెనిమిటికొనిపెట్టె బంగారుగొలుసులజత,
పొరుగమ్మదెంతటిపుణ్యమో మువ్వలయొడ్డాణమును కొనియుంచె భర్త,
ఎదుటింటిసీతమ్మవదినె- ప్లీడరుగుమాస్తాభార్య-నాను ముస్తాబునొందె,
సందాకయేల వయస్సుమీరినది మామేనత్త కాసులపేరుకొనెను

దిగదుడుపురీతి నాకట్లొ తెగువచేసి
కాసుకొనినారు, చాలు, నేబోనటంచు
దిగులునొందకు భర్తపై, మగువ! గేహ
లక్ష్మి కిడుకాన్క యొకయనురక్తియెసుమి.

## దివ్యాశీస్సు

శ్రీమతి వోలేటి నిత్యకల్యాణమ్మగారు

౧
నిజపురాణపతివ్రతామహ
నీయభావమె హైందవాంగన
దివ్యహృదయమునందు సతతము
తేజరిలు గాతఁ.

౨
భారతీసతి గుండెలందున
పల్లవించిన స్వేచ్ఛభావము
నిత్యలోకామోదమగుచును
నెగడుగావుత లీలగఁ.

౩
ఆంధ్రబాలిక నవ్యనీల దృ
గంచలంపు టమాయకత్వము
సుగుణమంజుల కీర్తివల్లిక
సొబగునిడుగాతఁ.

౪
ఆయపూర్వపుటాంగ్లయువతీ
నాగరికతానిలము హిందూ
సుందరాంగిని దైవకృపచే
సోకకుండును గావుతఁ.

# నక్షత్రకుడు

శ్రీమతి వెంపటి జానకీపురుషోత్తముగారు

(ఆంగ్లమునుండి అనువదింపబడిన చిన్నకథ)

పాలేరువాళ్లు ఇరువురు పెద్దఅడవిలోంచి వాడింట్లకు పోతున్నారు. శీతాకాలమవడంచేత మంచు ఒత్తుగా కురుస్తోంది. చెట్లకొమ్మలనిండా, ఆకులనిండా, గుట్టలనిండా మంచుదట్టముగాఉంది. ఆచలిలో ఆఅడవిజంతువులకుకూడా ఏమిచేయవలెనో తోచలేదు. తోడేళ్లు, నక్కలు, గోరువంకలు, గుడ్లగూబలు, తేనెపిట్టలు, కుందేళ్లు, ఉడుతలు వేటినిలయములలో అవి వెచ్చగాదాక్కుని మాట్లాడుకుంటున్నాయి. ఈయిద్దరు పాలేళ్లు వణుకుతూపోతున్నారు. మంచుతోతడిసి ముద్దయి, పడుతూ లేస్తూ, అప్పుడప్పుడు త్రోవతప్పుతూ, తికగికమక్కుంటూ, దేవుణ్ణిప్రార్థిస్తూ ఎట్టకేలకు అడవిలోనుంచి బయటపడ్డారు. దూరానలోయలోఉన్నవారి గ్రామము గోచరించింది. ఈవిధంగా సురక్షితంగా దరిచేరినందుకు సంతోషితస్వాంతులైనారు. వారిచుట్టూవున్నభూమి ఒకపెద్ద రజితపుష్పమల్లే కనుపించింది.

వారిబీదతనమును స్మరణకుతెచ్చుకోవడంవల్ల వారి సంతసమంతా విచారంగా మారిపోయింది. "ఎందుకొచ్చినబతుకు యిదంతా. డబ్బులేంది జీవించిలాభంలేదు. ఈఅడవిలోఉండగా మంచుబాధతోనైనా, లేక ఏవన్యమృగములవల్లనైనా చంపబడినట్లయితే ఎంతోబాగుంటుంది." అన్నాడు ఒకడు.

"నీవుచెప్పిందినిజమేగాని ఈదిక్కుమాలిన కలియుగప్రపంచకంలో న్యాయమెక్కడ? కొందఱు భాగ్యవంతులుగాను, మఱికొందఱు బీదవారుగాను ఉంటారు. అన్యాయంతప్ప మరియొకటిలేదు జగత్తులో. దుఃఖంమాత్రం అందరికీసమానం" అన్నాడురెండోవాడు.

వారిట్లా తర్జనభర్జనపడుతూఉండగా ఒకవింతవిషయంజరిగింది. ఆకాశంనుండి ప్రకాశవంతమైననక్షత్రమొకటి జారి పొదలమాటుననిలచిపోయింది. అదిచూడడంతోడనే "ఎవరుకనుక్కుంటే వారిదేబంగారం" అంటూ యిద్దరూ పరుగెత్తేరు.

ఇద్దరిలోఒకడు త్వరితముగాపరుగెత్తి పొదదగ్గరకుచేరినాడు. చూచేసరికి నిజంగా బంగారపువస్తువు ఒకటి తెల్లనిమంచుమీద మెరుస్తోంది. ఆతురతతో దాన్ని ముట్టుకున్నాడు. నక్షత్రములతో మెరమెరలాడుతూవున్న బంగారపువస్త్రం వుండగాచుట్టబడివున్నది. సంతోషముతో స్నేహితుణ్ణి కేకవేశాడు. అందులోవున్న బంగారంఅంతా యిద్దరూ భాగములుపంచుకోవచ్చునని కుతూహలముతో మూటవిప్పినాడు. కాని పాపం దురదృష్టవంతులు. అందులో బంగారంలేదూ, వెండీలేదూ, మఱిఏవిధమైనసొత్తూలేదూ; ఒకచిన్న పిల్లవాడు నిద్రపోతూఉన్నాడు.

"మన ఆశలన్నీ ఇట్లా భస్మమైపోతాయని అనుకోలేదు. ఈశిశువువలన మనకేమిలాభం? మనకున్న సంతానమునకే జీవనోపాధి జరిగేవిధం కనపడదములేదు. దీనినికూడా తీసుకొనిపోయి ఎక్కడ భరించడం? ఇక్కడేవిడిచిపోదాం పద" అన్నాడు ఒకడు. అదివిని రెండవవాడు చెప్పినాడు. "తప్పు: తప్పు. చూసిచూసి ఈపసిపాపను ఇక్కడయెట్లా వదిలివేయగలము? నాశనమైపోదూ మరి? నేనూ నీఅంతబీదవాణ్ణి అయినా, నాకూ పెద్దసంసారమున్నా నేను ఈశిశువును ఇంటికితీసుకుపోతాను. నాభార్య శ్రద్ధపుచ్చుకుంటుంది" అంటూ ఆవస్త్రం శిశువుచుట్టూచుట్టి మెల్లిగాఎత్తుకొని కొండదిగుతూ ఇంటివైపు బయలుదేరేరు. స్నేహితుడు ఇతని తెలివితక్కువతనమునుగూర్చి గేలిచేశాడు. త్వరలో వారు ఊరుచేరేరు. అప్పుడు రెండవ పాలేరు "నీవు పిల్లనితీసుకున్నావుగదా, నాకావస్త్రమియ్యి. ఇద్దరికీ భాగంఉండిగదా." అన్నాడు.

"అదేమిటి? ఆవస్త్రము నీకీ కాదు, నాకీ కాదు. ఆశిశువుది." అనిజాబాలుచెప్పి అతడు గృహోన్ముఖుడైనాడు. భార్య తలుపు తెరచి ఆహ్వానించింది. అతను వెంటనే ఆమెతో అతారాశిశువునుగూర్చి చెప్పేడు.

ఆమెకు కోపంవచ్చింది. "నీకేమన్నా మతిపోయిందా ఏమిటి? ఉన్నవారుచాలకనా మరొకర్ని పట్టుకొచ్చావు? ఎట్లా పెంచడం?" అనిగర్జించింది. "అట్లాఅనవద్దు. ఈశిశువు నక్షత్రములోనుంచిజన్మించినాడు. మనకు శుభముచేకూర్చును." అతడు చెప్పేమాటలు ఆమె వినిపించుకోలేదు. "అవ్యక్తపుపనులు ఇట్లాగే చేయడం, నాప్రాణాలుతీయడం. మనలనురక్షించేవారు లేరుగాని ఈపిల్లలనుగూడానెట్లా? తానుదూరి సందులేదుగాని మెడకొకడోలు అన్నట్లుంది."

"ఎందుకట్లా విసుక్కుంటావు. నారుపోసినవాడే నీరుపోస్తాడని తెలీదూ?"

"నీరులేక అప్పుడప్పుడు కొంతనారు కృశించిపోతూఉండదూ?"

అతడేమీమారుచెప్పలేక ఆగృహాగ్రాహాళిమీదే శిలాప్రతిమల్లేనిల్చున్నాడు. తలుపుతెఱచివుండడంచేత చలిగాలి రివ్వునవచ్చి ఆమెనుకంపింపజేసింది. చలికి ఓర్వలేక "పాడుగాలిరాకుండా తలుపువేస్తూ" అన్నది.

"కఠినహృదయుంగలవారిని చలిగాలి ఏమిచేస్తుంది?" అని నెమ్మదిగా అన్నాడు.

ఆమె మారుచెప్పకుండా పెడమొఖముగాతిరిగి గ్రుడ్లల్లోకి నీరుతెచ్చుకుంది. వెంటనే పాలేరు లోపలికి వెళ్ళి ఆపసిపాపని ఆమెచేతుల్లో ఉంచేడు. సంతోషంగా అందుకొని ముద్దాడింది. పిల్లవానిని చుట్టివున్న కాంచనవస్త్రమును, వానిమెడలోని మణిహారమునుతీసి పెద్దపెట్టెలో జాగ్రత్తచేశారు.

అప్పటినుంచీ ఆపిల్లవాడు వారింట్లోనే పెరుగుతూ వారిపిల్లలతో భోజనక్రీడాదులుజరుపుతూ ఆనందంగా ఉన్నాడు. వారందరూ ఆపిల్లవానిని నక్షత్రకుడు అని ముద్దుగాపిలుస్తూఉండేవారు. అట్లా నివసిస్తూ ఆఏటికాఏడు ఎక్కువసౌందర్యవంతుడుగా పెరుగుతూఉన్నాడు. అదిచూచి ఊరివారంతాయాశ్చర్యాన్వితులైనారు. ఎందుచేతనంటే వారందరూ నల్లగానూ, వికృతరూపులుగానూఉండేవారు. నక్షత్రకుడు పచ్చగానూ, అందముగానూ కనపడేవాడు. అతనిశరీరం చామంతిపువ్వల్లేనూ, కళ్లుకలువపువ్వలల్లేనూ, పెదివెలుగులాబిపువ్వల్లేనూ, జుట్టు జూకామల్లెల్లేనూ ఉండేవి.

కాని అతనిఅందమే అతనికిశత్రువై హానిచేసింది. గర్వము, అహంభావము, నీచత్వము అతన్ని ఆవరించినాయి. పాలేరుపిల్లలనూ, తక్కినగ్రామస్తులబాలురనూ హీనజాతివారని హాస్యముచేస్తూ తాను నక్షత్రమునుండి ఉద్భవించడముచేత గౌరవపాత్రుడని చాటిస్తూ, వారిమీద అధికారంచెలాయిస్తూ ఉండేవాడు. బీదవారంటేనూ, గ్రుడ్డివారంటేనూ, కుంటివారంటేనూ ఏవిధమైన ఆదరణాచూపకుండా వారిమీద రాళ్లు రువ్వుతూ పిడికెడేనా బిచ్చంపెట్టకుండా ఊరివెలుపలికి పారదోలుతూ ఉండేవాడు. అందుచేత ఆఊరికెవరూ బిచ్చగాండ్రు ముష్టికిపోయేవారుకారు. ఇదేకాక కురూపులను, అంధహీనులను, దురదృష్టవంతులను పరిహసించేవాడు. తనుమాత్రం తనసౌందర్యప్రతిభనుచూసి అమితానందభరితుడయ్యేవాడు. వసంతకాలంలో పూలచెట్లఛాయలలోవిహరిస్తూ నిర్మలకాసారసలిలదర్పణములో తనప్రతిబింబమునుచూసి ఉప్పొంగిపోయేవాడు.

అప్పుడప్పుడు పాలేరు, అతనిభార్య నక్షత్రకుని దగ్గరకుతీసి "ఎందుకిట్లా సంచరిస్తావు? నిర్దయుడవై అందరినీ ఎందుకు హేళనచేసిహింసిస్తావు? నిన్ను మేము అట్లాగే పెంచుతున్నామా?" అనిమందలిస్తూఉండేవారు.

ఇంటిప్రక్కన గుడిపూజారి పిల్చి "జీవహింసచేయరాదు. 'ఆత్మవత్సర్వభూతాని' అన్నారు పెద్దలు. అడవిలోతిరిగే పక్షులు, ఊళ్లోతిరిగే జంతువులు, నీచుట్టూసంచరించే ప్రజలు అందరూ దయామయులే. దయాపాత్రులే. ఏప్రాణినీ నీసంతోషముకోసం బాధించకూడదు. గ్రుడ్డిపురుగునిపీడించినా దేవునికి అపరాధముచేసినట్లే. ప్రపంచకమంతా ప్రేమస్వరూపం. అందులో క్రూరత్వమునకు ఎప్పుడూ ఎక్కడాతావులేదు"

అని హితబోధ చేస్తూఉండేవాడు. కాని నక్షత్రకునికి ఇవి ఏమీ తలకెక్కినవికావు. అతని ప్రవర్తన యిసుమంతైనా మార్పుచేసుకోలేదు. యథాప్రకారముగా తోడిబాలురందరినీ ఆజ్ఞాపిస్తూఉండేవాడు. అతను అందగాడవడంచేతనూ, నాట్యగాడవడంచేతనూ, పిల్లనగ్రోవి ఊదగలవాడవడముచేతనూ వారు నక్షత్రకుని అనుసరిస్తూఉండేవారు. ఎక్కడికితీసుకువెళ్ళినా వెళ్ళేవారు. ఏమిచెప్పినా చేసేవారు. అతను వాడిముల్లుతో ఊడు తలకళ్లుపొడిచినా నవ్వేవారు. కుంటివాడిమీద రాళ్లురువ్వినా సంతోషించేవారు. ఇట్లాత్వరలో అతనివలెనే పాషాణహృదయులైనారు అందరు. 'సహవాసయా దోషగుణాభవంతు' యని సామెత.

ఒకనాడు ఊరికి ఒకముసలి ముష్టిమనిషివచ్చింది. ఆమెయొక్క దుస్తులన్నీ చింపులుచింపులుగా చిరిగిపోయినాయి. ప్రయాణబాధచేత కాళ్లుబద్దలై నెత్తురుకారుతోంది. ఆయాసముతీర్చుకోడానికి వటిచెట్టుక్రిందకూర్చుంది. ఇదిచూసి నక్షత్రకుడు స్నేహితులతో "అదిగో, ఆచెట్టుక్రింద ముసిలిమనిషికూర్చుంది. తన అందవికారముచేతను, అసహ్యతవేతను ఆచక్కనిచెట్టుఅందంకూడా పాడుచేస్తోంది." అనిఆమెదగ్గరగాపోయి తిడుతూ రాళ్లువిసిరేడు. ఆమెమెదలకుండా అతనివంకచూస్తూ కూర్చున్నది. ఇదంతా ప్రక్కనపొలములో పనిచేస్తున్న పాలేరు కనిపెట్టి పరుగెత్తుకొనివచ్చి "ఎందుకు, నక్షత్రకుడా! అకారణంగా ఆముసలిదానిని బాధిస్తావు? ఆమె నీకేమైనా అపకారంచేసిందా? నిన్నేమైనా తూలనాడిందా? బొత్తిగా బుద్ధిహీనుడవు అవుతున్నావు." అని గట్టిగామందలించేడు.

నక్షత్రకుడు ఆగ్రహముపొందేడు. ముఖమంతా యెర్రబాతిండి. "నీవురెవరు నన్నుఆజ్ఞపెట్టడానికి? నీ[illegible]డుకుననుకున్నావా, నీవుచెప్పినట్లుచెయ్యడానికి?" అని నిర్భయముగా బదులుచెప్పేడు.

"నీవుచెప్పింది యదార్థమే. నీవునాకొమారుడవుకావు. కాని యడవిలో నిస్సహాయుడవై నాకుదొరకినప్పుడు కరుణించి జాలితోతీసుకువచ్చి పెంచుతున్నాను."

ఈమాటలువినగానే ఆముసలిది పెద్దకేకపెట్టి మూర్ఛపోయింది. పాలేరు ఆమెనట్లాగే తనయింటికి గొంపోయి శైత్యోపచారములుచేశాడు. స్పృహకలిగినతరువాత ఆమెకు అన్నపానాదులుఅందిచ్చింది పాలేరు భార్య. కాని ఆమె అవియేవీ స్వీకరింపకుండా పాలేరుతో "ఆపిల్లవాడు అడవిలోదొరికినాడనేనా చెప్పినావు? ఇప్పటికి పదిఏండ్లుకాలేదా?" అని ప్రశ్నించింది.

"అవును. అడవిలోనేదొరికినాడు పిల్లవాడు. సరిగా పదిఏండ్లయినదిప్పటికి" అని బదులుచెప్పేడు.

"అప్పుడు వానిమెడలో మణిహారం, వానిచుట్టూబంగారపువస్త్రము ఉన్నదికాదూ?" అన్నది.

"అవును, వాస్తవంగా అవేవున్నాయి" అనిఅంటూ వాటినితీసి చూపించేడు.

వాటినిచూడడంతోనే ముసలిదివెక్కివెక్కిఏడుస్తూ "వీడే, నాయనా! నాకొడుకు. అడవిలోతప్పిపోయినాడు. అప్పటినుంచీ నేనువాడికోసరం ప్రపంచకమంతా వెతుకుతున్నాను. ఒకమారు వాణ్ణి పిలిపిస్తూ" అ వేడుకొన్నది.

పాలేరు బయటికివచ్చి నక్షత్రకుణ్ణి పిల్చి "లోపలికిపో. నీతల్లి వచ్చింది చూతువుగాని" అన్నాడు.

అమితాశ్చర్యంతోనూ, ఆనందపారవశ్యముతోనూ లోపలికి గంతువేశాడు నక్షత్రకుడు.

ఎదురుగా ఆముసలిదితప్పఎవరూలేరు. నక్షత్రకుడు ఇల్లంతావెదకి "ఎక్కడ? నాతల్లిఎక్కడ? ఇక్కడ యీపాడుముసిలిదితప్ప ఎవరూలేరే?" అన్నాడు కోపంతో.

"నాయనా! నేనే నీతల్లిని అన్నది" దీనంగా.

"నీవా నాతల్లివి? పిచ్చిరెక్కినదా ఏమిటి? చింపిరిబట్టలతో, చింపిరితలతో, ముసిలిరూపుతోనున్న నీవా నాతల్లివి? ఇక్కడనుంచి కదలిపో."

"కాదు, నాయనా! నీవే నాచిన్నిపిల్లవాడివి. అడవిలోకన్నాను. దుర్మార్గులు, దొంగలు అపహరించి అరణ్యములోవిడిచేశారు. కాని నిన్నుయిప్పుడు గుర్తుపట్టగలిగేను. నీయొక్క బంగారువస్త్రమును, మణిహారముగూడా ఆనవాలుపట్టినాను; కనికరించి నాదగ్గరకురా. నీకోసం యెంతదూరమో తిరిగివచ్చేను. నాదగ్గరకిరా, పుత్రా!" అని వేడుకొన్నది.

కాని నక్షత్రకుడు కదలకుండా, తనలోకి ఆమెవాక్యములు జొరబడకుండా హృదయకవాటమును బిగించుచున్నాడు......ఆమె అశ్రుధారల కంతులేదు.

కొంతసేపైన తర్వాత నక్షత్రకుడు "నిజంగా ఒకవేళ నీవు నాతల్లివైతే యీ ఛిద్రసౌభాగ్యంతో ఇక్కడకు రాకుండా ఉండవలసింది. నేనేమో నక్షత్రకొమారుణ్ణి అని అనుకుంటున్నారు యిక్కడివారందరూ. అట్లాగాక నీవంటి భిక్షకురాలిపిల్లవాడని తెలిస్తే నాపరువుమర్యాదలు యేమైనా ఉంటాయా? కాబట్టి జాగుచేయకుండా యీ క్షణమే వదలిపో" అని కఠినంగా పల్కెను.

"అయ్యో! పుత్రకా! పోయేముందు చిన్నముద్దుఅయినా యియ్యవా? నీకొరకెంతో కష్టపడ్డాను." అన్నది జాలిగా.

"ఛీ, ఛీ. చూడబడడానికేనా తగవు. అంతరోతపుట్టిస్తున్నావు. నీకన్నా పామూ, కప్పా నయం." అన్నాడు... అతని క్రూరత్వమునకు అదుపులేకపోయింది.

చేసేదేమీలేక ఆముసలిది దుఃఖిస్తూ అడవిలోకి వెళ్లిపోయింది. ఆమె పోగానే నక్షత్రకుడు సంతోషములో గంతులు వేస్తూ ఆడుకోడానికి పరుగెత్తేడు.

అతడు దగ్గరకు రాగానే తోడిబాలురు "ఎందుకింత అసహ్యంగా పాముమోస్తరు, కప్పమోస్తరు ఉన్నావు. మమ్మలని అంటబోకు. ఇక్కడనుంచివెళ్లిపో. నిన్నుచూడలేము. నీతో ఆడుకోనలేము." అని తోటలోనుంచి తరిమివేశారు.

నక్షత్రకుడు విస్మయంచెందేడు. "ఎందుకు నన్నిట్లా అసహ్యించుకుంటారో తెలియడంలేదు. నూతిదగ్గరకుపోయి ఒకమారు నారూపుచూచుకుంటా" అని అనుకున్నాడు. జలములో చూసేసరికి ముఖంఅంతా కప్పవలెముడుచుకుపోయి, శరీరంఅంతా పాముశరీరమువలెగీతలుపడి కనుపించింది. నేలమీదకూలి "ఇదంతా నాపాపపరిపక్వం. నా మాతృద్రోహఫలితం. నాసౌందర్యగర్వదండన. వెంటనేపోయి లోకమంతా వెదకియైనా నాతల్లిని కనుగొంటాను" అని రోదనచేశాడు.

ఈస్థితిలో పాలేరుకూతురు చిన్నపిల్ల వచ్చి అతనిచెయ్యిపట్టుకొని "ఎందుకు విలపిస్తావు? మాతోనే ఉండు. నిన్నుచూసి వెక్కిరింపములే" అన్నది నవ్వుతూ.

"పాపాత్ముణ్ని, తల్లియందుచూపిన ద్వేషభావమునకు, అసహ్యతకు నేనిట్లా శిక్షింపబడ్డాను. కాబట్టి నేను పోయి ఆమెను వెదకి క్షమాపణవేడుకోవలెను. అంతవరకు శాంతిఉండదు." అంటూ ఆగకుండా అరణ్యములోకి పరుగెత్తిపోయినాడు. పోయిపోయి, 'అమ్మా! అమ్మా!' అంటూ రోజంతా తిరిగేడు. కాని లాభంలేకపోయింది. తుదకు విసుగుచెంది రాత్రి గడ్డిమీద విశ్రమించేడు. తనకు ఇదివరకుచేసిన అపకారమునుజ్ఞప్తికి తెచ్చుకొని జంతువులు, పక్షులు అతన్నుంచి దూరంగా తొలగిపోయినాయి. కప్ప, పాము మాత్రం ఒకమారు తొంగిచూసినై.

ఉదయం అయినతర్వాత లేచి తిరిగీ అన్వేషణ ప్రారంభించేడు. కలుసుకొనినవానినన్నిటిని ప్రశ్నించేడు. ఉడుతతో అన్నాడు "నాతల్లిని చూశావా?" అని.

"నాకళ్లు పొడిచేశావుగా, నాకేంతెలుస్తుంది?" అని అది జవాబుచెప్పింది.



'తాతగారికి మళ్లీ పెళ్లి అయింది'

[తన రెండవ పెళ్లాము కూతురు, కూతురుకొడుకు కుడిప్రక్కను; తన ముసలి రూపుచూచి మూతిముక్కు ముడుచుకొన్న పెళ్లికూతురు, పెళ్లికూతురుతల్లి, తమ్ముడు ఎడమప్రక్కను ఉండ పెళ్లికొడుకైన తాతగారు తన తొస్సినోటిమందహాసము కెమేరాకర్పించినాడు.]



'పడమటిగాలి'

[శేషభాషల్లో తాను దొరఅయినవాడు. కోరిఏరి హూణవిద్య బాగా నేర్చి పడమటిగాలిచే ఆవరింపబడిన యువతిని వివాహము చేసికొన్నాడు. హస్తమలంకరించిన పుస్తకముతో పడకకుర్చీలోపడి ఆవలించుచునుండి అతనింటికి వచ్చుసరికి 'ప్రభువుగారిలా వేళకి యింటికి దయచేస్తారు. పనిచేసేదిరాక నేనుపడే యిబ్బందులు తమకు తెలియవు' అనే స్వాగతవాక్యాలు చదువుతుంది హూణవిద్యాధికురాలైన భార్య. నెత్తిమీది టోపీతీసి చేత్తోపట్టుకుని నల్లదొరగారు ఏదోఆలోచిస్తారు.]

పాలపిట్టని అడిగేడు. "నీవు చాలాదూరం యెగిరి చాలాప్రదేశములుచూస్తావుగా, నాతల్లిని యెక్కడేనా చూశావా?"

"నా రెక్కలు విరిచేశావుగా. నేనెట్లా యెగురుతాననుకుంటావు?" అన్నదిపాలపిట్ట.

కొండచీమను ప్రశ్నించేడు "నాతల్లి యెక్కడుందో చెపుతావా" అని. "ఎందుకూ, నాతల్లినిచంపావుగా, చాలదూ? నీతల్లినిగూడా చంపుతావా?" అంటూ పారిపోయింది.

నక్షత్రకుడికి గుండెనీరై పోయింది. పశ్చాత్తాపము దహించివేసింది. తలవంచుకొని తానుఇదివరకుచేసిన పాపకార్యములకు మన్నింపవలసినదని యీశ్వరుని వేడుకొంటూ నడిచిపోయినాడు. మూడోరోజున అరణ్యమంతా దాటి అవతలనున్న బయలుచేరేడు.

అదిదాటి గ్రామములోనుంచి పోతూఉండగా పిల్లలు హేళనచేసి రాళ్లు రువ్వేరు. అందరూ వాణ్ణి తమ అరుగులమీదేనా కూర్చోనియ్యలేదు. అంత రోతపుట్టిస్తూ కనపడ్డాడు. దయాదాక్షిణ్యములేకుండా అందరూ తరిమేశారు అతన్ని.

ఇట్లు మూడుసంవత్సరములు అహోరాత్రములు, 'తల్లీ!' 'తల్లీ!' అని కలవరిస్తూ పరిభ్రమించేడు. అప్పుడప్పుడు ఆమె కన్పడినట్టుగా పరుగెత్తి కాళ్లకు దెబ్బలు తగిలించుకొనేవాడు... ఈ మూడుసంవత్సరములు లోకమంతా తిరిగినా అతనికి దయాదానములు ప్రాప్తించినవి కావు. తనయొక్క పూర్వచేష్టలు తలపుకు వచ్చేవి. ఆవిధంగా తిరిగితిరిగి ఒకనాటిసాయంకాలం ఒకానొక నదియొడ్డున పెద్దప్రాకారములతో కట్టబడిన పట్టణముదగ్గరకు చేరేడు. కాని పహరావాండ్రు వానిని లోపలికి పోనీక "నీక్కడ యేమిపని పో" అని మోటుగా పల్కినారు.

"నాతల్లికోసరం వెదుకుతున్నాను. ఆమె యీ పట్టణములో ఉన్నదేమో చూస్తాను. దయచేసినన్ను లోనికిపోనీండు" అని దీనంగా బతిమాలుతున్నాడు.

అందుకు వారు నవ్వి నిజంగా "నీతల్లి నిన్నుచూస్తే అసహ్యించుకుంటుంది. బురదలో కప్పకన్నా, పొదలలో పాముకన్నా రోతపుట్టిస్తున్నావు. నీతల్లి యిక్కడలేదు. పో" అని బల్లెములతో పొడిచి తరిమివేశారు.

ఈ సమయంలో గిల్టు దుస్తులు వేసుకున్న అధికారివచ్చి "వాణ్ణి తరిమివేయకండి, బానిసగా అమ్మి ఒక బుడ్డి సారాయి తెచ్చుకుందాము" అని నక్షత్రకుణ్ణిపట్టుకుని త్రోవనపోయే ముసలికి వికృతాకారపు వర్తకునికి విక్రయించేను.

ఆ వర్తకుడు నక్షత్రకుణ్ణి చెయ్యిపట్టుకొని పట్నంలోకి తీసుకువెళ్లినాడు.

చాలావీధులగుండాపోయి ఒకద్వారమువద్ద ఆగినారు. ద్వారంప్రక్కగా పెద్దదానిమ్మచెట్టు వికసించి ఉన్నది.

ఆముసలివాడు దంతపుతాళంచెవితో తలుపుతీశాడు. అయిదు యిత్తడిమెట్లమీదినుంచి లోపలికిదిగేరు. అక్కడ పెద్దతోటఉన్నది. అప్పుడు ముసలివాడు పట్టుబట్టఒకటితీసి నక్షత్రకునికళ్లకు గంతగాకట్టి తనుముందు తోలుకుని వెళ్లాడు. గంతతీసివేసేసరికి నక్షత్రకుడు తను ఒక చీకటికొట్టులో ఉన్నట్లుగా తెలుసుకొన్నాడు. కొమ్ముతో చేయబడ్డ లాంతరు ఒకటి మాత్రం మూల గుడ్డిగా వెలుగుతోంది.

నక్షత్రకునిముందర కొన్నిమాడినరొట్టెముక్కలు కొద్దిగాముక్కినీరుపెట్టి 'అదితిని, ఇదిత్రాగు' అన్నాడు.

నక్షత్రకుడు అట్లా చేసినతర్వాత ముసలివాడు కొట్టుతలుపును ఇనుపగొలుసుతో బిగించి వెళ్లేడు.

మరునాడు మాంత్రికుడైన ముసలివాడుతిరిగి నక్షత్రకుని దగ్గరకువచ్చి అధికారముతో అన్నాడు "ఈ పట్టణము వెలుపలఉన్న అడవిలో మూడుబంగారపుముక్కలుఉన్నాయి. ఒకటితెలుపుది, మరొకటి పసుపుది,

ఇంకొకటి చెయ్యిపుడు. ఈ వేళ నీవు వెళ్లి ఆ తెల్లబంగారపుముక్క తెచ్చిపెట్టు. తీసుకురాలేకపోతే నూరు దెబ్బలు కొడుతాను. త్వరగా వెళ్లు. సూర్యాస్తమయసమయానికి ఈ ద్వారము దగ్గిర వేచి ఉంటాను. పొరబాటుపడకుండా తెల్ల ముక్కనే పట్టుకురా. లేకపోతే చెడిపోతావు. నీవు నా బానిసవు. అది జ్ఞాపకం ఉంచుకో" అంటూ నక్షత్రకునికళ్లు పట్టుగంతతో మూసి ఆ యింటిలోనుంచి, తోటలోనుంచి, ఆ అయిదు యిత్తడి మెట్లమీదినుంచి తీసుకువచ్చి వీథిలో విడిచిపెట్టేడు.

నక్షత్రకుడు మెల్లగా నడిచి ఆ మాంత్రికుడు చెప్పిన అడవిదగ్గరకు చేరేడు. బయటినుంచిచూస్తే ఆ అడవి పక్షులతోను, పూలతోను అందంగా ఉన్నట్టు కన్పించింది. నక్షత్రకుడు సంతోషముతో ప్రవేశించేడు. కాని అతడు ఎక్కడ కాలుపెడితే అక్కడ ముళ్లు మొలచి గ్రుచ్చుకొన్నాయి. పల్లేరుకాయలు మొనలతో పొడిచినాయి. నక్షత్రకుడు తహతహపడినాడు. అసీకాక ఒకరోజంతా తిరిగి వేసారినా ముసలివాడు చెప్పిన తెల్ల బంగారపుముక్క కనపడలేదు. సూర్యాస్తమయసమయమున ఇంటివైపుతిరిగి బయలుదేరేడు. ముందు ఏమి వ్రాసిపెట్టి ఉన్నదో అని దుఃఖించేడు.

అడవిచివరకివచ్చే సరికి ప్రక్కపొదలోనుంచి ఆర్తనాదం వినపడ్డది. తన విచారము మరచిపోయి ఆవైపు పరుగెత్తేడు. ఎవరో వేటగాడు పెట్టినబోనులో ఒక కుందేలు చిక్కుకుని అతిదీనంగా చూస్తూఉంది.

నక్షత్రకుడికి దానిమీద దయకలిగింది. "నేను బానిసనయినప్పటికి నీకు స్వాతంత్ర్యము యిస్తాను" అంటూ ఆ కుందేలును విడుదలచేశాడు.

కుందేలు సంతోషముతో అతనివంక చూస్తూ "నీవు నాకు స్వాతంత్ర్యం యిచ్చేవు. తిరిగి నీకు నేను ఏమి యిచ్చేది?" అన్నది.

"తెల్లబంగారపుముక్క కోసం వెదుకుతున్నాను. ఎక్కడా కనపడలేదు. దానిని తీసుకునిపోకపోతే నాయజమాని చావకొడుతాడు" అన్నాడు నక్షత్రకుడు.

"నీవు నాతోరా. దానిదగ్గరకు తీసుకొనివెడుతాను. దానిని యెక్కడ దాచారో, యెందుకుదాచారో" అని పలికింది.

నక్షత్రకుడు కుందేలుతో వెళ్లేడు. ఒకచోట పెద్దమర్రిచెట్టు కంతలో అతనికి కావలసిన తెల్లబంగారపుముక్క కనపడినది. ఆనందముతో దానిని అందుకుని కుందేలువైపుతిరిగి "నేను నీకు చేసిన కొద్దిసహాయమునకు నీవు నాకు దానికన్న పదిరెట్లు ఉపకారం చేశావు" అని చెప్పేడు.

"దానికేమున్నది? నీవు నాకు చేసినట్లే నేను నీకు చేశాను" అంటూ అది పరుగెత్తుకుపోయింది. నక్షత్రకుడు పట్టణమువైపు తిరిగేడు.

ఆ పట్టణద్వారముదగ్గిర ఒక కుష్ఠురోగి కూర్చున్నాడు. మొఖానికి ముసుకు ఉందిగాని చింత నిప్పులవంటి కళ్లు కనపడుతూనే ఉన్నాయి. వాడు నక్షత్రకుని చూచేసరికి ఒగరుస్తూ "డబ్బులేమన్నాయియ్యి. ఆకలితో దహించుకుపోతున్నాది. ఊరిలోనుంచి నన్ను తరిమివేశారు. ఒక్కరికీ దయలేదు" అని దీనాలాపనగావించేడు.

"అయ్యో, పాపం నాదగ్గిర ఒక బంగారపుముక్క మాత్రమే ఉన్నదే. దానిని తీసుకొనిపోకపోతే నాయజమాని కొడుతాడు. అతని బానిసనికనుక." అన్నాడు నక్షత్రకుడు దయతో.

కాని కుష్ఠురోగి వదలలేదు. దానిని ఇమ్మని ప్రార్థించేడు. నక్షత్రకునికి జాలికలిగి ఆ తెల్లబంగారపుముక్కను యిచ్చేశాడు.

ఇంటికిచేరినతర్వాత మాంత్రికుడు నక్షత్రకునిచూసి "బంగారపుముక్కయేదీ?" అన్నాడు. లేదనిజబాబు యిచ్చేడు నక్షత్రకుడు. అందుచేత మాంత్రికుడు అతనిమీదపడి కొట్టి అన్నపానాదులు యివ్వకుండా చీకటి కొట్టులో బంధించేడు.

మరునాడు తిరిగి మాంత్రికుడు నక్షత్రకుడిదగ్గరకువచ్చి "ఈదినము పోయి పసుపుబంగారపుముక్కను తీసుకొనిరా. లేకపోతే మూడువందలదెబ్బలు కొడుతాను" అని బెదరించేడు. నక్షత్రకుడు అడవికివెళ్లి రోజంతా వెదకి బంగారపుముక్క యెక్కడా కనపడకపోవడంచేత ఒకచెట్టుక్రింద కూర్చుని ఏడుపుప్రారంభించేడు. అప్పుడు ఆక్రిందటిరోజు అతను విడుదలచేసిన కుందేలు అక్కడకువచ్చి "ఎందుకు ఏడుస్తున్నావు? ఈఅడవిలో ఏమి వెదుకుతున్నావు?" అని ప్రశ్నించింది.

"పసుపుబంగారపుముక్కను యజమాని తీసుకురమ్మన్నాడు. లేకపోతే మూడువందలదెబ్బలు కొడుతానన్నాడు. ఆబంగారపుముక్క యెక్కడా కనపడలేదు" అని నక్షత్రకుడు దీనంగాప్రత్యుత్తరమిచ్చేడు.

"నాతోరా" అంటూకుందేలు అడవిలోనుంచి పరుగెత్తుతూ చెరువువద్దకువచ్చి దాని అడుగుభాగమున ఉన్న పసుపుబంగారపుముక్కను తీసుకువచ్చి అతనికిచ్చింది.

"నీకు నాకృతజ్ఞతను యెట్లాచూపేది? నీవునాకు సహాయముచేయడం రెండవమారు" అని నక్షత్రకుడు చెప్తూఉండగానే "దానికేంగాని నీవు నాయందు ఒకమారు దయచూపినావు." అని అదిపరుగెత్తుకునిపోయింది.

నక్షత్రకుడు ఆబంగారపుముక్కను తన సంచీలో పెట్టుకుని పట్టణానికి బయలుదేరేడు. తిరిగీ ఆకుష్ఠురోగి కనపడి "డబ్బులేమన్నాయియ్య ఆకలికి అసువులుపోతున్నాయి" అని ప్రాధేయపడ్డాడు.

"నాదగ్గిర పసుపుబంగారపుముక్క తప్ప మరియేమీలేదు. అది పట్టుకుపోకపోతే యజమాని చంపుతాడు" అని నక్షత్రకుడుచెప్పినా లాభంలేకపోయింది. జాలిగా బ్రతిమాలే ఆకుష్ఠువానికి నక్షత్రకుడు ఆబంగారపుముక్క యిచ్చేశాడు.

నక్షత్రకుడు మాంత్రికుని యిల్లుచేరేసరికి అతడు 'బంగారపుముక్కయేదీ' అన్నాడు. 'లేదు' అని నక్షత్రకుడు అనేసరికి మాంత్రికుడు అతనిమీదపడి బడితెపూజచేశాడు.

మరునాడు ఉదయం నక్షత్రకునిదగ్గరకు మాంత్రికుడువచ్చి "ఈదినం యెర్రబంగారపుముక్కను పట్టుకురా. నిన్ను వదలివేస్తాను. లేకపోతే నీబొందెలోనుంచి ప్రాణాన్ని లేవకొడుతాను" అని గర్జించేడు.

నక్షత్రకుడు అడవికిచేరి రోజంతావృథాగా వెతికిఖిన్నుడై సాయంత్రం ఒకచెట్టుక్రింద అశ్రువులు రాలుస్తూ కూర్చున్నాడు. ఆసమయముననే కుందేలువచ్చి "విచారింపబోకు నీవు వెదకే యెర్రబంగారపుముక్క నీవెనకఉన్న చెట్టుతొర్రలోఉన్నది" అన్నది.

సంతోషముతో నక్షత్రకుడు "నీవు నాకు సహాయముచేయడం ఇది మూడవతూరి. నేను నీకు యేమి ప్రత్యుపకారం చేసేది" అని అంటూఉండగానే "ఘనమైన ఉపకారం ఒకసారిచేశావు" అని కుందేలు పరుగెత్తుకుపోయింది.

నక్షత్రకుడు ఆయెర్రబంగారపు ముక్కను తీసుకొని పట్టణానికి ప్రయాణమైనాడు. పట్టణప్రాకారము దాకావచ్చేసరికి యథాప్రకారంగా కుష్ఠురోగిఅడ్డుపడి "ఆయెర్రబంగారపుముక్క నాకియ్య" అని వేధించేడు. నక్షత్రకునికి జాలిపుట్టి "నీ అవుసరము యెక్కువగా కనిపిస్తోంది తీసుకో" అన్నాడు. కాని నక్షత్రకుని హృదయాకాశం విచారమేఘావృతంగానేఉన్నది.

కాని ఆశ్చర్యమాశ్చర్యము. అతడు సింహద్వారములోనుంచిపట్టణములోపలికిపోతూవుండగా పహరా జవానులు వంగివంగిసలాములుచేస్తూ "మన ప్రభువు యెంతఅందంగావున్నాడు" అనుకున్నారు. మరుక్షణంలో కొందరు జనులు గుంపుగాకూడి అతనివెంట నడుస్తూ "ప్రపంచకములోనికల్లా అందగాడుయితడే" అని కేకవేశారు. ఇదిఅంతాచూచి జనులు తనను గేలిచేయుచున్నారనుకొని అతడు ఖిన్నుడైనాడు. ఇంతలోనే జనసమూహంపెద్దదైనది. వారిమధ్య అతడు త్రోవకనుక్కోలేక పోయి, పోయి రాజమందిరమున్న పెద్దవీధిలోనికి

చేరుకున్నాడు. మందిరద్వారము తెరువబడినది. మంత్రులు, మతాచార్లు అతనికి సాష్టాంగనమస్కారములుచేసి "మా ప్రభువు నీవే. ఇంతకాలం నీకొరకే వేచియున్నాము. మా రాజుకొమారుడవు నీవే" అన్నారు యేకగ్రీవంగా.

నక్షత్రకుడు విస్మయంచెంది "ఇదేమిటి, యిట్లా అంటారు? నేనేమీ రాజుకొడుకుని కాను. నాతల్లి ముసలి బిచ్చపుది. అదీగాక ఎందుకు నేను అందగాడనని హేళనచేస్తారు? నాఅందము నాకు తెలుసు."

అప్పుడు బంగారపుదుస్తులుధరించిన ఒకడు "యెందుకు, ప్రభూ! అట్లా అంటారు?" అన్నాడు.

నక్షత్రకుడు తననుతనే పరిశీలనచేసుకున్నాడు. ఒక్కసారిగా మార్పుఅంతా కనపడ్డది. పూర్వపుసౌందర్యము, కోమలత్వము, తిరిగి అతని శరీరంలో పూర్తిగా ప్రవేశించినై.

మరొకమారు మంత్రులు, మతాచార్లు "ఈదినము యీవిధముగా మా ప్రభువు లభించునని మ[illegible] జ్యోతిష్యము చెప్పబడినది. కాబట్టి తడవుచేయక ఈ కిరీటమును స్వీకరించి మాకు రాజువై దయాదాక్షిణ్యములతో మమ్ములను పాలింపవలసినది" అని సవినయముగా విన్నవించుకొన్నారు.

"దీనికి నేనర్హుడను కాను. నాతల్లియందు నేను నిర్దయతో ప్రవర్తించినాను. ఇప్పుడు ఆమెను వెదకి క్షమాపణ వేడుకోవలె. అంతవరకు నాకుచిత్తశాంతికలుగదు. కాబట్టి నన్నుపోనీయండి ఆలస్యంచేయకుండా" అని వేడుకొని వెళ్లిపోవుటకు వెనుకకు తిరిగేసరికి చుట్టూ ఉన్నగుంపులో తన తల్లియైన ముసలిముష్టిది, కుష్ఠురోగి కనపడ్డారు. పట్టజాలనిసంతోషముతో తల్లిదగ్గరకు పరుగెత్తి తన కన్నీటిధారలతో ఆమె పాదములు ప్రక్షాళనముచేశాడు. ఆమె కాళ్లకిమ్రొక్కుతూ "తల్లీ! ఒకప్పుడు గర్వపోతునై నిన్ను దూషించేను. తిరస్కరించేను. ఇప్పుడు నీవిధేయుణ్ణి నన్ను ప్రేమించి, ఆశీర్వదించు" అన్నాడు. కాని ఆమె మాట్లాడలేదు.

విచారంతో నక్షత్రకుడు కుష్ఠురోగి పాదములనుపట్టుకుని "మూడుమారులు నేను నీయెడల దయచూపించాను. నాతల్లిని నాతో మాటలాడమని చెప్పు" అని బ్రతిమాలుకున్నాడు. కాని కుష్ఠురోగి పలుకలేదు.

నక్షత్రకుడు వెక్కి వెక్కి ఏడ్చేడు. "తల్లీ! నీకంటే నాఅనుభవంయెక్కువగాఉన్నది. ఇహాసహించలేను. నన్ను క్షమించినానని చెప్పు. తిరిగి అడవిలోకి వెళ్లిపోతాను" అని ప్రాధేయపడ్డాడు. ముసలిముష్టిది, కుష్ఠురోగి అతని శిరముపై చేతులుపెట్టి 'లే' అన్నారు.

నక్షత్రకుడులేచి వారివంకచూశాడు. వారు రాజు, రాణిగా కనపడ్డారు. రాణి రాజునుచూపిస్తూ "నీవు సహాయముచేసిన నీ తండ్రియితడుగో" అన్నది. రాజు రాణినిచూపిస్తూ "నీవుపాదములు పట్టిన తల్లి యిదుగో" అన్నాడు.

తర్వాత వారు పుత్రుణ్ణి దగ్గరకుతీసి శరీరముదువ్వి గట్టిగాముద్దుపెట్టుకున్నారు. అందరును కలిసి రాజమందిరములోపలికి వెళ్ళేరు. తల్లిదండ్రులు నక్షత్రకుని మంచిదుస్తులతో అలంకరించి తలమీద కిరీటముఉంచి నదీతటమున ఉన్న ఆనగరమునకు పట్టాభిషిక్తునిగా చేశారు.

నక్షత్రమహారాజు న్యాయనీతులతో ఆమాంత్రికుని వలసపంపి పాలేరువానికి, భార్యకు, పిల్లలకు అనేక గొప్ప బహుమతులు అందచేశాడు. ఎవ్వరును జీవహింసచేయకూడదని ప్రకటించేడు. 'ఆత్మవత్సర్వభూతాని' అని బోధించేడు.. తను గొప్ప దయామయుడు, దానకర్ణుడుఅయినాడు. బీదలకు అన్నదానము, వస్త్రదానము విరివిగాచేశాడు. సంతుష్టి, సంతోషము దేశములో అన్నిమూలల వ్యాపించినవి.

కాని నక్షత్రకుడుఎక్కువకాలం రాజ్యవైభవాలనుఆనందించడానికిప్రాప్తిలేకపోయింది. కర్మపరిపాకం తప్పేనదికాదు. అతడు పొందిన ఆవేదన, పడినకష్టములు, అనుభవించిన యిక్కట్లు అతనిజీవితకాలాన్ని త్వరలోనే అంతముచేసినాయి. మూడేళ్లు పూర్తిగానిండకపూర్వమే నక్షత్రకుడు కాలముచేశాడు.

# రవ్వలబేసరి

శ్రీమతి కే. యన్. మూర్తిబాయిగారు

నాకు నగలమీద ఎంత అసహ్యమో మాఆవిడకు అంతఆపేక్ష. నాకు కలెక్టరు కచేరీలో 60 రూపాయిలజీతం. భూములమీద సాలుకు 600లు వస్తాయి. ఒకనాడు నేను యింటికి వచ్చేసరికి మాశ్యామల "ఏమండో! నాకు రవ్వలబేసరి చేయించరూ" అంది. కచేరీలో నడుము ఛాక్కుపొయ్యేటట్టు రాసిరాసి యింటికివచ్చేసరికి కాళ్లుకడుక్కునేందుకు నీళ్లయినా ఇవ్వకుండా బేసరి చేయించమనేసరికి నాకు ఎక్కడలేనికోపమూ వచ్చింది. కాని ప్రస్తుతము స్త్రీ స్వాతంత్రము నలుగడలవ్యాపించివుండుటచేత ఏమి అనడానికీ వీల్లేక "అలాగే" అన్నాను. మాశ్యామల నాసంగతి గ్రహించిందికాబోలు ఆవేళకు వూరుకుంది.

ఒకమాటు ఆదివారంనాడు మళ్లీ "బేసరిచేయించరూ" అంది. నేనుకూడా కొంచెం శ్రద్ధవహించినట్టు "ఎల్లాగుంటుంద"న్నాను. వెంటనే "ఇదిగో తెచ్చి చూపించనా" అంటూ పొరుగింటి కామాక్షమ్మదగ్గిరకువెళ్లి బేసరి పట్టుకొనివచ్చి నాకు చూపించింది. తన ముక్కుకుపెట్టుకొని "ఇంతేవుంటే బాగుంటుంది. మరీపెద్దదయితే నాజూకుగా ఉండదు. ...ఏం—మాట్లాడరేం" అంటూ నామొఖంకేసిచూసింది శ్యామల. ఇదంతా చూస్తే నాలోనాకే నవ్వువచ్చింది. ఆవిడని వూరుకోబెట్టడానికి అన్నానుగదా "సరే! ఈయేడాదికి మనభూములమీద వచ్చిన శిస్తు అయిపోయిందిగదా! మీదటికి తప్పకుండా చేయిస్తా" న్నాను. మీదటిదాకా ఆగడానికి కష్టముతోచిందికాబోలు మాఆవిడ మొహం చిన్నబుచ్చుకుంది. నాకూ ఆవిడకోరిక నెరవేర్చలేకపోతినని మనస్సు పీకుతోంది. కాని యేమి చెయ్యడం? బేసరిచేయించడానికి డబ్బేదీ! రొఖ్ఖసొమ్ముపోసిచేయించడానికి చేతిలో లేకపోయినా ఆర్మగాచారిలాంటి గొప్పనగలవర్తకులెవరయినా అరువుయివ్వరా అని తీవ్రంగా ఆలోచిస్తూకూర్చున్నాను. రుసరుసలాడుతూ వంటయింటిలోకి వెళ్లిపోయింది శ్యామల. ఆవేళనాడు కాఫీ, ఫలాహారమూ సున్నచుట్టిందన్నమాటే.

ఇంతట్లో నేనెరిగిన వకషరాబు మావీధిన వెళ్లుతూవుండడంచూశాను. ఆవేళ సెలవు దినంగనక ఫలాహారంమాట యెలావున్నా ఇంతకాఫీ అయినా త్రాగకపోతే సాయంత్రం దాకా గడవడం కష్టమని తోచింది. దేముడులాగకనబడిన షరాబుని లోపలికిపిలిచి క్రొత్త రకం రవ్వలబేసర్లు నాలుగయిదు చూపించమని చెప్పేసరికి అతను చూపించేడు. కొన్ని బేసర్లు నాలుగువందలు మొదలుకొనీవున్నాయి ఖరీదులు. అంతఖరీదు పెట్టడమంటే నాకు వకవిధమైన బెంగతోస్తూంది. అయినప్పటికీ శ్యామలవైపు బిక్కమొగంవేసుకుచూస్తున్నా. ఆవిడ నాలుగైదుబేసర్లు చూచి వకటిరాళ్లు బాగులేవనీ, ఇంకొకటి పొందికగాలేదనీ, మూడోది పెద్దదయిందనీ యిలాగ ఏవేవోవిమర్శనలు సాగించింది. నాకు కొంచెం ధైర్యం వచ్చింది. చివరకు బేరమైతే నసిపకలేదుగాని శ్యామల రుసరుసలువదిలేయి. షరాబు

అన్నాడు "ఇవి మీకునచ్చకపోతే ఫస్టుతారీఖునాటికి మీరుచెప్పినమోస్తరుగావుండేది వక బేసరి చేయించితెస్తాను. ఆర్డరు ఇవ్వండి" అన్నాడు. తనకు కావలసిన మోస్తరుఅంతా వర్ణించి చెప్పింది శ్యామల. ఇక తనపని అయిందని వంటింటిలోకి వెళ్లిపోయింది.

ఆర్డరు అప్పుడేయిస్తే అడ్వాన్సు యివ్వాలి. చేతిలో వకపైసా అయినాలేదు. అందుచేత యీసావకాశం పురస్కరించుకొని మెల్లిగా షరాబుని పంపించేశాను మంచి మాటలు చెప్పి. ఫస్టుతారీఖున కనబడమన్నాను. ఈలోగా శ్యామల కాఫీతీసుగువచ్చి యెదటపెట్టింది. స్టవ్ వెలిగించి అయిదునిమిషాలలో కాఫీ తయ్యారుచేసే శక్తివుందిలేండి మాశ్యామలకి. అందులో రవ్వలబేసరి వస్తుందనే హుషారొకటి కూడాను. ఆవేళకి కాఫీవస్తులేకుండా త్రాగేసి వీధిలోకి షికారు వెళ్లిపోయాను. ఫస్టుతారీఖురానూవచ్చింది. షరాబూవచ్చేడు. కాని అడ్వాన్సు నూరురూపాయిలిమ్మనేసరికి ఇప్పుడు కాదని పంపేశాను. ఇంతట్లోకే మామూడో బావమరిదికి పెళ్లిఅనీ, మూడువేలుకట్నం అనీ, మమ్మలిని ఇద్దరినీరమ్మనీ మా మామగారి వద్దనుంచి ఒకవుత్తరంవచ్చింది. మాశ్యామలతో "నాకు సెలవు దొరకదు. నువ్వు వెళ్లు" అన్నాను. ఎగిరి గంతువేస్తూ పెట్టెలో బట్టలూ అవీసర్దుకొంది. శ్యామల రైలుఖర్చుకు మాత్రం డబ్బుసరిపుచ్చి రాత్రిపండ్రెండుగంటలకి బయలుదేరే రైలులో శ్యామలను పంపించేను బరంపురం. సాయంత్రమే యిచ్చేనులెండి మామగారిపేర టెలిగ్రాం శ్యామలని పంపుతున్నానని.

ఒంటరిగా ఇంట్లోఉంటూ మాగదిలోవున్న పటాలకేసి చూస్తూ ఆలోచిస్తూ కూర్చున్నాను. శ్యామలకోరిక తీర్చలేకపొయ్యానే అని మరీ తీవ్రంగా ఆలోచనాపరంపరలతో కాలంగడుపుతూవున్నాను. నాబాల్యస్నేహితుడు ఒకాయన ప్లీడరీచేస్తున్నాడు. ఆయన్ని అడిగి నూరురూపాయలు బదులుతీసుగొచ్చి అడ్వాన్సుయిచ్చి రైతులతో మాట్లాడి మీదటికివచ్చే అయివజుమీద నాలుగువందలు బదులుపుచ్చుకొని యెల్లాగయినా శ్యామల వచ్చేసరికి బేసరి చేయిద్దామని నిశ్చయించుకున్నాను. ఆరాత్రికి నిద్రపట్టింది.

మర్నాడు కచేరికి వెళ్లేసరికి చెన్నపట్నంనుంచి పై ఆఫీసర్లు తనిఖీకివస్తున్నారనీ కాగితాలన్నీ సరిగా ఆర్డరులో పెట్టవలసిందనీ అన్నారు. ఆనాలుగురోజులూ కచేరితనిఖీతోటే అయిపోయింది. ఇక షరాబుమాటా జ్ఞాపకంలేదు. ప్లీడరుస్నేహితుడిమాటా జ్ఞాపకంలేదు. తనిఖీపూర్తి అయింది. పై ఆఫీసర్లు వెళ్లిపోయారు. ఇంటికివచ్చి గృహలక్ష్మిపత్రిక తిరగవేస్తూ కూర్చున్నాను. ఇంతట్లోకే రాత్రిమెయిల్లో దిగుతున్నామని మాబావమరది యిచ్చిన టెలిగ్రాం అందినది. గభాలునలేచి మాదొడ్డమ్మతో "శ్యామలని పెద్దబావ తీసుకొస్తున్నానని రాశాడు. మెయిలులో వస్తారు" అన్నాను. రాత్రి తొమ్మిదిగంటలకి సరిగ్గా స్టేషనుకివెళ్లి వాళ్లయిద్దరినీ యింటికి తీసుకువచ్చేను. భోజనానంతరం శ్యామల నాతో "ఏమండీ బేసరి మాట" అని మళ్లీ జ్ఞాపకంచేసింది. అప్పుడు తనిఖీసంగతి చెప్పి

అకస్మాత్తుగా తనిఖవచ్చిఉండకపోతే నేను చేయదలచుకొన్నదంతా చెప్పేశాను. "మీకెంత కష్టమెందుకు" అంటూ తన పుస్తెల్లోవున్న తాళంతో సూటుకేసు తెరచి చిన్న మొఖమల్ పెట్టెలో ఎర్రనికాగితపుపొట్లంవిప్పి "చూడండి"అంది. చూశానుగదా రవ్వలబేసరి! "నాకు మాఅన్నయ్యపెళ్లికి ఆడబిడ్డ కట్నం" అంది శ్యామల ముక్కుకు పెట్టుకుంటూను. రవ్వలబేసరి!

## కొమ్ముటేన్గులవిగో కోరాడిరంపిల్లెడున్

శ్రీమతి కల్వాల పార్వతీదేవిగారు

౧

ఒకజాడింపుకే సంప్రమోకులు రయోద్ధూతంబునన్ బిండియై
రొక్కచక్కిం బడఁ గట్టుకంబములు సుజ్జూతల్పొనర్పంగ వే
ఒకచోశ్వేతపతాకముల్బెదరగా యుద్ధంబుకై నిల్చి మూ
గుకవచ్చెన్ బలె కొమ్ముటేన్గులవిగో కోరాడిరంపిల్లుచున్.

౨

కనులన్మండెడుచంద్రనిప్పుకలతోఁ గార్కొన్నకార్మబ్బున
ల్లనిమైచాయల నెత్తుటేర్లగమితో లాగుల్వెసంబర్వ నె
చ్చనినిట్టూర్పులతుండముల్మలిచి వృక్షాగ్రంబులన్ లాగి మే
కొని వప్రాళిని గొమ్ముటేన్గులవిగో కోరాడిరంపిల్లెడున్.

౩

ఘీంకారంబులు మిన్నుముట్ట జయలక్ష్మీస్వాగతశ్లోకముల్
బింకంబూని పఠింపదంతములు ఫెళ్ఫెళ్లించుమ్రోయంగ ని
శ్శంకంబీటలువారుకోటలు మహాసంకల్పముంజెప్ప నే
గొంతున్ లేకటఁ గొమ్ముటేన్గులవిగో కోరాడిరంపిల్లెడున్.

౪

ఏరేరీమొనగాండ్రు పట్టెదరటోయీ? మీదుబంధింపులా
పోరాటంబునఁజూపవచ్చునదిగో పోఁబోకుఁడా వైపుడీ
కోరాదా? పసికూన లేటికిమహాక్రోధంబునం జెండ మీ
కూకల్మాన్పెడు కొమ్ముటేన్గులవిగో కోరాడిరంపిల్లెడున్.

# జయదేవుని గీతగోవిందము

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

సంస్కృతవాఙ్మయమున గీతప్రబంధరచనాధురీణులయందు నగ్రస్థానమాక్రమించి జగత్కీర్తిబొందిన యతడు జయదేవమహాకవి యని ఘంటాపథముగా చెప్పకతప్పదు. ఈకవి పరమభక్తాగ్రగణ్యుడని యీతని గేయములవలన ముందుముందు గాంచనగు. తొలుత ఈకవియొక్క కాలనిర్ణయాదుల నించుకంత యెరుంగుట సమంజసము.

ఈమహాకవి గోవర్ధనాచార్యునితో సమకాలికుడై లక్ష్మణసేనుని సభలో కొంతకాలము అనగా క్రీ.శ. ౧౧౪౦, ౧౧౭౦ వత్సరములనడుమనున్నవాడని తెలియనగును. ఉత్కళదేశమున జగన్నాథక్షేత్రమునకుసమీపమునన్న కెందుబిల్వ మీతని నివాసగ్రామము. ఈతనితండ్రి భోజదేవుడు, తల్లి రాధాదేవి, భార్య పద్మావతి, మిత్రుడు పరాశరపండితుడు. ఉమాపతిధరుడు, శరణుడు, ధోయీకవిరాజువారలు సమకాలీనులు.

## గీతగోవిందము

ఇది ద్వాదశసర్గాత్మకమై యిరువదినాలుగు అష్టపదులతో రాగతాళనృత్యములకు సరిపడునట్లు ఛందోబద్ధముగా నత్యంతమనోహరమృదుమధురసరళపదాన్వితమై ప్రతిపాదితకృష్ణలీలావిశేషంబులగుటంజేసి పఠనశ్రవణజనితపరమానందంబై విలసిల్లుచున్నది. ఈగ్రంథమును కవి స్వతంత్రజీవియు స్వేచ్ఛాప్రవృత్తియుగలవాడగుటచే ధనాశాపరుడై రాజాదులకంకితమొనర్చి జీవితము కళంకపరుపక ప్రహ్లాదాదులవలె నేకాంతభక్తిగలవాడగుట ప్రణయస్వరూపుడగు శ్రీకృష్ణపరమాత్మనే కృతికధీశ్వరునిగాజేసి తన ప్రతిభయు, కీర్తియు లోకమున చిరస్థాయిగానొనర్చెను.

## కథాభాగము

ఇందు శ్రీకృష్ణుని విలాసక్రీడలు, ప్రణయవిహారము, రాధికావిరహము ముఖ్యముగా వర్ణితమైయున్నవి. మొదటి అష్టపదియందు మాళవరాగమున "ప్రళయపయోధిజలే। ధృతవానసి వేదం। విహితవహిత్రచరిత్రమఖేదం" అని ప్రార్థనారూపముగ భగవంతుని దశావతారవర్ణనగావించి, యొక్కొక్కయష్టపది వేరువేరు రాగములతో శ్రీకృష్ణభగవానుని ప్రత్యేకలీలలు హృదయాహ్లాదకరముగ వర్ణించి శిలలుగూడ ద్రవీభూతమగునట్లొనర్చెను. కావ్యారంభప్రథమసర్గప్రథమశ్లోకము తమాలవృక్షములతోనిండియున్న యమునాతటదృశ్యము కనులకుగట్టినట్లు మిగుల చక్కగా చిత్రించెను. దాని నిట పొందుపరచుచున్నాను.

శ్లో॥ మేఘైర్మేదుర మంబరం వనభువః శ్యామా స్తమాలద్రుమైః
నక్తం భీరురయం త్వమేవ తదిమం రాధే గృహం ప్రాపయ।
ఇత్థం నందనిదేశతశ్చలితయోః ప్రత్యధ్వకుంజద్రుమం
రాధామాధవయోర్జయంతి యమునాకూలేరహః కేళయః॥

ఇట్లే యీ గ్రంథమునుండి గీతముల గొన్నిటి స్థాలీపులాకన్యాయమున నిచట వ్రాయుచున్నాను.

### (వసంతరాగేణగీయతే)

౧. లలితలవంగలతాపరిశీలన కోమలమలయసమీరే
మధుకరనికరకరంబితకోకిల కూజితకుంజకుటీరే॥



కుహనా వేషము

(ఫ్యాన్సీడ్రెస్సు పోటీయందు బహుమతిపొందిన బాలిక)

*Photo by Messrs M. Doss & Bros., Madras*



రాజలక్ష్మి

[సినీమా నట్టువరాలు]



విలోచన

[సినీమా నట్టువరాలు]

***By Courtesy of***
***The General Pictures Corporation,***
***Madras.***

ప॥ విహరతి హరిరిహ సరసవసంతే, నృత్యతి యువతిజనేనసమం-
సఖి విరహిజనస్యదురంతే, విహరతి హరిరిహ సరసవసంతే॥

౨. ఉన్మదమదనమనోరథ పథికవధూజన జనితవిలాపే-
అళికుల సంకులకుసుమసమూహ నిరాకులవకుళకలాపే ॥విహ॥

౩. మదనమహీపతి కనకదండరుచి కేసరకుసుమవికాసే-
మిళితశిలీముఖపాటల పటల కృతస్మరతూణవిలాసే ॥విహ॥

౪. మృగమద సౌరభరభసవశంవద నవదళమాలతమాలే-
యువజనహృదయవిదారణ మనసిజనఖరుచికింశుకజాలే ॥విహ॥

౫. విగళిత లజ్జిత జగదవలోకన తరుణకరుణకృతహాసే-
విరహినికృంతన కుంతముఖాకృతి కేతకిదంతురితాశే ॥విహ॥

౬. మాధవికా పరిమళమిళితే నవమల్లికయాతి సుగంధౌ-
మునిమనసామపి మోహనకారిణి తరుణాకారణబంధౌ ॥విహ॥

౭. స్ఫురదతిముక్తలతా పరిరంభణముకుళిత పులకితచూతే-
బృందావనవిపినే పరిసరపరిగత యమునాజలపూతే ॥విహ॥

౮. శ్రీజయదేవభణితమిద ముదయతి హరిచరణస్మృతిసారం-
సరసవసంతసమయవన వర్ణన మనుగతమదన వికారం ॥విహ॥

ఇట్లు మనోహరమైన వసంతఋతువునందు శ్రీ కృష్ణుడు విహరించుచున్నట్లు సర్వజనహృదయహృద్యంబుగా చిత్రించియున్నాడు. ఇందలి శబ్దముల యమకమువల్లనో, కవి కవిత్వమహిమవల్లనో, యమునాజలముచే పవిత్రమైనభూమియందు పుష్పములతో మెండుగానిండిన వృక్షములు వాటికి జుట్టుకొనియున్న లతాజాలములు అందు నివసించి స్వేచ్ఛగా దిరుగుచు నాడుచు భూనభోంతరములు నిండునట్లనేకపక్షుల మృదుమధురకిలకిలారావములు మొదలగునవి పసిపాపలనుగూడ నానందపరవశులజేయును. ఇవ్విధమున పరశునుకుమారపదములతో నితరమణీయముగ వసంతమును వర్ణించినవారు లేరనవచ్చును. మరియు రాసక్రీడయందు

## (దేశాక్షిరాగేణ గీయతే)

౧. సంచలదధరసుధామధురధ్వని ముఖరితమోహనవంశం-
చలితదృగంచల చంచలమౌళి కపోలవిలోలవతంసం-

ప॥ రాసే హరిమిహ విహితవిలాసం- స్మరతిమనో మమ కృతపరిహాసం॥
రాసేహరిమిహ..............................

౨. చంద్రకచారుమయూరశిఖండ మండలవలయితకేశం-
ప్రచురపురందరధనురనురంజిత మేదురముదిరసువేషం ॥రాసే॥

(ఈ గీతమున రాధ తనచెలితో రాసక్రీడాస్థలమందు శ్రీకృష్ణుడొనర్చిన లీలావిశేషములు తనమనమున్న కహర్నిశమును మరుపురాకయున్నవని చెప్పియుండెను.) రాధ మనోవాక్కాయకర్మలచే కృష్ణునే ప్రేమించి

తదైక్యమునొంది ఓలలాడుచున్నప్పుడు యామెకట్లు పరంజ్యోతియగు శ్రీకృష్ణభగవాను డెట్లు మరుపురాగలడు? ఇది వింతకాదు. ఇక్కడ రాధకు శ్రీకృష్ణునియందుగల ప్రేమ లోకసామాన్యప్రేమ కాదు. ఈప్రేమలో గంభీరమైన భావమిమిడియున్నది. పరమపవిత్రమును నిష్కళంకమును పరమార్థముతో నిండియున్న ప్రేమను మరియొక భావమున ప్రకటించుట ఘోరపాపమేయగును. ఇందలి ప్రేమ కేవలముమోక్షాశయమైనది. భగవంతుని ప్రేమించి ముక్తులగుటకు రాధకు కృష్ణపరమాత్మ నెడ నెట్టిప్రేమయుత్పన్నమైయుండెనో అట్టిప్రేమయే ముఖ్యతమము. ఈ యష్టపదియందలి "సుధామధురధ్వని" "ముఖరిత" మొదలగుశబ్దములు మిగుల కర్ణపేయముగనుండి మనోవికసనము చేయుచున్నవి.

ఈ గీతములు పాడునప్పుడు మానవులేగాక పశుపక్ష్యాదులు సహితము మోహింపబడుచున్నవి. ఇట్టి లోకోత్తరమహత్తరమాధుర్యపదము లప్రయత్నముగ నిమ్మహాకవి కావ్యమున ననంతములు గానబడుచున్నవి. ధ్వనిలేనిశబ్దము గానరాదు. మచ్చునకైనను కటోక్తి దొరుకదు. భావము ప్రధానము. శబ్దాలంకారములు మెండుగానున్నవి. శృంగారరసపోషితభక్తిరసము అంతటను వెల్లివిరియుచున్నది. సమవిభక్తావయవములు శరీరసౌందర్యమున కెట్లొకకారణమో, యట్లే ఈజయదేవుని గీతములందలి పదసమాసాదులు తులదూచితీరిచినట్లు రసవైభవానురూపముగ సువిభక్తములై వాని రామణీయమున కాధారమైయున్నవి.

ఇక రాసక్రీడాదివర్ణనావచనముంజూడ ఈకవిశ్రేష్ఠునకుగల భరతశాస్త్రపాండిత్యమును, హావభావాద్యభినయవర్ణనాపాటవంబును వెల్లడియగును. కేవలము అవతారపురుషుడనిచెప్పబడుచున్న జయదేవుని కావ్యమున నెన్నియో చక్కనియుదాహరణములుజూపింప వచ్చుగాని పైనుదాహరించిన యుదాహరణములే ఆతని కవిత్వప్రతిభను వేనోళ్ల చాటుచున్నవని సోదరీరత్నములకు వినయముతో విన్నవించుకొనుచు "క్వసూర్యప్రభవో వంశః క్వచాల్పవిషయామతిః" అను కాళిదాసోక్తిననుసరించి యింతటితో నీవ్యాసమును ముగించుచున్నాను.

# మహమ్మదాలీ మరణము

శ్రీమతి వి. జ్ఞానాంబగారు

కారుచీకటి జగమెల్లఁ గ్రమ్ముకొనియె
ప్రళయఝంఝానిలంబదె ప్రబలసాగె
మన్నుమిన్నేకమై తెన్నుమాయమయ్యె
చరమచిహ్నంబులేమొ యీజగతికివ్వి?
ఖడ్గసంచాలనంబట్టె కట్టువడియె
మూగవోయెను జయభేరి మ్రోఁతలుడిగొ
వీరస్వర్గానవెలువడె వెఱ్ఱిపిలుపు
జననికన్నులబాష్పముల్ జాలువాఱె.

కాకినాడ్పురిలోన కాంగ్రెసునేతయై
ప్రజలు జేజేలిడ ప్రబలినాడు
భరతమాతఋణంబు బాపగామదినెంచి
కారాగృహంబున కరిగినాడు

స్వారాజ్యమార్జింప సమకట్టిపయనమై
ఇంగ్లాండుదేశాన కేగినాడు
సింహంబురీతిగాఁ జెలరేగిప్రభువుల
నిండోలగంబున నుడివినాడు
తుదకు స్వాతంత్ర్యదేవతామూర్తికొఱకె
వేడ్కమీఱంగ ప్రాణముల్ విడిచినాడు
మేటిబలశాలి ధీశాలి మాటకారి
మహితగుణశాలి శ్రీశ్రీమహమ్మదాలి.

శ్రీకరంచందుగాంధికి శ్రీప్రజయము
భరతమాతకు తత్క్షణబంధముక్తి
మహితగుణశాలి శ్రీశ్రీమహమ్మదాలి
కాత్మశాంతియునిడుఁ బరమాత్ముఁడెలమి.

# దంతములు

శ్రీమతి శ్రీ రాం సూరమ్మగారు

ఒకవ్యక్తియొక్క దేహారోగ్యము నోటిలోనిపండ్లపై ఆధారపడియున్నవి. దంతములు శుభ్రముగానుంచుకొనవలెను. ఉదయమున లేచినతోడనే పండ్లు తోముకొనుట అందరకు వాడుకయే. కాని పండ్లలోని మురికి అంతయు పోవునట్లు తోముకొననియెడల అదియెట్టి అపాయము కలిగించునది అందరకు తెలియదు. పండ్లలోనుండు మలినము విషముగా మారి మనము భుజించు ఆహారపదార్థములతో కలసి కడుపులోనికిపోవును. అందువల్ల అజీర్ణము, గొంతునొప్పి, రక్తముక్షీణించుట, క్షయ మొదలైన అనేకకఠినరోగములు సంభవించును. రోగి వైద్యమునిమిత్తము డాక్టరువద్దకు వెళ్లుటతోడనే ముందుగా పండ్లను పరీక్షించి అవి సరిగాలేనియెడల దంతవైద్యునిచేత పండ్లు శుభ్రముచేయించుకొనుమని చెప్పును. ఏమనగా దంతములు శుభ్రముపఱచుటచే మందులు సరిగా పట్టునని. కాబట్టి దంతములను ఎల్లప్పుడు శుభ్రముగా నుంచుకొనవలెను.

బిడ్డలకు ఆఱవమాసముననే క్రిందివరుసలో ముందరి రెండుపండ్లును పైవరుసలో ముందరి రెండుపండ్లును వచ్చును. రెండుపండ్లునిండుసరికి క్రిందివరుసలో పదిపండ్లును, పై వరుసలో పదిపండ్లును వచ్చును. వీనికే పాలపండ్లని అందురు. ఇవి ఆఱుసంవత్సరముల వయస్సువచ్చేసరికి క్రమముగా ఊడిపోయి క్రొత్తవి వచ్చును. ఇవియే శాశ్వతపుపండ్లు. ఇవి యేకారణముచేనైనను ఊడిన తిరిగిరావు. వీనిలో పై క్రిందివరుసలయందలి ఆఖరు దంతములు నాలుగును వ్యక్తికి ఇరువది ఇరువదియైదు సంవత్సరములువచ్చినతరువాతవచ్చును. వీనికే జ్ఞానదంతములని పేరు. ప్రతిదంతముపైని తెల్లని పింగాణీవంటి పొరయుండును. దీని చేతనే పండ్లకు పటుత్వము కలుగుచున్నది. శిశువు జన్మించినప్పుడు అన్ని అవయవములు ఉండును గాని పండ్లుమాత్రము ఉండవు. పండ్లతో అవసరము కలిగినప్పుడే అవివచ్చునట్లు భగవంతుడేర్పాటుచేసియున్నాడు. చిన్నపిల్లలు పాలనే త్రాగెదరు. కాబట్టి వారికి పండ్లతో అవసరములేదు. ఆఱుసంవత్సరములవయస్సువచ్చువరకు గట్టివస్తువులను బాగుగాజీర్ణముచేసి కొనుశక్తియుండదు. కనుక అవసరములేని గట్టిదంతములు ఉండక పాలపండ్లు మాత్రమే మొలచియుండును. ఈసంగతులను మనము గమనింపక బిడ్డలకు ఏడెనిమిదిమాసములు వచ్చినప్పటినుండియు బిస్కతులు, పప్పులు, మిఠాయి మొదలైన గట్టిపదార్థములను పెట్టుటచే వారికి అజీర్ణముచేసి తరుచు జబ్బులు వచ్చుచుండును.

పెద్దవారికిగూడ నాహారమును బాగుగా నమలి మ్రింగవలయుననుట తెలియదు. ముఖ్యముగా అందము కొరకు మాత్రమే దంతములు నిర్మింపబడినవని చాలమంది తలచుచున్నారు. నాలుకక్రిందిభాగమున నుండియు, పండ్లమధ్యనుండియు ఒకవిధమగు నీరు ఊరుచుండును. దీనినే 'ఉమ్మి' యందురు. ఏదైనను ఒక పదార్థమును నోటవేసుకొన్నప్పుడు

ఈ ఊట వచ్చుచుండును. మనము తినుపదార్థములు సన్ననినాళములద్వారా కడుపులోనికి అచ్చటనుండి రక్తనాళములలోనికి పోవుచుండును. కాబట్టి ఆహారమును బాగుగా నమలి ఊటతోచేర్చి జారుగాచేసి మ్రింగవలయును. బాగుగా నమలిమ్రింగనిచో ఆహారము ఉమ్మి నీటితో చక్కగా కలియకపోవుటచేత త్వరగా జీర్ణముగాక కడుపులో ఒకవిధమైన బాధ కలిగించును. కాబట్టి ఆహారమును బాగుగా నమిలితినుట ప్రతివారు వాడుకచేసికొనవలయును.

పిల్లలు సాధారణముగా చింతకాయలు, మామిడికాయలు మొదలగు పుల్లనివస్తువులను కొరుకుచుందురు. మరియు ఒకరితో నొకరు పంతమువేసికొనుచు గట్టివస్తువులను నములుచుందురు. ఈ రెండుపనులను దురభ్యాసములుగ పరిగణింపవలయును. పెద్దవారు పిల్లలను ఈ దురభ్యాసముల బారిపడనీయక దిట్టపరచుట మంచిది.

మిక్కిలి గట్టివస్తువులను కొరుకుటవలనను, సూదులు మొదలగువానిచే పండ్లను పొడుచుకొనుటవలనను, పులుపు హెచ్చుగా తగులుటవలనను పంటిపైనుండు పింగాణీవంటిపొర పోయి పండ్లు చెడిపోవును. పండ్లచిగుళ్లక్రింద చీముపోయుటచే పండ్లుచెడిపోవును. వాటినే పుప్పిపండ్లని అందుము. అవి చాలాబాధకలిగించును. కనుక వాటిని ఊడతీయించవలెను. లేదా దంతవైద్యునిచే బాగుచేయించవలెను. ప్రతిరోజున శుభ్రముచేయని యెడల పండ్లుచుట్టు పసుపురంగుగల పాచియేర్పడి దానివలన పండ్లకుదుళ్లు చెడి బలము తగ్గి పండ్లు కదలుట ఆరంభించును. ఇట్లు చెడిపోయి కదలుచున్న పండ్లవల్ల కలుగు బాధ యింతయని చెప్పుటకు సాధ్యముకాదు. అట్టి సమయమున పండ్లను తీయించి చేతపండ్లు కట్టించుకొనుటయే మంచిది. చేతపండ్లు ఆహారమును నములుటకు, స్వచ్ఛముగా మాటలాడుటకును వీలుకలిగించును.

చేతపండ్లను అనుభవసీయులై పనితనముగల దంతవైద్యునిచేత కట్టించుకొనుట మంచిది. చిగుళ్లక్రింద చీము ఉన్నదో లేదో తెలుసుకొనవలెనన్న నిద్రలేచినతోడనే చిగుళ్లను వ్రేలితో నొక్కిచూడవలెను. తెల్లని జిగురువంటి పదార్థము వ్రేలికివచ్చిన చీమువున్నదని తెలిసికొనవచ్చును. నిమ్మరసముతో చిగుళ్లను రుద్దిన చీమంతయు పోయి చిగుళ్లు శుభ్రమగును. తరువాత వేడినీళ్లతో కడగవలెను.

పైనచెప్పిన పండ్లలోని పాచి, చిగుళ్లక్రిందిచీము భోజనము చేయునప్పుడు పండ్లసందులలో చిక్కుకొని కుళ్లిపోయి విషముగా మారునని వేరుగా చెప్పనవసరములేదు. ఈవిషము మనముతిను ఆహారముతోకలసి కడుపులోనికిపోయి మనకు తెలియకుండగనే కడుభయంకరములగు వ్యాధులనుకలిగించును. కాబట్టి మనము పండ్లను శుభ్రముగానుంచుకొను విషయమై మిక్కిలి శ్రద్ధతీసికొనవలెను.

# అత్తగారి అధికారము

శ్రీమతి కోటమర్తి రాజేశ్వరమ్మగారు

౧

రంగము - రాజమ్మగారి గృహము

[ప్రవేశము- రాజమ్మ, జోగమ్మ, హనుమాయమ్మ]

రా:—రండి; అనుకుంటూ ఉండగానే వచ్చేరు. ఏమిటి విశేషాలు? జోగమ్మక్కయ్యా!

జో:—ఏమున్నాయి? కలికాలం వచ్చింది. ఆడవాళ్లు చదువులవల్ల బొత్తిగా పాడైపోతున్నారు. పెద్దలయెడ భయభక్తులు లేకుండా వున్నారు. నేను మొన్న రాజారావుగారింటికి వెళ్లేను. ఆయనకొడుకు కోడలికి యింగ్లీషు చెపుతూ యున్నాడు. నాకు సర్వఅసహ్యమూ వేసింది. సిగ్గు బిడియములు లేకుండా- పట్టపగలు మాటలేకాకుండా- చదువులుకూడాను.

హ:—అవునమ్మా ఆ చదువే కొంపముంచుతోంది. మనయింటిప్రక్కనున్న సుందరరావుగారి కుమార్తెకి మొగుడు పోయాడు. అప్పటినుంచి బళ్లోకివెళ్లి చదువుతుంటోంది. పెళ్లి కూడాచేస్తారట.

రా:—వీళ్ల చదువులు మాసిపోనూ. రామరామ. ఇల్లాంటి విరుద్ధాలు జరుగుతూవుంటే మనబోటివాళ్లంతా చచ్చిపోవలసిందే.

జో:—ఎందుకో యీచదువులు? ఆడవాళ్లు చదువుకుని ఉద్యోగాలు చేస్తారా? ఊళ్లేలుతారా? చదువురాకపోతే మనబోటివాళ్లని మన మొగుళ్లు విడిచిపెట్టేరాయేమిటి, చెప్పుమతీ? ఇందుకనే మాఅమ్మాయి యెన్నోసార్లు బళ్లోకివెడతానన్నా నేను వప్పుకోలేదు.

హ:—మా కోడల్ని వాళ్లవూళ్లో బళ్లోకి పంపేరని తెలిసింది. బళ్లోకి పంపితే వీలులేదని కఠినంగా కబురుపంపేను. ఇక్కడకివచ్చినతర్వాతకూడా, షోకులు పనికిరావనిచెప్పి కచ్చాపోసి చీరకట్టిస్తున్నాను. వాల్‌జడ గీల్‌జడ; పక్కపాపిడి గిక్కపాపిడి అన్నీకట్టిపెట్టించేను. చదువుకోలేదుగనుక చెప్పినట్లువిని చచ్చినట్లు పడిఉంది.

రా:—నీవు అదృష్టవంతురాలవు. నీకోడలువింది. నాకోడలు వినదు. పక్కపాపిట మానమని వేయివిధాల చెప్పేను. నాకొడుకే వొప్పుకోడు. ఏమిపాపిడైతేఏమి అంటాడు. వేగలేక చచ్చిపోతున్నాను.

హ:—ఇవి ఎక్కడి షోకులమ్మా? మా కాలంలో నిక్షేపంగా పచ్చగా పసుపు పూసుకొని, యెఱ్ఱగా బొట్టుపెట్టుకొని యెంతో అందముగా ఉండేవాళ్లము. ఇప్పుడు మొగాన్ని యింత బూడిదెలాగ యేదోపూసుకుంటారు. అది అందము కాబోలు! మా కోడలుమాత్రము వింటుందనుకొంటున్నావా? నా నోటికి జడిసి పూరుకుంటోంది, అస్తమానూ అరుస్తూ అన్నీ చెబుతూవుంటాను.

జో:—వదినా! రేపు మళ్లీ వద్దాము. పనివేళ అయింది. ఇంటికివెడదాము.

[రాజమ్మగారికోడలు కమల ప్రవేశం]

క:—వంట, అత్తా! ఏమిచెయ్యవలెను?

రా:—యేం చేశేదా? నీశార్ధంచెయ్యి. ఎవరేనా ఇంటికివస్తే మాట్లాడనిస్తావా, లేదా? చేస్తున్నావే మాయివంట. గొప్ప గొరిగిపోతోంది. నన్ను అడగాలికాబోలు! నీకు తోచినదిచెయ్యి.

క:—నిన్న అడగలేదని కోపముపడిరని ఇప్పుడు అడిగితిని. అత్తా! కోపమువస్తుందని తెలిస్తే అడగను.

రా:—అయ్యో! అయ్యో! దానికి ఏమి సమాధానము చెప్పనమ్మా? ఆవిడకు చదువు వచ్చును. నన్నే ఎదిరిస్తోంది, వింటున్నారా? నాకు చావు పెట్టడమ్మా దేవుడు. దానితో చదువురాని ఎధవను నేను మాట్లాడగలనా?

క:—(వెళ్లిపోవును.)

—జోగమ్మ, హనుమాయమ్మ నిష్క్రమింతురు.

రా:—బొద్దురాచిప్పలాగ చూస్తావేమి? నీతో నేను వేగలేకుండా ఉన్నాను. మొగాళ్లు భయం చెప్పడంలేకపోతే ఇల్లాగే ఉంటారు.

క:—(ఊరకొనును.)

రా:—సోదెమ్మ కూతుర్ని చేసుకోమని కాళ్లుపట్టుకొని బ్రతిమాలితే వప్పుకోక నాకొడుకు నిన్ను చేసుకొన్నాడు, నీవు మమ్మల్ని వుద్ధరిస్తున్నావు. ఏడాదైంది కాపురానికి వచ్చి. ఒక్క పిల్లవాడైనా పుట్టలేదు. షోకుమాత్రం కావలసినంత వుంది. పాపిడమానవని చెప్పరా అంటే అసలే చెప్పడు. పోనీ వాడికర్మం. ఈ వంకాయ పక్కటి కూరవండు, ఈ అర్ధసేరు బియ్యము వండి తగలెయ్యి, నాకు రొట్టెకాల్చు.

క:—ఈ ఒక్క వంకాయకూర సరిపోతుందా?

రా:—సరిపోకపోతే నీవు వేసుకోకు. పొయ్యిలో కట్టెలు పెట్టినావు. సంసారివి కాదూ? రెండు కట్టెలు తీసివెయ్యి. నీకు చెప్పలేక చచ్చిపోతున్నాను. ఇంతకీ నాకర్మము.

క:—(తనలో) ఎవ్వరో వస్తారట కూడాను. ఈ పక్క వంకాయ వండిపెట్టాలి కాబోలు. ఉఁప్.

౨

[మాధవరావుగారికి కమల వక్కర్తే కూతురు. కమల ఎప్పుడును మాటపడి యెరుగదు. చక్కనిచుక్క. అతిగారాబముతో పెరిగినది. సంగీతము, కుట్టుపని, చదువు నేర్చుకొన్నది. గృహకృత్యములు చక్కగా చేయగలదు. కమల అత్తవారియింట తెల్లవారినది మొదలు నిదురబోవువరకు సమస్తపనులు తానే చేసి, వంట కూడ తానే చేయును. అయినను అత్తగారగు రాజమ్మ యేదియో నేరం కల్పించి పోట్లాడుచుండును. కమల భర్తపేరు ఆనందరావు. ఆనందరావు తల్లిస్వభావము పూర్తిగా ఎరుగును. కాని తల్లికి ఎదురుమాట్లాడలేడు. భయస్తుడు. కమలని యేకాంతముగా వోదారుస్తాడు. రాజమ్మకు కోడలన్న అసహ్యము. కనుకనే యేదియో నేరంకల్పించి పోట్లాడుతూనే యుండును. కమలకి నెలతప్పినది. ఆమె దేహారోగ్యము సరిలేనందున ఆమె తండ్రి యెన్నిసార్లో వచ్చి అడిగినాడు కూతుర్ని పంపమని. రాజమ్మ పంపలేదు. కమలకి జ్వరముకూడ వస్తోంది. జోగమ్మ చూచుటకు వచ్చినది.]

జో:—ఏమో, రాజమ్మ వదినా! నీకు మనమడు పుడుతాడు కాబోలు, చెప్పకూడదేమిటి?

రా:—అన్నీ బాగానే ఉన్నాయి. కొడుకు చేస్తున్నాడు, ఇంక మనుమడు పుట్టి వుద్ధరిస్తాడు.

జో:—కోడలు లేచుటలేదు కాబోలు.

రా:—దొంగరోగాలమ్మా! మేము పిల్లల్ని కనలేదా? పెంచలేదా? ఇదేమి సోద్యాలమ్మా! వికారాలట! డోకులట! అన్నం సహించదట! యేమోనమ్మా, మేమెన్నడు యెరుగము.

జో:—వంటపని నీదే కాబోలు. ఏమి చేశావు?

రా:—నేను చెయ్యలేనమ్మా! అదే చేస్తోంది. నాకోసం చేస్తారేమిటి? చచ్చినట్లు చేసుకొంటారు. అది కానికి పడుకుంటే ఎట్లా జరుగుతుంది?

జో:—అవునమ్మా. పొద్దుపోయినది. వెళ్లివస్తాను.

—నిష్క్రమించును

*　　*　　*　　*　　*

[కమలని పురుడుకి తండ్రి వచ్చేడు. రాజమ్మ ఎన్నిచెప్పినా వినలేదు. చివరకు తల్లిమాట అతిక్రమించి ఆనందరావు పుట్టింటికి కమలను పంపివేసినాడు. కొద్దిరోజులలో కమలకు పుత్రుడు పుట్టేడు. శుభలేఖ వచ్చింది. తెలియగానే హనుమాయమ్మ వచ్చింది.]

హ:—ఏమోమో, వదినా! మనమడుపుట్టేడటకదూ? చెప్పనేలేదు. అదృష్టవంతురాలవు అయితే భారసాలచేసుకొని వెంటనే కోడల్ని తీసుకొనివస్తారేమిటి?

రా:—ఏమోమోనమ్మా! నాకు తెలియదమ్మా! తీసుకువస్తాడో, గంగలో దింపుకుంటాడో, నాకెందుకు? నేచెప్పినట్టు చేస్తాడేమిటి?

హ:—వదినా! వెళ్లివస్తా!

—నిష్క్రమించును.

[ఆనందరావు ఉత్తరంపట్టుకొని ప్రవేశం]

ఆ:—అమ్మా! నామకరణమహోత్సవమునకు రమ్మని మామగారు ఉత్తరము వ్రాసినారు. ప్రయాణమై సిద్ధముగా ఉండు.

రా:—బాగానేఉంది. నాయనా! నీవు వెళ్లిరా, నేనుకూడ ఎందుకు, బోడిముండని.

ఆ:—అదేమిటమ్మా! అట్లా అంటావు? పెద్దదానవు నీవువుండి నామకరణము వ్రాయించి కోడలిని తీసుకొనివస్తే బాగుంటుంది.

రా:—నాపెద్దతనము మండిపోయినట్లేఉంది. అన్నిటిలోను పెద్దగానే చూపించు. ఇంకేమిలోటు? అబ్బాయీ! ఎందుకొచ్చినగోలా? దానిని తీసుకొనివస్తే నేనువుండను. అదేనా వుండాలి నేనేనా వుండాలి.

ఆ:—అమ్మా! అట్లనకూడదు. చేసుకొన్నతరువాత కష్టమో నిష్టూరమో తప్పుతుందా? అదివుంటే నేను ఉండనంటే తప్పుకదూ, మతి?

రా:—నాయనా! అవును నామాట తప్పుగానే ఉంటుంది. పెళ్లాం బెల్లం, తల్లి దెయ్యం అని నాకు తెలుసును, నాయనా! నాతల్లిమాటప్రకారం నడవమని చెప్పలేకపోయావు? పైగా దానికి ఎదురువూతము ఇస్తున్నావు. ఇంకేమి కావాలి? నాయనా! ఇతకేపెద్దముండని బ్రతికిఉండడము తప్పు.

ఆ:—అమ్మా! అవిఅన్నిఇప్పుడు ఎందుకు? నీవువస్తావా, రావా?

రా:—నేను రాను.

ఆ:—నేనువెళ్లి తీసుకొనివస్తాను.

—నిష్క్రమించును.

## 3

[రాజమ్మ, కమల ప్రవేశం]

రా:—కమలా! ఏమిచేస్తున్నావు?

క:—కాఫీచేస్తున్నాను. వస్తున్నా.

రా:—నీ కాఫీ తగలపెట్టా. ఎప్పుడుపోతుందోకాని. చెవులో చెట్లుమొలిచేయా యేమిటి? పిల్లాడు ఏడుస్తున్నాడు. వినిపించడం లేదూ?

క:—ఇప్పుడే పాలుపట్టి పడుకోపెట్టేను. మీఅబ్బాయి తొందరగా కాఫీకావలంటే వెళ్లేను.

రా:—అబ్బాయిదిపేరు, నీదినోరు. నేనెరుగుదును నీటక్కులు. నీవు పిల్లవానికి పాలు ఇయ్యవు. ఇస్తావుంటే సించాలకొద్ది పూడతాయి. అంతాపోకలు. బలంపోతుందని పాలుఇయ్యవు. మా కాలంలో పోతపాలు లేవు.

క:—పాలుచాలకపోతే పోతపాలుపోయక ఏమిచేస్తారు?

రా:—అవునే, తెచ్చేమొగుడు ఉన్నాడుకదూ, నీకేం గ్లాసుడుపాలు కలుపుతావు. వద్దంటే కడుపు నిండావద్దా అంటావు. అయినా నాకెందుకు, యీవేళవుండి రేపు చచ్చేదానికి.

[ఆనందరావు ప్రవేశం]

ఆ:—అమ్మా! ఎవరో వాకిటిలోనికి వచ్చారు. కాసేపు వూరుకో.

రా:—వూరుకోక ఏమిచేస్తాను. కాస్తనూకలెయ్యవు. లోకులకైనా వెరవాలి. ఆ వరస కోడై కూస్తుంటే, అమ్మా! వూరుకో అంటావా; సిగ్గుబిడియంలేక? ఎవరోవస్తే నాకేమిభయం? నామీద సామంతము చేస్తావా? పెళ్లాముకి దాసుడవై పోయావు. ఏమందోపెట్టింది. లేకపోతే ఇంతహద్దుమీరవు. మాయిపెళ్లాము వచ్చింది. చక్కనిచుక్కంటిపిల్లని విడిచి ఈ దరిద్రప్పిల్లని చేసుకొన్నావు...... ఇటువంటివాళ్లకి. అణిచే అత్త, మణిచే మామ, వద్దించే మొగుడు వుండాలి. అప్పుడు లొంగుతారు. నన్నేడిపించుకొని తింటున్నారు. నేనేడుస్తున్నాను. మొద్దులాగ ఎన్నిఅన్నా సమాధానంచెప్పదు.

ఆ:—కమలా! నీవు అవతలకు వెళ్లు.

క:—(వెళ్లును.)

రా:—పేరుపెట్టిపిలుస్తేకాని పెళ్లామని అందరికి తెలియదుకాబోలు. అంతానవ్వుతారని సిగ్గేనాలేదు. మొండిబ్రతుకు. తీసుకురావద్దంటే వెళ్లి తీసుకొచ్చావు. నన్ను ఏడిపిస్తోంది.

—ఆనందరావు నిష్క్రమించును.

౪

[ఆనందరావు మోహనుని యెత్తుకొని 'పిల్లాడు ఏడుస్తున్నాడు. తీసుకో' అని కమలకిచ్చును. కమల తీసుకొనును. ఇంటిలోఉన్న రాజమ్మ వచ్చును.]

రా:—ఇదేమిపోద్యాలమ్మా! కాస్త పిల్లవాడిని కిక్కురుమననీయవు. పిల్లలుఏడిస్తే ఎంతోబలం, మీకు జరుగుతోందిగాని, మాకాలంలో సమస్తం గదిలోపెట్టుకొని మంచంవేసుకొనేవాళ్లం. పురిటినీళ్లు పోసుకో గానే సమస్తపనులు చేసుకొనేవాళ్లం. ఈరాణివాసాలు, ఈపోకలు మాకు వుండేవికావు. అంటేకోపంవస్తుంది కాని అంతచిన్నబొట్టుపెట్టుకొన్నావు యేమిటి? చక్కగా బేడకాసంత బొట్టుపెట్టుకోవాలి. బిడ్డతల్లివికూడా అయావు. ఇంక వెఱ్ఱిపోకలుకట్టిపెట్టి సంసారివలెఉండు. ఒక్కటీ సంసారిచేసేపని లేదు.

ఆ:—కమలా నిన్ను మీనాన్నగారు పంపమని జాబువ్రాశారు. రేపుప్రయాణం. సిద్ధంగాఉండు.

రా:—పుట్టింటికి పంపుతావా? నాయనా! అత్తగారిబాధలు పడలేకుండాఉంది. నేను చచ్చినతరువాత తెచ్చుకొందుగాని.

ఆ:—ఎందుకమ్మా! యీమాటలు. మళ్లీ పదిరోజులలోవస్తుంది.

—నిష్క్రమించును.

౫

[ఆయాసముతో బాధపడుచూ రాజమ్మ, ఆమెకోడలు కమల కళ్లువత్తుచు ప్రవేశం]

రా:—తల్లీ! మా యింటికి నీవు మహాలక్ష్మివి. అమ్మా నేను నిన్ను పెట్టిన బాధలు నేనెట్లుమరువనమ్మా. అన్నిటికినోర్చి నన్నెదిరించియైన మాటాడలేదమ్మా! ఇంతమంచిదానవని తెలుసుకొనలేకపోతిని. నీవు లేకపోతే నాగతి ఏమగునోగదా? మాటలాడలేవమ్మా! నాకు రోయింతో సంరక్షణచేయుచున్నావు. నీశరీరము బాగా లేదు కూడాను. రాత్రినిద్రలేనందున డోకులు వెళ్లుచున్నవి. తల్లీ! ఈసారి పుట్టబిడ్డను యీనిర్భాగ్యురాలు ఎత్తుకొనుటకు నోచుకొనలేదు. ఇంకబ్రతకనమ్మా! (ఆయాసపడును.)

క:—అత్తా! మీరట్లెన్నడు తలచవద్దు. మీరునన్ను మఱే యేమిబాధలు పెట్టలేదు. నేను మీసంరక్షణ చేయుచుంటిని. మీకు జబ్బుతగ్గి నిమ్మదిగా ఉంటే అదేపదివేలు. డాక్టరు మాట్లాడవద్దన్నాడు. ఇదిగో డాక్టరుగారు మీ అబ్బాయిగారు వచ్చుచున్నారు.

[డాక్టరు, ఆనందరావు ప్రవేశం]

డా:—అమ్మా! ఎట్లున్నది?

రా:—నాయనా నిన్నటికంటె కొంచెము తగ్గినది. తెలుసుదువా? నాయనా!

డా:—అవ్వగారూ! మీకేమీ భయములేదు. తరచుమాట్లాడవద్దు. నేనుచేయుచున్న వైద్యముకంటె మీకోడలు చేయుచున్న ఉపచారమువల్ల త్వరగా నెమ్మదించగలదు. గంటకు ఒకసారి యీపొట్లము, మూడు గంటలకొకసారి యీఅరఖు పుచ్చుకొనుడు. తగ్గిపోవును. నేను వెళ్లెదను.

—నిష్క్రమించును.

౬

[రాజమ్మకు క్రమముగా ఆరోగ్యము కుదిరినది. ఆమెకు కోడలన్న అత్యంతప్రేమ కుదిరినది. కమలకు ఆడపిల్ల పుట్టినదని వినుటతోడనే ఆమె అపరిమితానందమును పొందినది. పుట్టినింటనుండి నెలలోపున కమలను బిడ్డలతో తీసికొని రావలెనని బుద్ధిపుట్టినది. వెంటనే తాను ఎన్నదినములనుండియో వంటయింటిలో పిడతలో పాతిపెట్టిన ఇరవైఆరు రూపాయిలను తీసికొనివెళ్లి మనుమరాలికిచ్చి వారిని పుట్టినింటినుండి తీసుకు వచ్చింది. ఇక యింటివద్దర రాజమ్మపని యేమన మోహనుడను మనుమనితోను రాజేశ్వరి అను మనుమరాలితోను వాళ్లఆటలుపాటలు చూడడం, ముద్దుపలుకులు వినడం, ఆనందించడం.]

## మురళీగానము

శ్రీమతి పైడిమఱ్ఱి సీతాదేవిగారు

నిర్మలాంబరకాంతుల నినుమడించు
స్వచ్ఛతేజంబు కృష్ణుని స్వేచ్ఛగొలువ
ముద్దులముంగురుల్ ముఖమునునుతింప
కమలనయనములనుండి విమలనూత్న
కాంతులువిస్తరింప అనంతుడైన
వానినోట బ్రహ్మాండంబు వరలుచుండ;
మొలనుకట్టిన రతనాలుమెఱుపులీన

పాదపద్మంబులందున్న పైడిసగలు
బాల్యక్రీడలనాతడు బారునపుడు
సారెసారెకు ఘల్లున శబ్దమీయ;
మురళిశేబూని హాయిని మ్రోయునపుడు
గోవులమంద యూవిందు గ్రోలుచుండ
గాంచి సుఖనిద్రజెందెడి గానలోల!
కరము వాయింపుమయ్య! నీమురళిమఱల.

# ప్రార్థన: మ్రొక్కుబడి

శ్రీమతి వి. సరస్వతిగారు

దైవప్రార్థనముయొక్క ఆవశ్యకతనుగూర్చి ప్రతిమతమును ప్రతిపాదించియున్నది. జీవితాంతములో దైవప్రార్థనజేయని నరుడొకడైననున్నాడా? దైవప్రసాదములగు లాభములకు మనుజుడతనికి జూపు కృతజ్ఞత ప్రార్థనారూపమున వెలసెను. కావుననే కొన్ని ప్రార్థనలయందు మనకొసగిన మేలుకై దేవునిస్తుతించుట తప్ప మరేమియులేదు. ఇవి యొక విధమైన ప్రార్థనలు. మరియొక విధమయిన ప్రార్థనలేవనగా—ఎప్పుడు మనకామేలు కొరవడుచున్నదో అప్పుడు "మాకామేలునొసగుమని" దేవునిని మనమువేడుట. ఇకవీటినుండి మరియొక విధమైన ప్రార్థనలుద్భవించినవి. అవియేవన—మనము కోరినవాటిని దేవుడు మనకొసగుటకై అతనికి మనమాన జెప్పుట. వీటినే మ్రొక్కుబడులందురు. చిన్నపిల్లలు సైతము "స్వామీ! దైవమా! నేటిరోజున మానాన్న నన్నాటకు పిలుచుకుపోయినయెడల నీకొక టెంకాయ కొట్టెదను" అని చెప్పుచు మ్రొక్కుకొందురు. ఇట్టి విషయమును మనము వినియేయున్నాము. చిన్నపిల్లలేకాదు. మనలో పెద్దవారుకూడ నిటువంటి మ్రొక్కుబడుల నెన్నియొమాఱులు దేవుని సన్నిధిని చెల్లించి మ్రొక్కుకొనుచునేయున్నారు. అందును "ఆపదమ్రొక్కులు సంపదమరుపు" లన్నట్లు ఆపత్సమయములం దెట్టి వారలను మ్రొక్కుకొనెదరు. సంపదవచ్చినప్పుడు దానినిమరచెదరు. ఇట్టి మ్రొక్కులుమ్రొక్కుకొనుటకు జనుల మూఢత్వమే కారణము. అందులోను కొందరు తాముధరించుకొనియుండు నగలనన్నిటిని ఇత్తుమనియు, కొందరు శిరోజములను సమర్పింతుమనియు, మఱికొందరు కానుకల జెల్లింతుమనియు వారివారి శక్త్యానుసారముగా మ్రొక్కుకొందురు.

మ్రొక్కులవలని లాభరాహిత్యమును కొంత పరిశీలింతము. అనేకులాపదలచేనుండు నపుడు, అట్టి యాపదను దీర్చుమని భగవంతుని వేడుచు, అట్లుతీర్చినయెడల దేవుడా! నీకు రూప్యముల నిత్తుమనియు, మరియు నింకేవేవియో యిచ్చెదమనియు చెప్పెదరు. మనము తీరనిదేహమనోవ్యాధులచే పరితపించునపుడు వాటిని తీర్చుమని దేవునివేడుట మనస్వభావమే. కాని వాటిని తీర్చుట కతనికి శక్తియున్నదోలేదో, మొదట గమనించి పిమ్మట అట్లుండినయెడల అత డీలంచములకు లోబడునా యను సంగతినిగూర్చియు చర్చింతము. మనలోపములను చక్కజేయుమని మనమతనిని ప్రార్థించుదుము. కాని యిట్టిలోపములు మనయందుండుటకు గారణమేమి? కొందరు ధనప్రాప్తికిని, కొందరు సంతానలాభమునకును, మరికొందరు వివిధవస్తుసముదాయముపొందుటకును ప్రార్థింతురు. ఇట్లొక్కొక్కరికిని ఒక్కొక్కలోపముండుటకు గారణమేమి? మనమందరము నతనికిబిడ్డలమేగదా? అట్లగునప్పు డతని కీవంచనయేల? ఒక్కొక్క విషయమునకును కార్యకారణములుండవలెనని శాస్త్రజ్ఞులు నుడువుచున్నారు. అట్లుండునపుడు మనముపొందు కష్టసుఖములకు మాత్రమేల కార్యకార

ణములుండరాదు? ఈకారణములకు కర్త ఎవ్వడు? దీనికి హిందూమత మీవిధముగా ప్రత్యుత్తరమిచ్చుచున్నది. మనమనుభవించు కష్టసుఖములన్నియు కార్యములనియు, వీటికికారణములు మనపూర్వజన్మపుకర్మలనియు వీటికికర్తలము మనమేయనియు చెప్పుచున్నది. దీనిని గూర్చి విపులముగావ్రాయుట కిచ్చట చోటులేకపోయినను ఈసమాధానము మనబుద్ధికి నమ్మదగినమాత్రమున్నదని తలచెదను. ఈదైవనిర్మితమైన చట్టముచే మన కష్టసుఖములకు మనమే బాధ్యులమగుచున్నాము. న్యాయస్థానాధిపతి దేశచట్టములనుబట్టి ఎట్లు తీర్పొసగునో, అట్లే భగవంతుడును మనపుణ్యపాపములనుబట్టిమనకు ఫలాఫలములనొసగును. అట్టితరి వీటిని దీర్పుమని అతనినివేడి స్తుతించినమాత్రమున అతడెట్లు తీర్చగలడు? తప్పుచేసిన తనయుని వానియందు తనకెంతప్రేమయుండినను వానిమేలునకై మిక్కిలిదుఃఖితయైన తల్లి వానినెట్లుశిక్షించునో, అట్లే దయాళువగు జగత్కర్త నిర్దయుడై మనయాక్రందమును పెడచెవినిపెట్టి, వారివారికర్మప్రకారము వారివారికి మంచిచెడుగులనొసగుచుండును. కావున లాభాపేక్షకై దేవుని ప్రార్థించుట నిరర్థకమని దలచెదను. చాలమంది నిద్రాహారములు వర్జించి కార్యార్థమై నోములునోచి, వ్రతములుసలిపి వాటిఫలితములుగానక విసిగి, తుదకు దైవమే లేదనుచు నిరీశ్వరవాదులగుచున్నారు. ఇది పొరబాటు.

ఫలాపేక్షకై చేయు ప్రార్థనలకు ఫలము లభించనపుడు ఇక మ్రొక్కులవలన మనము మునుపు చేసినపాపములు మాసిపోవునా? మనమిచ్చుటెంకాయలకును, డబ్బులకును, స్థానభ్రష్టత్వమునొందిన కాసుకుకాని శిరోజములకును తబ్బిబ్బుఅయి ఈచట్టమునకు వ్యతిరేకముగా దేవుడు మనకు తీర్పునొసగునా? లేక ఆతీర్పునుమార్చునా? మానవులలోకూడ లంచములకు లొంగని దైవాంశులగు మహనీయులెందరోయుండ దైవమెప్పుడైన వీటికి లోబడునా? అట్లు లోబడునని తలచుటకు మనబుద్ధిమాంద్యమే కారణము.

కాని ప్రార్థనవలన మనకొకవిధమైన లాభమున్నది. అదిఏదన మనమొక కార్యార్థమై దైవసహాయమును గోరునపుడు, దైవసహాయము మనకు లభించుచున్నదను నమ్మకచే మనకార్యదీక్ష రెట్టియగుచున్నది. ఈకార్యదీక్షవలన కొన్ని కార్యములు సఫలములగుచున్నవి. కావున ఒక్కొక్కతూరి మన ప్రార్థనలకు ఫలములు గలుగుచున్నవని మనము తలచెదము.

ఇట్లు ఫలాపేక్షకై చేయు ప్రార్థనలకు కూడ లాభములేనిఎడల ఏల మనము దైవప్రార్థనచేయవలెను? ప్రార్థనయొక్క ఆవశ్యకత నేల ప్రతిమతమును బేర్కొనియున్నగని మీరడుగవచ్చును. ప్రార్థనలనగా మనముసాధారణముగాజేయునవికావు. ప్రార్థనయను నామము కన్నను తపన్ననిన పొందికగనుండునని తలచెదను. తపస్సనగా ఒక కార్యముపై మనస్సునిలిపి దానిని పలుమారు స్మరించుచుండుట. దీనినే మనోబలమనికూడ యందురు. ఇట్టి మనోబలముచే పలుకార్యములు జరుగుచున్నవి. ఈమనోబలము చేతనే పూర్వము ఋషులు

చాల కోరికలను దీర్చుకొనిరి. ఇందును తుచ్ఛమైన బాహ్యవస్తువులకు గాక శమదమాది గుణములకై తపస్సుచేసిన మన మనోబలముచే తప్పక మన మీ గుణములను వృద్ధిచేసికొనవచ్చును. ఇందుకే ప్రార్థన ముఖ్యమని అనేకమతములు ఘోషించుచున్నవి. మన మందరమును నిరర్థకములగు ప్రార్థనలనువదలి సుగుణములకై దైవమును ప్రార్థించినఎడల వాటివలన మనము లాభమును పొందవచ్చును.

## ఉదయప్రార్థన

శ్రీమతి జాగర్లమూడి జానకమ్మగారు

హరి! హరి! శ్రీకృష్ణ! యాత్మేశ! కృష్ణ!
కరుణించి మమ్మిపుడు కావుమాకృష్ణ!
ధరలోను నీకన్న దైవంబుగలడె?
పరమాత్మ! మమ్మిపుడు పాలింపుకృష్ణ!
నెరనమ్మియున్నాము నిక్కముగనిన్ను
స్థిరముగా నీవుమా చిత్తముననిలు
బాలులము మేమయ్య! బంగారుతండ్రి!
జాలిగామన్నించి సాకుమాకృష్ణ!
లీలలందున నీదు లీలజూపించి
అలసృగుణము సంహారముచేయు
నేరుపున నినుగొల్వ నేరంగలేము
తీరుగానినుమేము స్తుతియింపలేము
ప్రాతఃకాలమందు పఠియింతుమిమ్ము
రాతిరి మమ్మెల్ల రక్షించితయ్య
నిదురించువేళను నీవుదయతోను
ఎదురుగాకాపుండి ఎనుకజేసితివి
మేల్కొనినీవుండి మేలుగామమ్ము
సుఖనిద్రజెందగా జోకొట్టితయ్య!
నీకృప కొనియాడ నేర్తుమేతండ్రి?
నీమహిమలెన్నంగ నేమెఱుంగుదుము?
నెనరుతో నీకేమి యివ్వంగగలము?
చనువుసదండంబు చక్కగానిచ్చి
వేడుకొందుముమేము వేగమేవచ్చి
తోడునీడై నిల్చి సుఖములగూర్చి
విద్యయుబుద్ధియు వినువకనిచ్చి
యత్యాదరంబున యరయవేకృష్ణ!
దండంబు దండంబు ధర్మస్వరూప!
దండంబుదండంబు దయజూపుకృష్ణ!

## పతియే దైవము

శ్రీమతి కంకిపాటి రుక్మిణమ్మగారు

కుసుమకోమలులకు గుజ్జుమామిడిపండు
  ప్రాణనాయకుపాదపద్మసేవ
శాతోదరుల కలుచేలిమాణిక్యంబు
  ప్రాణనాయకుపాదపద్మసేవ
కీరవాణులకు ముంగిటపెన్నిధానంబు
  ప్రాణనాయకుపాదపద్మసేవ
కుటిలకుంతలులకు గొంగుబంగారంబు
  ప్రాణనాయకుపాదపద్మసేవ
వలవ దేనోములును నోమ వనరుహాక్షు
లకు మనోహరుపదకమలంబులెపుడు
ముదముతోడ భజించిన నదియెచాలు
దలచిచూచిన నఖిలతార్థంబులోనగ.

## అల్లుని అతిశయము

శ్రీమతి సుసర్ల లక్ష్మీనరసమాంబగారు

మృష్టాన్నేష్వరుచి స్సదానువసనే దర్పాదివానాదరః
సాంత్వోక్తాకతినో క్తరోషాయదినుహృద్యాభవేపి సాసూయతా
ప్రాప్తేషూత్సవవాసరేషు చ పునర్జాయాప్రయాణోద్యమ
స్సజ్జామాతృపదాంకితో నటనః లేకింనామదుశ్చేష్టితం॥

[మంచి ఆహారపదార్థములయందు రుచిలేనట్లు నటించుట; ఎల్లప్పుడు మంచివస్త్రము లిచ్చినను గర్వముతో వాని నాదరింపకుండుట; ఎవరు పలుకరించినను చిరాకుపడుట, ఎంత స్నేహముగా నున్నను అసూయను పొందుట, పండుగరోజులు వచ్చినపుడు భార్యతో కూడ ప్రయాణమగుట మొదలుగా అల్లుడనువాడు చేయునవన్నియు పాడుపనులై యున్నవి.]

(ప్రదేశము: ఏలూరు. ప్రవేశము: రామశాస్త్రి, పిచ్చమ్మ)

పి:—ఏమండో! 8టి గంటలబండి కూడా వెళ్లినట్లున్నది. అతగాడు రాలేదు. ఎందుచేతనోగదా!

రా:—ఒకవేళ రయిలుమించి యుండవచ్చును. రయిలుమించినప్పటికీ ఇక్కడికీ బెజవాడకీ మోటారులు తిరుగుచున్నవి గదా, దానిమీద వస్తాడేమో.

పి:—ఏలాగో యీరాత్రికి వచ్చినయెడల రేపు వినాయకవ్రతము నిర్విఘ్నముగా సంతోషముతో చేసుకోవచ్చు; ఈరోజు 10 గంటలవరకూచూచి మరల అబ్బాయిని పంపుతారాయేమిటి? రేపుఉదయం మెయిలులో తీసుకుచక్కావస్తాడు.

రా:—వుండు, వుండు, యేదోబండి ఆగినట్లువున్నది. అదిగో, కోటీశ్వరరావే, ఏమే! కాళ్లుకడుగుకొనుటకు నీళ్లుపట్టుకురా.

అంతట యిరువదిసంవత్సరముల వయస్సుగలవాడు కంటికి అద్దములు, కాళ్లకుబూట్సు, చేతికివాచీగల నవనాగరికలక్షణములతో అల్లుడు ప్రవేశించి 'వోరీ! పెట్టి అతీజాగ్రత్తగా ఇంట్లో పెట్టు' అన్నాడు బండివాడితో.

రా:—అంతా క్షేమమే, గదా?

కో:—ఆ. అంతాక్షామముగానే వుంది.

ఇంతలో అత్తగారు నీళ్లు చెంబునిండా పట్టుకొని రెండవచేతితో తువ్వాలు విసవకట్టితీసుకుని గబగబలాడుతూ వచ్చింది. వచ్చి 'మీఅమ్మగారు నాయనగారు అందరూసుఖులాపగనున్నారా?' అంది.

కో:—వుస్. మావాళ్లకు మీదయవల్ల యేజబ్బులురాలేదు.

పి:—(తనలో) ఇదేమిటిల్లా అంటాడు? (ప్రకాశముగ) స్నానంచెయ్యి. ప్రొద్దుపోకుండా భోజనం చేస్తువు గాని.

కో:—నాకు ఆకలిలేదు. ఇంటివద్ద ఫలాహారములు పుచ్చుకునివస్తిని.

పి:—ఆకలిలేకపోవడం యేమిటి పదకొండుగంటలైంది. నీవు వస్తావుగదా కలిసి భోజనంచెయ్యవచ్చునని మీమామగారు కూర్చున్నారు. ఆకలివేసినంతే భోజనంచెయ్యవచ్చును. లే, స్నానంచెయ్యి.

గా:—రావోయీ, రెండు మెతుకులు కొరుకుదువుగాని.

కోటీశ్వరరావు మాట్లాడకుండా లేచి తనహాటుకేసుతీసి తువ్వాలొకటి, సబ్బుబిళ్లొకటి తీసుకొని చేరుగా నూతివద్దకువెళ్లేడు.

పి:—మీరుకూడాలెండి. వేడినీళ్లు అల్లునికి మీకుకూడా తోరిపిపెట్టుతాను.

రా:—రా, త్వరగారా, అల్లుడుగారు చన్నీళ్లుస్నానం చేస్తున్నట్టున్నారు.వద్దని చెప్పు.

పిచ్చమ్మగారు గబగబనూతిదగ్గరకువెళ్లి 'వేడినీళ్లు, సబ్బు, సీకాయ అన్నీఉండగా చన్నీళ్లుస్నానం చేస్తున్నావేమిటి?' అంది.

కో:—వేడినీళ్లువద్దు. నాకు వేడిచేస్తుంది. చన్నీళ్లే అలవాటు.

పి:—ఇదిగో వేడినీళ్లుపోసుకో.

కోటీశ్వరరావు భార్య సావిత్రమ్మ యిదిఅంతా చూసి తనభర్తగారి వెట్టుపనికి లోలోన నవ్వుకొంది. అంతట అల్లుడుగారు మామగారు విస్తరిముందు కూర్చుని భోజనములకుపక్రమించినారు. అల్లునికి ఏమీ హితవు కాలేదు.

రా:—యేమే, అల్లుడుగారు అన్నిపదార్థములు కొద్దిగ రుచిచూచుచున్నారు. నీవంట ఆయనకు సరిపో లేదేమో.

కో:—(కోపముగా) నాకుఆకలిలేదని యిదివరకే చెప్పితిని. మాయింట్లోయీరోజు మాఅమ్మ దోసెలు, పెసరట్లు, యిడ్డెన్‌లు అన్నీచేసింది. పైగానాకు అజీర్తిగావుంది.

ఇంతలో భావమరదివచ్చి 'మా భావగార్కి అజీర్తిరోగంపట్టుకుందా? లేక అల్లునిరోగం పట్టుకుందా?' అన్నాడు. ఇంతలో సావిత్రమ్మవచ్చి 'ఆయన్ని వేళాకోళంచెయ్యకండి' అంది.

రా:—యేమోయీ, విశేషాలు యేమిటి?

కో:—ఏమున్నాయి. రేపుఉదయమే మీఅమ్మాయి నేను ప్రయాణం.

పి:—ఇదేమిటి? రేపువినాయకచవితి. పూజచేసికొని రెండ్రోజులుండి తీసుకువెళ్లవచ్చును. చవితిపూట ప్రయాణమేమిటి?

రా:—అంతతొందరేమిటోయి. సరదాగా నాలుగురోజులుండి మరీ అమ్మాయిని తీసుకువెళ్లుతావను కున్నాను.

పి:—పిల్లా, నీవుచెంబుడునీళ్లుపోసుకుని కొత్తబట్టలుకట్టుకొని పూజచేసికొని నాలుగురోజులు సరదాగా వుండి మరీ వెళ్లండి. ఎన్నాళ్లనుండియో పిలవగా పిలవగా వచ్చేవు. చవితిపూట. రేపే ప్రయాణమేమిటి?

కో:—మీరుపెట్టే జరీపంచెలు, ఉప్పాడకండువాలు, బనారసుచీరెలు అన్నీకొల్లబోతున్నాయా యేమిటి? వాటికోసం నేవాశపడ్డానా? నాకేవున్నాయి కావలసినన్ని పట్టుబట్టలు.

పి:—కోపగించకు, నాయనా! నాకు ఒక్కఆడపిల్ల. దానికి ఇంతపసుపు, కుంకుమ, చలిమిడి, చీరపెట్ట కుండా ఎట్లాపంపను? పెద్దచీరెలు పెట్టగల సామర్థ్యములేకపోయినా యేదో శక్త్యానుసారము పెడతాము. చవితిపూట పంపడమంటే మాకేమి బాగుండలేదు. పోనీ రెండ్రోజులుండి తీసుకువెళ్లుతే బాగానేవుంటుంది.

కో:—మీఅమ్మాయికిపెడితే మీశక్త్యానుసారమే అమృతగగుడ్డలు పెట్టుకోండి. నాకుఅక్కరలేదు.

రా:—నీవుయేవికావాలంటే అవ్వే పెడతానోయి. నీవుఖద్దరువద్దంటే కొనవకొనను.

తిమ్మరాజు:—(ప్రవేశించి) భావగారూ! మీకోరకు రెవ్వరోవచ్చేరు. మాట్లాడాలట కూర్చొన్నాను.

కో:—నాకోసం రెవ్వరువచ్చేరు? నేను రెవ్వరితోనూ మాట్లాడను. నాతో పనివుంటే మాగ్రామం వచ్చి మాట్లాడమని చెప్పండి. వీలులేదు వెళ్లిపొమ్మనండి.

అల్లుడుగారిభోజనం మామగారిభోజనం అయింది. సావిత్రమ్మ తాంబూలపట్టుకుని వచ్చింది. కోటీశ్వరరావు నెమ్మదిగా తాంబూలంవేసుకుంటూ భార్యతో 'ప్రయాణమై సిద్ధంగావుండు. రేపే ప్రయాణం' అన్నాడు.

రా:—ఇదేమిటోయీ, వేళాకోళమనుకు అన్నావనుకుంటున్నాను. నిజమేనాయేమిటి? రేపు ఒక్క-రోజు ఆగండి. ఎల్లుండి తెల్లవారకుండానే వెళ్లుదువుగాని. ఎల్లుండివుండమననులే.

కో:—ఇంక నాకు చెప్పకండి. దానియిష్టం. అదివస్తేవస్తుంది. లేకపోతేలేదు. నాప్రయాణం తప్పదు.

సావిత్రమ్మ మాట్లాడకుండా తల్లి దగ్గరకు వెళ్లింది. తానుకూడా రేపే ప్రయాణమని చెప్పింది. ఆమె కన్నుల నీరుబెట్టుకొనుచు వచ్చి "అబ్బాయీ! నామాట కొంచెంవిను. మళ్లారెన్నాళ్లకో. ఎన్నిసార్లుపిలచినా రావేరావు. వచ్చినప్పుడైనా నాలుగురోజు లుండకపోతే మాకేమిసంతోషంగా వుంటుంది? కాదూ కూడదూ అంటే యెల్లుండి తీసుక్కువెళ్లు. చవితిపూట రేపే ప్రయాణంబాగాలేదు. రేపు అబ్బాయితోకూడా పూజచేసుకోవాలి. తప్పదు. మరోమాటచెప్పక" అంది.

కో:—ఇదేమిసంత? నాకు బలవంతపుబ్రాహ్మణార్థమాయేమిటి? నేనువుండను. దాన్నికూడా పంపండి. లేకపోతే దానికీ, నాకూ నేటితోసరి.

సావిత్రి:—సరే! బాగానేవుంది. నామీద కోపమెందుకు? వాళ్లుపంపనన్నారా? నేను రానన్నానా? నాకు అడ్డమేముంది? సిద్ధంగావున్నాను.

తిమ్మరాజు:—భావగారూ! నాతోపూజచేసుకోరూ?

కో:—పూజాలేదు, గీజాలేదు. ఇవన్నీనాకు సరిపోవు. తెల్లవారకుండా రమ్మని బండి వానితో చెప్పిరా?

తిమ్మ:—తెల్లవారనీయండి. రాత్రిమాత్రం సుఖంగా నిద్రపోండి. మీతోకూడా పూజచేసుకోవాలని సరదాగావుంది. పోనీ పూజకాగానే బండికుదురుస్తాను. ఎల్లుండి తెల్లారకుండా మీరు వెళ్లేటట్టు రైలుకు పంపిస్తాను.

కో:—నాతో మాట్లాడకూ. నాకు ఒళ్లుమండుతుంది. నేనే కుదుర్చుకుంటాను బండి.

ఆరాత్రి అనవసరంగా కోపగించి అల్లుడు అన్నంతినలేదు. ఆయనతినలేదని భార్యతినలేదు. పిల్లతినలేదని తల్లి తినలేదు. కోటీశ్వరరావు తెల్లవారకుండాలేచి భార్యనులేపేడు. బండిని తానే వెళ్లి తీసుక్కువచ్చేడు. బండి యెక్కమన్నాడు. ఎక్కనంటుందాయేమిటి? రామశాస్త్రి, పిచ్చమ్మ బ్రతిమాలుతూనేవున్నారు. 'చవితి యేమిటి? సింగినాదం' అని బండెక్కేడు. బండికదిలింది.

## పొలి పాట

(సంపాదకురాలు) శ్రీమతి ఇందుర్తి శకుంతలగారు

పొలి పొలిగలుగ
విఘ్నేశ్వరుండా! కుప్పతీపిళ్లు
పలకపాతళ్లు పోలుగాడెలు
తిరుమలకొండ ఘాటిగాలీరవలె
వేములకొండఘాటి హెచ్చువలె
పొలి పొలిగలుగ...

తూర్పునబోరన్న బల్లతేరన్న
పరమటాబోరన్న తూముతేరన్న.
చెడిపుల్లబడిపుల్ల బండిగావిస్తి
నల్లెద్దుపుల్లెద్దు బండికట్టిస్తి.
వేసిరేబీగాలు తీజెమిరేబంట్లు
గోవిందరాజులకు వొడ్లయ్యావొడ్లు.

# సతీపతులు

శ్రీమతి వా కా సరస్వతిగారు

సతీపతులిద్దరు పరస్పరానురాగముగలవారై ఒకరియెడ నొకరు ద్రోహముసలుపక వర్తించుటయే వారి ముఖ్యధర్మము. నియమములేక కామనివారణమునకై తమ యిచ్చవచ్చినరీతిగా సంచరింపక వివాహబంధముచే కట్టువడి సతీపతులిరువురు తమయావజ్జీవము ధర్మార్థకామములందు ఒకరినొకరు మీరి సంచరించకుండుటయే మానవధర్మము. అదియే వివాహధర్మము. భార్యాభర్తలెప్పుడును పరస్పరానురాగముగలవారై యుండవలయునుగాని నీతిమాలినవృత్తికి లోబడరాదు. లోబడుట కేవలము మానవధర్మమునకు విరుద్ధమని యెల్లరకు దెలియును. దంపతులిరువురలో ఎవరెట్టిచెడువృత్తులలో ప్రవేశించినను రెండవవారికి నష్టము, కష్టము, అవమానము కలుగును.

సతీపతులిరువురు మనసుగలసి యన్యోన్యప్రేమానురాగములో మెలగిరేని వారి దాంపత్యసంపద చెప్పనలవిగాదు. వారిదాంపత్యము బంగారమునకు పరిమళమబ్బినట్లుండును. వారిగృహము స్వర్గతుల్యము. వారి కిట్టియనురాగములేనిచో వారిల్లొకయరణ్యముగానుండును. కాన భర్తయెప్పుడును యవినీతివంతుడుగానుండరాదు. తానెప్పుడును వివాహధర్మములకు దూరముగా నడువరాదు. తానెప్పుడును మార్గదర్శకుడుగానుండి నీతిమార్గమున సంచరించెనేని భార్యగూడ భర్తనుజూచి మంచియలవాటుల నేర్చుకొనును. ఈవిధముగా తాను మంచి నాచరింపుచు తనసతీమణియొక్క జ్ఞాన మభివృద్ధిచేయవలెను. లేనిపోనినిందల మోపి నిష్కారణముగా తరుచు భార్యతో పోరాడరాదు.

కులకాంతతోడ నెప్పుడు
కలహింపకు వట్టితప్పు ఘటియింపకుమీ
కలకంఠి కంటికన్నీ
రొలికిన సిరియింటనుండ నొల్లదు సుమతీ.

అన్నారు. కాన దంపతులిద్దరేకమత్యముగానుండుట కుటుంబసౌఖ్యమునకు ప్రథమసోపానము. సతీపతులిరువురు కుసుమము సౌరభమువలెను, రాగము శ్రుతివోలెను ఉన్న వారిదాంపత్యలక్ష్మికి అంతుండదు.

ఇకను సతి పతియెడ మెలగవలసినవిధము కొంతచూతము. సతి ప్రతివిషయములోను పతికి సహాయభూతురాలై యుండి యవసరమగువేళ మంచిసలహాలు చెప్పుచుండవలయును. సతియెప్పుడును భర్తయెడ ప్రేమానురాగముగలదై యుండవలయును. కాని కామానురాగముగలదై యుండరాదు. కామము కేవలముస్వార్థకాంక్షి. వాంఛాపరితృప్తి నొందినవెంటనే కామము చరితార్థముజెందును. కాని ప్రేమ అట్లుగాదు. ప్రేమ స్వసుఖనిరభిలాషి, పరార్థకాంక్షి. ఇది యెప్పుడును తనప్రియునిసుఖింపజేసి తాను సుఖింపజూచును.








# ఆశీర్వచనము

శ్రీమతి చర్ల నగరాజకుమారిగారు

పాయాచ్ఛ్రీపార్వతీసూను
ర్జాహ్నావ్యాంకవిభూషణః
భూలోకసంపూజితాంతాం
గృహలక్ష్మీమిమాంసదా.






ప్రేమయందిట్టిలక్షణముండుటచేతనే సతి పతియందలి గుణదోషములను దిలకింపదు. గుణములనుజూచి ప్రేమించువారు దోషములనుగాంచి ద్వేషింతురు. ప్రేమయన స్థిరస్థాయికమైన ప్రేమయే ప్రేమ. తామరాకుమీాద నీటిపంటిది ప్రేమగాదు. అదిమోహము. అది చంచలమైనది. దానికి స్థిరత్వములేదు. మోహము ప్రేమవలె ఉన్నతదశ నొందజాలదు. రూపము, సంపద స్థిరమైనవిగావు. కాన రూపము, సంపద వీనికే ప్రేమింపరాదు. రూపము, సంపద వీనియందొకరినొకరు మించియుండవచ్చును. కావున మోహమునకు కడలేదు.

ప్రేమకు సహజధర్మము స్థాయిభావము. అది యేకనిష్ఠము, నిశ్చలము. కావున గుణములనుజూచి ప్రేమింపరాదు. దోషములనుజూచి వర్జింపరాదు. అందుచేతనే సతిప్రేమ యత్యంతానురాగపూరితము; సుస్థిరము. కామాంధుల యనురాగము కాలానుగుణముగా మారుచుండును. కావున సతిప్రేమ నిశ్చలముగాను, స్థిరముగాను, ఏకనిష్టముగాను, కాంక్షారహితముగానుఉండవలయును. సతిప్రేమ యెప్పుడును వ్యవసాయమురీతిగనుండరాదు. వ్యవసాయము ప్రతిఫలముగోరును. సతిప్రేమ యట్లు మారు గోరరాదు. "నీవునన్ను ప్రేమించితివేని నేను నిన్ను ప్రేమింతు ననురీతిగనుండరాదు. అట్లయ్యేనేని సతిప్రేమ నిసర్గప్రేమకానేరదు. సతిప్రేమ యెప్పుడును తల్లికి సంతానముపై నుండుప్రేమగానుండవలయును.

వివాహమైనప్పటినుండియు సతి పతినిప్రేమించుచు, పతియే తనకు దైవమనియు, సర్వస్వమనియు దలంచుచు త్రికరణశుద్ధిగా నాతనిని ఆరాధింపవలయును. సతియొక్క ధర్మము తాను ఎవ్వనిపెండ్లియాడునో వానినే సర్వదాప్రేమించుట. సతికి జీవితసర్వస్వము పతియే. సతియట్లుతలంచెనేని పతి అమెనుతప్పకప్రేమించితీరును. సతీపతులిర్వురు యన్యోన్యప్రేమానురాగముతోమెలగుదురేని ఇకను వారిపొందిక పొగడతరముగానిదగును. సతీపతుల ప్రేమలు రెండునుగూడెనేని మణికాంచనసంయోగమట్లు ప్రకాశించును.

## ఓర్పు

శ్రీమతి గి. కు. గు. సత్యవతిగారు

సర్వకార్యముల్ సాధింపజాలుట కిల
నోర్పునకుమించినది మరియొకటిలేదు
యెంతశక్తి గలిగియున్ననేమి తాల్మి
లేనివారు బలంబునులేనివారె.
ఒక్కపనినెరవేర్పగా నూహయున్న
యపుడుదానికై గల్గెడియలజడులకు
విసుగుకొనకుండ యోర్పుతోమసలియున్న
నెట్టికష్టపుబనినైన నెట్టవచ్చు.

కలిమిగల్గినయంతనే గర్వపడుట
కూడ దెప్పుడు నొకవేళ గొదువయైన
దానికై మదిజింతను బూనరాదు
కల్మిలేముల సమబుద్ధిగాంచవలయు.
ఓర్పుడెందమునకుధైర్య మొదవజేయు
ధైర్యమున సవివేకంబుదలగిమంచి
యోచనాశక్తితో సమయోచితముగ
మెలగగల్గినయిక్కట్ల దొలగగల్గు.

# విద్యావతియగు స్త్రీ

శ్రీమతి జొన్నలగడ్డ శారదాంబగారు

తపముచేసేమి, దానముచేసేమి, సేవచేసేమి జగదీశునందఁజూచుట మానవుని పూత యుద్దేశమె సఖీల. సృష్టియందు మానవుని దనలోఁబడయఁజాలుట పరమాత్ముని ప్రధానాశయమని తత్త్వజ్ఞానసుధనుగ్రోలినతజ్ఞులు వాక్రుచ్చుచుందురు. భావగర్భితమును బవిత్రవంతమును సద్భుతమున్ననగు నీమానవసృష్టికి స్త్రీపురుషులు తలిదండ్రులు. వహ్నికిఁదేజము తెఱఁగున, పూవునకుఁ దావిలీల, జందురునకుఁ గాంతికరణి పురుషునకుఁ బురంధ్రియట్టిది. ఈద్వైతము భేదింపరానిది!

పృథ్వీరంగమున వివిధపాత్రలు ధరించి చిత్రగతుల నటించునరునకు ప్రధానసంగిని పత్ని. నిజాశయచరితార్థమునకై మగఁడొనరించు చెయువులకు మగనాలు యుండు టనివార్యము. పత్నిలేని పురుషుఁడు పరిమళములేని ప్రసవమట్లు కొఱగానివాఁడై యుండును. పతిలేని పడంతి హిమాంశుఁగాంచని యామినియట్లు గాఢతమసమున నడఁగియుండును.

సంతతసంతోషసంభరితసన్నిహితసంబంధమున సంసారమునవరలు సతీపతులహృదయములు సమభావగ్రంథిచేఁ గలిసియుండును. భావములందు వ్యత్యాసమున్న మఁడి విడివడి ముప్పునదెగిపడును. స్త్రీహృద్వీణాతంత్రులను పురుషునిభావములు సదా మీటుచుండును. అత్తఱి అంతశ్శ్రుతమగు అనురాగగీతము ఆలిమగల యంతరంగములం దానందసుధను వెదఁజల్లును. ఈగీతవాద్యమునకువలయు వీణె మధురరవమునుపుట్టించు తీవలుగలదియై యుండవలెను. చిత్రమగు నీ స్త్రీహృద్వీణకు మధురరవమొసఁగునది విద్యయేకదా! విద్యారహిత వధూటిని జేపట్టినవ్యక్తి తీవలేని వీణను, శుష్కమైన కాష్ఠమును జేపట్టుటగాదా!

దాంపత్యజీవనమున సమోన్నతభావములు చిగిరించుటకై సతీపతుల చిత్తములు రెండును విద్యాసలిలముచే నార్ద్రములై యుండవలెను. విజ్ఞానధనమును, ధైర్యసాహసములను, శరీరమనోదార్ఢ్యములను అలవఱచికొనుటకు పురుషుడెట్లు పాటుపటుచుండునో స్త్రీ కూడ నట్లే పాటుపడవలెను. ఇట్లని మనపూర్వులు గుర్తించిరి. రోమాశ, లోపాముద్ర, అదితి, విశ్వవర, శాస్వతి, గార్గి, మైత్రేయి, శకుంతల, సీత, ద్రౌపది, అనసూయ, ఘోష, అపలలాది సీమంతినీచూడామణులు తత్త్వశాస్త్రనీతిశాస్త్రములందును; నాచి, మధురవాణి, రామభద్రమ్మ, మొల్ల, వెంకమ్మ, ముద్దుపళని ప్రభృతులు సంస్కృతాంధ్రసారస్వతములందును; రజియా, అహల్యాబాయి, ఎలిజబెత్, విక్టోరియాలబోలు ఉవిదలు పరిపాలనమందును; సత్యభామ, శరమా, సంయుక్త, సత్యవతి, మహామాయ, హీరాప్రభ, లక్ష్మీబాయిమొదలగు కాంతామతల్లులు రణవిద్యయందును నాఱితేఱినవారని పురాణములును, ఇతిహాసములును దెలుపుచున్నవి. పుణ్యభూమియగు రాజస్థానమున పల్వురు వీరమాతలుద్భవించి దేశస్వాతంత్ర్యమును గాంక్షించి జాతిగౌరవము నపేక్షించి ఉసుఱుల

కంటె మానధర్మము మిన్నయంచునెంచి పావనగుణసంశోభితలై, పవిత్రాదర్శపూర్ణాత్మలై మొక్కవోనివిక్రమమున రణరంగమునబోరి నిజాసువులను గోలుపడిరి! పంక్రస్టు సతి (Mrs. Pankrust), జోన్ ఆఫ్ ఆర్కులవంటి వనితలు ఆధునికయుగమున భారతభూమియం దుద్భవించుచుండిరి. కస్తూరి, సరోజిని, సవంతి, కమల, జ్యోతిర్మయి, విమలప్రభ, మోహిని, ఇందుమతి, ఊర్మిళ, రుక్మిణీదేవులు మున్నగువీరాంగనలు నేటిభారతస్వాతంత్ర్య సమరమున శాంతాసినిజేబూని, ముందంజవైచి ఇపుడు కారాగారసాంద్రసంతమసము నుండి తమప్రతిభాద్యుతులను దిగంతములందు వెదజల్లుచున్నారు.

ఊఁయెలనూఁచినచేయి ఉర్వి నుఱ్ఱూఁతలూఁగించునను సామెతకలదుకదా! విదుషి యైనతల్లికి విద్వాంసుఁడు పుట్టును. వీరాంగనయే వీరవతంసునకు జనయిత్రిగాఁగలదు. శివాజి, నెపోలియన్, గాంధులతల్లుల పూతచారిత్రములును, వైదుష్యమును, అసమాన సాహసమును తనయులందుఁ బ్రతిఫలించినవి.

విద్యగలయెడ విజ్ఞానకరుణాప్రణయములు విరాజిల్లును. శాంతిసుఖములు తనరారును. కావున సోదరీమణులెల్లరు యవనికాంతరాళములం దడఁగియుండక, అవిద్యాకూపమునఁబడియుండక శక్తివంచనలేక విద్యాభివృద్ధికై పాటుపడుచు భారతభావికళ్యాణమునకై నిరంతరకృషిసలిపి సఫలీకృతమనోరథలై విశ్వవిశ్రాంతప్రతిభ నందుదురుగాక!

## మురళీవాలా

శ్రీమతి మండపాక సూర్యకాంతమ్మ గారు

శిఖను శిఖిపింఛముధరించి చెలఁగువాఁడు
నొసటఁగస్తురిబొట్టుచే నెసఁగువాఁడు
కౌస్తుభంబెదధరియించి గ్రాలువాఁడు
మురళివాయించు మోహనమూర్తికాఁడె.

బండిరాకాసిదన్నిన బాలమూర్తి
భవలతలఁద్రెంచి రక్షించుభద్రమూర్తి
భక్తవరులనుబ్రోచెడి భవ్యమూర్తి
మురళివాయించు మోహనమూర్తికాఁడె.

గోపబాలలగూడెడి కోడెకాఁడు
వెన్నముద్దలదొంగిలు వన్నెకాఁడు
ఉపవనంబులఁదిరిగెడి హొన్నుకాఁడు
మురళివాయించు మోహనమూర్తికాఁడె.

కోకిలమ్ములు కుహూకుహూగూయువేళ
కీరములుశారికలు మింటగేరువేళ
వేణుగానవిలోలుడై వెలయువాఁడు
మురళివాయించు మోహనమూర్తికాఁడె.

రాత్రులందున చంద్రికారాజియందు
జహ్నువీతీరనికటకుంజంబులందు
గంధవాహుని గంధముల్గొనెడివాఁడు
మురళివాయించు మోహనమూర్తికాఁడె.

తెమ్మతెమ్మెరలిలఁ బరతెంచువేళ
మధుకరంబులు మకరందమానువేళ
మాధవులచెంతనుండెడి మాధవుండు
మురళివాయించు మోహనమూర్తికాఁడె.

# బృందావనమున మీరాబాయి

శ్రీమతి పి. సీతాబాయిగారు

ఈబృందావనసీమయందెకడ శ్రీకృష్ణుండునై దోడుతో
నాబృందారకులెల్ల రుల్లములనత్యాశ్చర్యమున్ బొందఁగా
గోబృందంబుల మేపి గోపకులతో గోపాలవేషంబునం
దాబాల్యంబున సంచరించెనిపు డే ధన్యాత్మనై తింగఁదుగ్.

యమునతోయమున దానములాడి పూజించునబ్జాక్షుసారూప్యమందినట్లు
కార్కొన్ననీలమేఘచ్ఛాయఁగని మెచ్చు నచ్యుతసామీప్యమందినట్లు
లలితతమాలసాలమునీడ విహరించు నక్షరు సాలోక్యమందినట్లు
చారుదుర్వాంకురశయ్యపై బవళించు హరిదివ్యసాయుజ్యమందినట్లు

హాయిగాగానమొనరించు హరికథాసు
ధారసంబును గడుపారనారగించు
దనివితీరక నృత్యగీతములు మెఱయ
మాటిమాటికి శ్రీహరిస్మరణసేయు.

ఒకనాఁడు గోవర్ధనోర్వీధరముగాంచి గోపాలబాలుని కూర్మివొగడు
ఒకనాడు నల కాళియునిమడుంగున కేగి హరికృపారసమునకబ్రమందు
నొకనాడుపున్నాగకికురంబ వీక్షించి శ్రీకృష్ణచర్యల చిత్రమెన్ను
నొకనాఁడుఘోషభూమికినేగి నందనందను విలాసములకానందమందు

కలితపద్మాంకురాది రేఖావిశేష
రమ్యకృష్ణపదాబ్జధరాపరాగ
పావనంబై నయట్టి బృందావనమున
జీవనమొనర్చి శ్రీహరిసేవనమున.

అక్కైలాసనివాసమొల్లక విలాసార్థంబువిచ్చేసెనో
యక్కాత్యాయని యంచునందఱుఁ బ్రమోదాశ్చర్యముల్ వొందఁగా
నక్కాంతామణి కన్నువిచ్చి హరి! కృష్ణా! వాసుదేవా! ననుం
జక్కంజూడుమునేడటంచును నమస్కారంబు గావించినన్.

కనుఁగొని వినయాన్వితుడై
వనితామణిత్రోవనలసివచ్చితివటుగా
పున శ్రమమువాయక్షీరము
లనుకంపంజేకొనంగనగునని వేడెన్.

భవబంధమునఁజిక్కుపడఁడెన్నటికిని,
శివకరంబగు విష్ణుచింతనామృతము
పానంబుజేసి తత్పరవశత్వమున
నానందమునుబొందు నదిపీడఁడవల
విష్ణుస్వరూప మీవిశ్వమంతయును
విష్ణునికన్నను వేఱొండులేదు
విను జననస్థానవిలయంబులతని
ఘనతత్త్రిగుణప్రకారంబులగుట
నీవెఱుంగుదుగాదె, నీముఖంబునను
భావించియొఱఁగింపఁ బడ్డది యేక
దేశంబనుచు మది తెలియుమునీవు
శ్రీశాంతుఁడనని చింతింపుమీవు,
మురువుగాసంశయంబులవీడుమీవు,
పురుషోత్తమునికీర్తి పొగడుమునీవు,
సారజ్ఞతను నీవు చదివినచదువు
నారూఢతపము ధన్యంబులై వెలుఁగు.

—నారదుని పూర్వజన్మవృత్తాంతము—

సదమలాత్మక! పూర్వజన్మమందేను
జెదరక విప్రదాసికిఁబుట్టి వారి
సదనమందుండిన సమయమందటకు
సదయాత్ములగు యోగిజనములువచ్చి
నిలచి చాతుర్మాస్యనియమంబునచట
సలుపుచునుండఁగా సద్భక్తితోడ
వారికండదై దేండ్లవాఁడనై యుండి
కోరిబాలురతోడఁ గూడియాటలకుఁ
బోనుసహింప కాపుణ్యపూరుషుల
నేనాశ్రయింప మన్నించియాఘనులు
నియమించుఁబనుల నన్నియుసమ్మతించి
భయభక్తులెసఁగఁ దప్పక జేసి వారి
యెంగిలిభక్షింతు, నెండవానలను
సంగతిగా నొక్కసమముగానెంతు,
ముంగలనేనిల్చి మ్రొక్కుచునెప్పుడు
వెంగలిరీతి వివేకినై నడతు
నలవృష్టికాలంబు నాశరత్కాల
మలరసేవింప నాయందునమ్మునులు
కరుణాకటాక్షవీక్షణ మొప్పనుంచి
యరమరలేక తామాచరింపుచును
వారు శ్రీకృష్ణునివరచరిత్రంబు
లారూఢిగాఁబాడ నాసుధారసము
వీనులచేఁగ్రోలి విష్ణునామములు
గానంబుజేయ నుత్కంఠనొందితిని.
శ్రీవిష్ణుపదసేవసేయుసంకల్ప
మావేళపొడమె నాయంతరంగమున;
నీవిధంబునను నేనీశ్వరపాద
సేవకారంభంబు జేసినకతన
సరగుననీప్రపంచవికారములకుఁ
బరుఁడనై బ్రహ్మరూపకుఁడనై యున్న
నాయందుసూక్ష్మనిర్ణయముగావెలుఁగు
కాయంబు నీస్థూలకాయంబు నాత్మ
మాయచేఁగల్గిన మర్మంబుగంటి
నాయోగిజనుల మహాకటాక్షమున;
తామసరాజసద్వయమునడంచి
తామించిహరిభక్తి దక్కెనామదికి;
అంతఁజాతుర్మాస్యమరుగనాభిక్షు
లంతఃకరణవృత్తి నన్నెంచిపిలిచి
వెలయ నీశ్వరతత్త్వవిజ్ఞానసరణిఁ
దెలియ నాకపు డుపదేశించిచనిరి.
ఆయుపదేశమాహాత్మ్యంబుచేత

నాయీశ్వరునితత్త్వమాత్మఁగాంచితిని.
హరికిసమర్పించినట్టి కర్మంబు
పరమహాపథంబై ప్రపంచంబునందు
మూఢుల నేవేళముంచికొన్నట్టి
రూఢితాపత్రయరోగంబునణఁచు;
నేద్రవ్యమున బల్మినేరోగమొదవు
నాద్రవ్యమారోగ మణఁగింపలేదు,
అనఘ! ద్రవ్యాంతరమగు భేషజంబు
మొనసిన తద్రోగమును మాన్పనోపు
సీరీతికర్మాళిహెచ్చి సంసార
కారణమైయున్నగాని విష్ణునకు
అమరసమర్పించినట్టి కర్మములు
తముదాముచెఱచికో తగియుండుగాన
నలహరియందుఁ జేయంబడుకర్మ
ములుజ్ఞానకారణమ్ములునగు విష్ణు
సంతోషమతిభక్తిసరణిబుట్టించు
సంతతం బాపరేశ్వరుశిక్షచేత
నీశ్వరార్పణకర్మములఁజేయువారు
శాశ్వతభక్తి కృష్ణస్వామినామ
గుణవర్ణనంబులు కోరిచేయుదురు
ప్రణవపూర్వకముగాఁ బరవాసుదేవ
నామంబుమొదలైన నాల్గునామముల
నేమరకవచించి యెలమితో మ్రొక్కి
మంత్రమూర్తియునయ్యు మహిమదీపింప
మంత్రశూన్యుండునై మహివెల్గుచున్న
వరయజ్ఞపురుషుని వరుసపూజించి
మఱిపూరుషుండు సమ్యగ్దర్శనుండు
నగును; నేనారీతి నాచరింపగను
జగదీశ్వరుండు నిశ్చయముగా నాకు
సరగున తనమీఁదినద్భక్తినొసఁగె,
హరి తదనుష్ఠానమంతయు నెఱుఁగు

నదినీవుసల్పు మహాత్మ! మాధవుని
సదమలకీర్తుల చక్కఁగాఁబొగడు'
మని తనజన్మకర్మాదులు దెలుప
మునుకొనుచునువ్యాసముని యిట్టులనియె:
'అనఘ! నీకాభిక్షు లమలవిజ్ఞాన
మొనరంగ నుపదేశమిచ్చువారవలఁ
జనినపిమ్మట బాల్యసమయంబునందు
ఘనవృద్ధభావ మేకరణిఘటించె?
వారుచెప్పినవి భావమునందునీకు
సారంబులై యెట్లు సత్తుగానిలచె?
నెటుసంచరించితి వీభూతలమునఁ?
బటుగతి పూర్వకల్పమునందునసుచు
సను లెప్పుడెటుల తప్పకనీకుఁదెలిసె?
తనువప్పుడెన్నాళ్లు ధరణిపై నిలచె?
దానీసుతత్వమెంతట ముక్తమయ్యె?
శ్రీసంయమిశ్రేష్ఠ! చెప్పవే?' యనిన
నారదుండిటులనె: "నాడునాభిక్షు
లారూఢవిజ్ఞాన మమరబోధించి
పోయినవెనక నాభూసురునింట
మాయమ్మపనుల నేమరకసల్పుచును
దనపరాధీనతఁ దలఁచకెల్లపుడు
ననులాలనముచేయు నానావిధములఁ
గానతల్లిని వీడగారాదటంచు
నేనుమోహినిగాక నిరతంబునెఱుక
మోసపోవక తల్లి ముందరకొన్ని
వాసరంబులు నిలచివర్తించుతఱిని
మాతల్లియొకనాఁడు మాపటివేళ
ప్రీతితోఁ గోవులఁ బిదుకుచునుండి
పదముతోనపు డొక్కపామునుద్రొక్క
నదిమించికఱవఁగా నపుడవ్విషము
తలకెక్కి ధరణిపైఁ దల్లివ్రాలినను

గలఁగక నేధైర్యకలితుండనగుచు
నాబంధకముపీడె నది మంచిదనుచు
నాబుద్ధిలోనెంచి న్యాయమూహించి
జననికి విహితసంస్కారంబుచేసి
జనులసంగతిరోసి జలజలోచనుని
దయగోరికొనుచు నద్దనుజారిమీఁది
ప్రియముతో నుత్తరాభిముఖుండనగుచుఁ
బురముల జనపదంబుల గ్రామములను
వరపర్వతంబుల వాహినీతతుల
దాఁటియావలఁబోయి దందశూకములు
కాటుకకొండలగతిఁదోఁచుఁగరులు
కారెనుబోతులు కంఠీరవములు
ఘోరశార్దూలముల్ ఘూకకాకములు
చండఖడ్గవరాహశరభభల్లూక
గండభేరుండాదిఘనమృగావళులు
గలిగి భయంకరాకారమైనట్టి
యలఘుతరారణ్యమందుఁబోవుచును
ఆఁకలిదప్పి మెండైనట్టివేళ
నాఁకటఁబోవలే కందందునిలచి
మడువుల నదులందు మాటిమాటికిని
బడలికదీరఁదప్పక గ్రుంకులిడుచు
నీరుద్రావుచు నెందునిల్వక అపుడు
నారాయణుని దివ్యనామగీతంబు
బాడుచు నానందపరవశత్వమున
నాడుచుఁజనుచుండి యందొక్కచోట
విపులతరాశ్వత్థవృక్షంబుచెంతఁ
దపసినై కూర్చుండి తపసులుమున్ను
ఆనతిచ్చినరీతి నంబుజోదరుని
పూనిభావింపఁగాఁ బులకాంకురములు
మేనిపైఁబొడమఁగా మిఱిమీఱినట్టి
యానందబాష్పంబు లక్షులఁదొఱఁగ

ధ్యానింపుచుండ నత్తఱిపరమాత్ముఁ
డైనవిష్ణుండు నాయాత్మలోఁదోఁచె
నప్పుడు భక్తిరసాబ్ధిలోమునిఁగి
యప్పరమేశ్వరుండగు హరిన్మఱచి
ననునేను మఱచియున్నను జక్రధరుఁడు
దనరార నంత నంతర్ధానమొందె.
నేనంతటనులేచి నీరజోదరుని
గానకచింతించి క్రమ్మఱఁగనులు
ముకుళించి ధ్యానమిమ్ముగఁజేసిచేసి
యకలంకుఁడైనట్టి హరినిగానకను
దిగ్గునలేచి నల్దిక్కులఁదిరిగి
బెగ్గడిల్లుచుహరిన్ బిల్వఁగానతఁడు
పలుకకుండిన దుఃఖపరవశత్వమున
వెలవెలఁబోవుచు విపినమధ్యమునఁ
జరియించునాపది సంతాపమెల్ల
హరియించుటకుఁజక్క నాకాశవాణి
కరణి ఘనాఘనగంభీరమహిమ
వరవాక్సుధావృష్టి వర్షించినటుల
నిరవైనకరుణతో నిట్లనిపలికె:
'పరితాపమేలరా? బాలక! నీకు
మొనసిన ఈజన్మమున నీవువచ్చి
ననుజేరజాలవెన్నగ కర్మములను
కామాదిరిపుల తెంకకగెల్చినట్టి
యామునీశ్వరులు మహాయోగివరులు
ననుజూచుటరుదు, క్రన్ననీదుకోర్కె
కొనసాగనామూర్తి గుఱుతుంజూపితిని
నామీఁదికోర్కె యెన్నడువృథగాదు
కామాదివైరుల ఖండించివైచు
నాయందుఁగలభక్తి నరులకెన్నటికిఁ
బాయదుమఱికొన్ని భవములకైన
కడతేర్పఁగనుక నీకాయమీమీఁద

విడిచిమాయనుమతిన్ విఖ్యాతిమెఱయ
నిరవొందఁబుట్టెద నింకనీసృష్టి
యరయ లయంబొందు నంతమీఁదటను
ఆవేయియుగముల యంతగాలంబు
పోవు యామినిరీతి, పోయినవెనుక
గలుగుపునస్సృష్టికాలంబునందు
సలలితజ్ఞాననిష్ఠ నిరూఢిగాఁగ
ఘనసాత్వికులలోను గణ్యుండవగుచు
జనియించిముక్తి నల్పుచుండెదవు.'
అనఁగ నద్భుతమంది యాకాశదిశను
గనివినుతింపంగ నోంకారమూర్తియును
విలసితలీల ఋగ్వేదాదికంబు
లలితనిశ్వాసంబుగాఁగదీపించి
సర్వనియామకశక్తితోఁదగిన
పూర్వధ్వనిని మహాభూతంబుబలికి
యూరకుండిన మది నుప్పొంగినేను
నారాయణునకుఁ బ్రణామంబుచేసి
కామాదులనుగెల్చి ఘనతరానంత
నామముల్ పఠియించి నామనంబునను
పరమభద్రములైన పంకజోదరుని
వరచరిత్రములను వర్ణించికొనుచు
సంతతానంద సుస్వాంతుఁడనగుచు
నంతకాలమువచ్చు నంతకుభూమిఁ
జరియింపఁగాఁ గొన్నిసంవత్సరములు
జరిగినవెనుక నాశ్చర్యంబుగాను
మెఱుపుచందంబున మృత్యువుదోఁచె
నరయఁదత్కర్మదేహమును క్షమయ్యె.
నయమొప్ప హరికరుణను శుద్ధసత్వ
మయమైె రజంబుతామసమునులేని
యమలభాగవతదేహంబునొచ్చితిని.
యమరఁగానంతతో నాజగత్త్రియము

నలుకత్రైలోక్యంబు నుపసంహరించి
లలిమించు ప్రళయకాలపయోధినసుమ
దనియనిద్రింపఁజిత్తమున నూహించి
మొనయు నారాయణమూర్తియైనట్టి
సలలితబ్రహ్మనిశ్వాసంబువెంట
బలమొప్పనేనులోపలఁ బ్రవేశించి
యొప్పుచుంటి సహస్రయుగమితకాల
మప్పుడుజనిపోయె, నంతలోలేచి
చెలఁగి పునస్సృష్టిఁ జేసెదనంచుఁ
దలఁచుచున్నట్టి విధాతప్రాణముల
వలన మరీచ్యాది వరమునుల్ నేను
నలరజనించితి మామునీశ్వరులు
రహిమీఱ సృష్టికారణులైరి; నేను
మహిమాఢ్యుఁడైనట్టి మాధవుకృపను
పరఁగ నఖండితబ్రహ్మచర్యమును
మురువొప్పనడుపుచు మోదమొందుచును
సలలితలీల నీశ్వరదత్తయగుచు
జఁబజసంభవవరసంజాతమగుచు
రహినొప్పునస్వరంబు లేవేళ
తహపొందితమయంత తామ్రమోయఁగను
నాచేతనుండు వీణనుసంతతంబు
నాచక్రధరుని కథావళిగాన
సరణిఁబల్కించుచు సకలలోకముల
మెఱసియుండఱికి నేమిత్రుండనగుచు
రమణీయబహిరంతరంబులయందు
నమర నాకెవ్వరు నడ్డంబులేక
చరియింపుచుండుదు సర్వకాలంబు.
దొరకొని తీర్థపాదుండై నచక్రి
తనచరిత్రములేను దవిలిపాడినను
మొనసిపిల్వఁగవచ్చి ముందరనిలచి
యుండుగావునఁ జూచుచుందునాహరిని.

ఖండనీయాఘదుఃఖసముద్రమందు
వెలసిన శబ్దాదివిషయతరంగ
ములలోఁబొరలెడి మూర్ఖులకెల్ల
నలినాక్షుగుణవర్ణనము నావసుమ్ము.
యలయమనియమధ్యోగాదులచేత
నరయమానసము నియంత్రితంబయ్యు
నారిదికామాదికక్షుద్రదోషముల
చేఁబ్రబోధితమగు సిద్ధిలేకున్న
నీప్రపంచమున లక్ష్మీశ్వరుసేవ
శాంతినొందించు నేచందానైన
సంతసంబొదవ నాజన్మకర్మములఁ
గలరహస్యములెల్లఁ గ్రమముగానీవు
నెలవొప్పనడిగిన నేను చెప్పితిని.
నీవు నా శ్రీవిష్ణునిర్మలకథలు
భావించిరచియింపు భాగవతంబు'
ననిచెప్పి నారదుఁడావ్యాసమౌని
నొనరంగవీడ్కొని యుచితమార్గమున
నలనొప్పఁగావీణ వాయించుకొనుచు
నలరుచు నిచ్ఛావిహారియై చనియె."
అనిపల్క విని శౌనకాదిసన్మునులు
మనమురంజిలదేవమౌని కీర్తించి
సూతునిజూచి "మెచ్చగనారదుండు
ప్రీతిరెట్టింపఁజెప్పినమీఁద నిచట
భగవంతుఁడగు వ్యాసభట్టారకుండు
మగుడతానేమి సమ్మతముగాఁజేసె?
ననిశౌనకుండు నెయ్యంబుతోనడుగ
ననఘాత్ముఁడగు సూతుఁడతని కిట్లనియె:
"ధీరాత్మ! వినుము బ్రహ్మాదైవత్యయగుచు
సారమైతగు సరస్వతియనునదికిఁ
బడమటిగట్టున బదరికాతరువు
లడరగుంపై,యుండు నచటసంయములు
చిరతరసత్కర్మసిద్ధికై జపము
లరలేక కావింతు రాస్థలంబందు
వ్యాసుండు జలముల వార్చికూర్చుండి
భాసురమతిచేతఁ బరమపూరుషుని
బరిపూర్ణుఁడై వెల్గు భక్తవత్సలుని
బరమేశుఁగాంచి ప్రపంచంబునందు
అలరారఁగా నీశ్వరాధీనమాయ
వలనజనించి యవారితంబైన
జీవుని సంసారచిత్రమంతయును
భావించిపురుషుండు ప్రకృతిబద్ధంబు
వలన గుణత్రయ వ్యతిరిక్తుఁడయ్యు
నలత్రిగుణాత్మకత్వాభిమానమునఁ
దాగర్తననుచు భోక్తననుచు భ్రమసి
చీకాకుబడు కర్మసృష్టిలోఁదగిలి
కావున జీవుని కర్మములు తెగను
శ్రీవిష్ణుభక్తివిశేషయోగంబు
కావలెనందుచేఁ గాక వేఱొక్క
భావనచేఁగర్మపాశముల్ తెగవు
అనినిశ్చయింపుచు నవనీతలమున
జనులకు హరిభక్తిజనియింపఁజేసి
క్రమముగా మోక్షమార్గంబుజూపుటకు
నమరినభాగవతామ్నాయమనఁగఁ
దగుపురాణంబు సత్తాపసోత్తంసుఁ
డగణితయోగాఢ్యుఁడగుచుఁగల్పించి
యకలంకమతిని మోక్షార్థియైయున్న
శుకునిచేఁజదివించె సుస్థిరంబుగను"
అనుచుసూతుఁడుపల్క నాశౌనకుండు
విని యిట్టులనియె బల్వెఱఁగునొందుచును:
"సూతా! యిదేమి యాశుకయోగి పంచ
భూతమయుండు, సంపూర్ణానుభవుఁడు,
పరమనిర్వాణతత్పరుఁడునై యుండి

గురుభాగవతమేమికొఱ కభ్యసించె?"
ననవిని యాసూతుఁ డతని కిట్లనియె;
"ననఘాత్మ! నిరపేక్షు, లధికధీరులును,
అనిశమాత్మారాములగు యోగివరులు
ననుపమానుండైన హరిభజనంబు
నిష్కాములయ్యును నిరసింపలేక
నిష్కారణంబుగానే చేతురెపుడు
గురుతరకల్యాణగుణగణుండైన
హరికథల్ వర్ణనీయంబులందరికిఁ
గావున లోకమంగళంబగుచుఁ
బావనంబైనట్టి భాగవతంబు
హరిదివ్యగుణవర్ణనసక్తుఁడగుచు
సరసుఁడై వ్యాసప్రసాదంబుచేత
నిగమంబులెన్ని వర్ణించినగాని
సుగమముల్ కావని చూచిభాగవత
నిగమంబుపఠియించి నిర్వాణపదము
నగణితుఁడై పొందె నాశుకయోగి"
యనిపల్కిసూతుఁడిట్లనియె వెండియును:

—అర్జునుఁ డశ్వత్థామను బట్టుట—

"వినవయ్య, శౌనక! విఖ్యాతి మెఱయు
నవనిలో రాజర్షియగు పరీక్షితుని
ప్రవిమలజన్మకర్మములు ముక్తియును
పాండుసూనుల మహాప్రస్థానకరణి
అండజవాహనుండగు కృష్ణుకథలు
జెప్పెదవినుః కురుక్షేత్రంబునందు
ముప్పిరిగొని బలంబులనుగూర్చికొని
కౌరవపాండవుల్ కదనంబునందు
భూరిశౌర్యంబునఁ బోరాడిపొలసి
రహిమీఱఁబోయి వీరస్వర్గమందు
విహితులై యుండి రావెనుకనివ్వోట
దొరకొనిభీముండు దుర్యోధనుండు
నురుతరంబుగ గదాయుద్ధంబుబూని
కొండకొండయును ఢీకొనినచందమున
నొండొరుల్ గదిసిమహోద్దండగతుల
జడియక సవ్యాపసవ్యముల్ గాను
విడిబడి తిరుగుచు వీడిడాయుచును
కనులనిప్పులురాలఁగా మిట్టిపడుచు
ఘనగదాఘాతభగ్నశరీరులగుచుఁ
దడబడకను రక్తధారలఁదోఁగి
కడుచలంబున మించి కంఠీరవముల
కరణి నొండొరులను గర్జించుకొనుచుఁ
గరికరి పోరాడుగతినున్న జూచి
కరువలిపట్టికిఁ గనుసైగగాను
హరితొడల్ జూపఁగా నాసంజ్ఞఁదెలసి
పటుశక్తితోఁ గురుపతితొడల్ విఱుగ
ఘటకుఁడై భీముండు గదద్రిప్పికొట్టె
నంత సుయోధనుండవనిపైఁబడియె.
పంతమీడేఱె నప్పవనాత్మజునకు;
సంతసించిరి ధనంజయుఁడు, కృష్ణుఁడును
కౌంతేయులకు మేలుగలిగినందుకును
కుపితుఁడై కురురాజు గూలినందుకును
కపటియై ద్రోణుండుగన్నసుతుండు
తొలఁగితానపుడును దుర్యోధనునకు
విలపించి ప్రీతిగావించెదననుచుఁ
దగనిద్రబోయెడి ద్రౌపదిసుతులఁ
దెగటార్చి శిరములు దెచ్చియారాజు
ముందరఁబెట్టి యమ్మూర్ఖుండులోక
నిందితుండయ్యెను నిష్కారణముగ
నప్పుడశ్వత్థామ యాత్మనందనులఁ
దెప్పునజంపిన తెగువ వేవేగ
విని ద్రౌపదీదేవి వెలవెలఁబోయి
కనులబాష్పములొల్కఁగా నేడ్చుచున్న

కనికరంబునఁజూచి కవ్వడి ద్రుపద
తనయనేడ్వకుమని తానూరడించి
పలికెనిట్లనుచు: 'ఓపాంచాలి! నీవు
కలఁగనేమిటికై నకార్యసంగతికి?
నీవింకవగచిన నీతనూజులకు
జీవముల్ వచ్చునే? చెనఁటియైసుతులఁ
జంపినద్రోణి నేజంపితచ్ఛిరము
తెంపుగానిచటికిఁ దెచ్చియిచ్చెదను
వానిశిరము దన్నివైచి యావెనుక
స్నానంబుజేయుము చలమెల్లఁదీర'
ననియొడంబఱచి శౌర్యంబుదీపింపఁ
దనమిత్రుఁడైనట్టి దనుజారాతితోడ
విడిబడిరథమెక్కి వెనువెంటజనెను
వడిజూచిబెదరి యశ్వత్థామయుఱికి
దూరంబుగాఁబోయి దుఃఖించుకొనుచు
ధీరతనెడఁబాసి దేహాభిమాని
యగుచుజలంబులందాచమనంబు
తగజేసి పద్మజాస్త్రప్రయోగంబు
నురువడి తానేర్చి యుపసంహరించు
సరణినెఱుంగక చపలాత్ముఁడగుచుఁ
బ్రాణాపదనుమించి బ్రహ్మాస్త్రమపుడు
ద్రోణి పార్థునిమీఁదఁదాఁ బ్రయోగించె.
నప్పుడాబ్రహ్మాస్త్ర మగ్నిగ్రక్కుకొనుచును
దెప్పునరాఁజూచి దేవకీసుతుని
జూచి యాఖండలసుతుఁడిట్టులనియె:
'ఓచక్రపాణి! మహోత్పాతమగుచుఁ
గాలానలజ్వాలగతి విజృంభించి
చాలభూమ్యంతరిక్షములందు నిండి
యిదె మనకెదురుగా హెచ్చుచువచ్చె
నిదియేమి?' యన రుక్మిణీశుఁడిట్లనియె:
'విను, పార్థ! యాద్రోణి వెఱపుతోనుఱికి
పనిబూని మఱలి ఈబ్రహ్మాస్త్రమేసె
నిఁక నుపసంహారమెఱుఁగఁడువాఁడు
ప్రకటమైనట్టి నీబ్రహ్మాస్త్రమిపుడె
తనరారదీనిమీఁదను బ్రయోగింపు'
మనవుడువిని పార్థుఁడాచమనంబు
సరగునగావించి జలజోదరునకుఁ
జరభక్తితోఁ బ్రదక్షిణముగావచ్చి
భీమసాహసమునఁ బేర్చి యర్జునుఁడు
నామింటవచ్చు బ్రహ్మాస్త్రంబుమీఁదఁ
బటుశక్తితోఁ దనబ్రహ్మాస్త్రమేసె
నటునిటుబోక బ్రహ్మాస్త్రముల్ రెండు
ప్రళయాగ్నిబింబంబు భానుబింబంబు
కళవళపడక తక్కఁబోరురీతిఁ
బోర దిగంతరంబులు భూనభములు
భోరుకొల్పుచు మహాద్భుతముగానుండె.
నపుడు పార్థునిజూచి హరి 'యీశరముల
నుపసంహరింపుము, యుచితజ్ఞ!' యనిన
నప్పుడౌననుచు బ్రహ్మాస్త్రయుగ్మంబు
నొప్పుగాగాండీవి యుపసంహరించి
యెదిగి అశ్వత్థామ నెగసిపట్టికొని
పదరియాజకుఁ డొక్కపశువునుబట్టి
కట్టినచందంబుగాఁ గట్టివేసి
చిట్టాడనీయక శిబిరంబుజేర్చి
యచ్చటహింసింతు ననివిజృంభింప
చెచ్చెరకృష్ణుండు చెయిబట్టితీసి
'నిలునిలు, మర్జున! నీవిప్పుడతని
చలముపెంపుననేల చంపఁబూనెదవు?
పదటుఁదనమున నీపాపాత్ముఁడకట
చెదరకనిదురించు శిశువులఁజంపె
నట్టిక్రూరుని విప్రుఁడనుచు నీకింత
పట్టిచంపుటగాదు, ప్రాణభయమున

పొలిపోయి వెలవెలఁ బోవుచున్నాఁడు.

..............................

వినుము చావునకింత వెఱచువారలను,
నొవరనిద్దురఁబోవుచుండువారలను,
అతిసౌఖ్యమున మత్తులైనవారలను,
బతిమాలుచును పుల్లవడినవారలను
పూరిగఱచువారి, బోరాడలేక
పారిపోయెడువారి, బాలుర, సుతులు,
జగతీసురులఁబట్టి చంప రాజులకుఁ
దగవుగాదందురు ధర్మతత్పరులు
తనశరీరమునైన తాపీడి యన్య
జనులరక్షించ జనపాలకుండు
ఘనమైనయూర్ధ్వలోకమునందు 'జేరు;
చెనఁటియై తప్పుచేసిన మానవుండు
డాకైనరాజదండనముచే నూర్ధ్వ
లోకంబుగాంచు, నీలోకనిందితుఁడు
అరసిచూడ వధార్హుఁడగునైననీతి
మఱచిభీతుఁడు విప్రమాత్రుండనినీవు
నీరీతిఖండింపనేలను? వీఁడు
ప్రారబ్ధముననేఁడు బద్ధుఁడైనాఁడు
మంచిది వానికర్మమువాఁడెయనుభ
వించుఁగాకివు డింత వెఱచుచుండగను
తెంపుగా నీపరదేశినిచోటఁ
జంపనేటికి? రమ్మి, సత్కృపాసాంద్ర!'
యనియిట్లు శ్రీకృష్ణుఁడానతిచ్చినను
వినిచంపఁజాలక విజయుఁడల్లపుడు
చెలఁగిపాంచాలికిచ్చిన మాటమదిని
దలఁచియాద్రౌణిని ద్రౌపదికడకుఁ

—ద్రౌపది యశ్వత్థామతో సంభాషించుట—

గొనితెచ్చి యందుంచి 'కొమ్మ! నీవితని
పనిబూనిజంపించు బ్రతికించుమింక
నీమనసన్న'ని పల్క నిట్టూర్పునించు
యామానినీమణి యారటమంది
యలుగక, శిశుహంతయగులజ్జచేత
తలవాంచియున్నట్టి ద్రౌణినీక్షించి
కరములుముకుళించి కన్నీరుదొరఁగఁ
బరితాపమునఁబల్కె పాంచాలియపుడు:
'అన్న, యశ్వత్థామ! యక్కటా నీకుఁ
జిన్నిపాపలఁజంపఁ జెయ్యెట్టులాడె?
వరుసగా మామగవారికందరికి
గురుఁడైనద్రోణుని కొడుకవై యుండి
నీతండ్రిశిష్యులు నీశిష్యులనెడి
నీతివిచారించి నెనరెంచలేక
నేరుపులెవ్వియు నేరక రాత్రి
యారకనిదురింపుచున్న యర్భకులఁ
బట్టిచంపుటనీకు పాపంబుగాదె?
యిట్టికట్టడితనంబెటుగల్గె నీకు?
గురుఁడనిచూడక కుంతినందనులు
బెరసిమీతండ్రి జంపినవగఁదీర
కన్నతండ్రులకు దుఃఖమునిచ్చుకొఱకుఁ
బిన్నపాపలఁజంపితినంటివేని
కదనరంగంబులోఁగా విజృంభించి
యెదిరించిపోరువా రెంతవారైన
వధియింపదగు గాన వరపాండుతనయు
లధికశౌర్యోద్ధతి నాహవంబందు
మీఱిపోరాడిన మీతండ్రిజంపి;
రారీతి నాబిడ్డలకట! నీతోను
పోరాడవచ్చిరో భూరిశౌర్యమున?
మారొడ్డియాడిరో మాటలేమైన?
తేరకునీవింత తెగువతోసుతుల
దారుణంబుగఁజంప ధర్మమే? తండ్రి!
వీరశేఖరుఁడవు, విప్రోత్తముఁడవు,

# అమావాస్యనిశ

శ్రీమతి శిరుగూరి రత్నమ్మగారు

(హిందీనుండి అనువదింపబడిన చిన్నకథ)

౧

దీపావళినాటిరాత్రి శ్రీనగరమున గల సంపన్నగృహములయందునను పాడిండ్లయందునను శోభగా నుండెను. నగరమునగల్గుబాలురు, బాలికలు శుభ్రముగాతోమి తెల్లగా మెరయుచున్నపళ్లెరములయందు దీపములు పెట్టుకొని దేవాలయముపైపు వెళ్లుచుండిరి. దీపములకన్నను అధికముగా నాబాలబాలికల ముఖారవిందములు మెరయుచుండెను. ప్రతిగృహమును దీపావళిచే ప్రకాశించుచుండెను. కేవలము పండితదేవదత్తునియొక్క ఏడంతస్థుల మేడమాత్రము గంభీరముగాను, భయంకరముగానుఉండెను. పూర్వైశ్వర్యముయొక్క స్మృతిచిహ్నముగా నిలచియుండెను. ప్రస్తుతము ద్వారపాలకులకుమారుగా వృక్షములు నిలచియుండెను. దివాన్ ఖానా అంతయూ పాలిపట్లతో నిండియుండెను. ఏఇంటిలో సుందరీమణుల మనోహరసంగీతగానము వినవచ్చుచుండెనో అచ్చటనే నేడు అడవిపావురముల మధురస్వరము వినవచ్చుచుండెను. ఇదియంతయు కాలమాహాత్మ్యమే!

నేడు అమావాస్యదీపములప్రకాశమువలన అంధకారము పరాజితమయి దేవదత్తుని విశాలభవనములో శరణుజొచ్చెను. దేవదత్తుడీఅంధకారమున తనగదియందు చింతానిమగ్నుడైయుండెను. నేటికి నెలదినములనుండి దేవదత్తునిపత్నియగు గిరిజదేవి మరణాసన్నురాలైయుండెను. దేవదత్తుడు మిక్కిలిదరిద్రము, దుఃఖము అనుభవించుచుండెను. అదృష్టముపై నాధారపడి అతను ధైర్యముకలిగియుండెను. కాని ఈనూతనవేదన అతనికి సహింపనలవికాకుండెను. పాపము దినదినమును కృశించుచున్న గిరిజయొక్క పర్యంకతలమున ఆసీనుడై ఆమె ముఖమును వీక్షించుచూ దుఃఖించుచుండెను. ఒక్కొక్కప్పుడు గిరిజయు తన జీవితముపై నిరాశకెంది యేడ్చుటయూ కలదు. అప్పుడు దేవదత్తుడామెను ఓదార్చుచుండును.

పండిత దేవదత్తుని పూర్వులు వడ్డీవ్యాపారము బాగుగా చేయుచుండెడివారు. వారికి ఎక్కువగా రాజులతోను, మిక్కిలిధనవంతులతోను వ్యాపారముండెడిది. పూర్వకాలమునందు ఇప్పటివలె 'దస్తావేజీ'లుగాని 'ప్రోనోట్లు'గాని లేవు. అప్పుపత్రములు తెల్లకాగితములపై వ్రాసి చేవ్రాలుచేయుటయే కాని సాక్షులు, సంతకములు మొదలగునవేవియు లేవు.

కొన్నిదినముల తరువాత గొప్పకాటకము సంభవించెను. దానితో దేవదత్తునితండ్రి ఆస్తినంతయూ పోగొట్టుకొనెను. దేవదత్తుడు పెద్దవాడగునపరికి నివసించుచున్న యొకగృహము ఋణపత్రములుమాత్రము మిగిలియుండెను. దేవదత్తునిచేతిలో నొకరాగిపైసఅయినను లేకుండెను. ఇదివరకు కృషియన్న నేమియు నెరుగని దేవదత్తునకు కృషిసల్పుట కష్టముగానుండెను. వర్తకముచేయవలయుననిన దానికి ధనమును, బుద్ధియు నావశ్యకములు. సర్కారుఉద్యోగమేదైన చేయవలయుననిన విద్యాశూన్యము. భిక్షమెత్తికొనిఅయినను జీవించవలయుననిన పూర్వప్రతిష్ఠ, గౌరవము ఆటంకములుగానుండెను. కావునప్పుడప్పుడు పూర్వవ్యవహారికులఇండ్లకేగి వారిచ్చుస్వల్పద్రవ్యముతో కాలక్షేపముచేయుచుండెను. పూర్వప్రతిష్ఠ వానిఅప్పుపత్రములయందుమాత్రమే నిలచియుండెను. దేవదత్తుని మందభాగ్యతవలెనే వాటియందలిఅక్షరములుకూడా మలినమై కాలవిపర్యాయమును సూచించుచుండెను. దేవదత్తుడా ఋణపత్రములను తనప్రాణముకన్న మిన్నగజూచుచుండెను. అమావాస్యదినమున ప్రతిగృహమునందును లక్ష్మీపూజలు జరుగుచుండెను. దేవదత్తునిగృహమున లక్ష్మి లేదు సరికదా లక్ష్మియొక్క చిహ్నమైనను అగపడుటలేదు. కేవలము వానివద్ద డెబ్బదిలక్షలరూప్యములఅప్పుపత్రములు ఉండెను.

౨

దీపమాలికలన్నియూ తమఅల్పజీవితములు చాలించుకొనినవోయనునట్లు తేజోవిహీనములు కాజొచ్చెను. దేవదత్తునిభార్యయగు గిరిజ కానాటిప్రొద్దుటనుండియు మిగుల నస్వస్థతగనుండెను. విషజ్వరము ఆమెను ప్రతిక్షణమును మూర్ఛితగాజేయుచుండెను. అకస్మాత్తుగా ఆమె యులికిపడి కండ్లువిప్పి మిక్కిలి హీనస్వరముతో నిట్లు చెప్పెను:

"నేడు దీపావళీ అమావాస్య."

గిరిజకు స్మృతివచ్చుట, ఆమెమాట్లాడుట విచారమగ్నుడగు దేవదత్తునకు సంతోషము కలిగించెను. "అవును. నేడు దీపావళిఅమావాస్య". గిరిజభాష్పాకులితనేత్రయై ఇటునటు వీక్షించుచు మెల్లగా నిట్లనెను: "మనఇంట్లో దీపముపెట్టరా?" ఆమాటవిని దేవదత్తుడు వెక్కివెక్కి ఏడువసాగెను. గిరిజ మరల అదేస్వరమున 'చూడుడు, మనఇల్లు ఈసంవత్సరమంతయూ అంధకారముగానే యుండును. నన్ను లేవనీయుడు. మన ఇంట్లో దీపము వెలిగించెదను.'

ఈమాటలు దేవదత్తుని హృదయమునందు బాణములవలె నాటెను.

* * * *

ఈపట్టణమున లాలాశంకరదాసు గొప్పవైద్యశిఖామణి. అతనుతన 'ప్రాణసంజీవని'యనుపేరుగలఅను పత్రియందు ముద్రణాయంత్రముకూడ తెప్పించియుంచెను. మందులు కన్నను ప్రకటనలు హెచ్చుగానుండెను.

ఈవైద్యునివద్దనే దేవదత్తబాబు భార్యకు మందు తీసుకొని వెళ్లదలచెను. శంకరదాసు డబ్బు ఎక్కువగా నిచ్చిన వారిని బాగుగాచూచుచుండెను. కాన నిర్ధనుడగు దేవదత్తునితో ఎన్నడూ శంకరదాసు మాట్లాడి యుండలేదు. దేవదత్తుడు ఎన్నడును తనభార్య అస్వస్థత యాతనితో చెప్పుటకు వీలుకలుగలేదు. ఒకదినమున దేవదత్తు డాతని సముఖమునకువెళ్లి ఎంతయో వేడ్కొను, యెంతయో మొరపెట్టుకొనెను. కాని మిక్కిలి కఠిన హృదయుడగు డాక్టరుబాబుహృదయము కరుగలేదు.

రాత్రి మిగుల భయంకరముగానుండెను. గగనమండలమందున తారలు బాగుగ మెరయుచుండెను. అర్ధరాత్రి ఆయెను. శ్రీనగరమునందు ఆరినదీపములను చూచి మాప్రకాశము ఇంతలోనెదిరియేనా అని పరిహసించుచున్నవోయన్నట్లు తారలు తళతళ మెరయుచుండెను. పాపము దేవదత్తుడు కష్టదశలోనున్న గిరిజ యొక్క శయ్యాపార్శ్వమును వీడి డాక్టరు గృహమువైపునకు మరలెను. డాక్టరు బాబు 'ఫీజు' పుచ్చుకొనకుండ తన గృహమునకు రాడని దేవదత్తునకు బాగుగా తెలియును. అయినను-వాతాతురైనప్పటికి ఆశవదలదు- దేవదత్తు త్వరగమనమున నడచివెళ్లుచుండెను.

3

డాక్టరుబాబు ఆసమయమందు తన'రామబాణబిందు' యను మందునుగూర్చి పత్రికకు ప్రకటనవ్రాయుచుండెను. అతనిప్రకటనయొక్క ఆకర్షణశక్తి చూచువారలకు అతను వైద్యశిరోమణియో లేక 'సులేఖక విద్యావారిధి'యో చెప్పజాలరు.

డాక్టరుబాబు ప్రకటనపత్రము పూర్తిచేసి గట్టిగా చదువసాగెను. ఇంతలో దేవదత్తుడువచ్చి తలుపు కొట్టెను. వైద్యశిఖామణి లాంతరుచేతబూని బైటికేతెంచెను. వైద్యుని ధ్వనిని విని మిగుల సంతోషించెను. డాక్టరుబాబు ఫీజు రాత్రి రెండురెట్లుగాను సంతసముతో బయటకేతెంచ దేవదత్తుడు యేడ్చుచు అతని పాదములపైబడి "డాక్టరుబాబూ! ఈసమయమున మీరు నాయందు దయయుంచవలెను. గిరిజ కాలునిసదన

మునకు అతిథి కాబోవుచున్నది. మీరొక్కరే దానిని రక్షింపగలరు. లేకపోయిన నాభాగ్యమున ఎట్లు వ్రాయబడియున్నదో అట్లుజరుగును. తమరు ఈసమయమున కొంచెము దయచేసి చూచిన నాహృదయాగ్ని కొంతయుపశమించును. నాశక్తికొలది ఆమెవిషయమున ఏలోటునుకలుగ జేయలేదని నాకూరట కలుగును. కాని తమకు సమర్పణజేయుటకు తగినంతయోగ్యత నాకులేదని భగవంతునకు తెలుసును. కాని జీవించియున్నంతకాలమును మీకీర్తిగానము చేసెదను. మీ సేవకుడనై యుండెదను."

పాపము డాక్టరుబాబుకు మొదట కొంత జాలికలిగెను. కాని అది తటిల్లతవలె వెంటనే స్వార్థమనెడు అంధకారమున అదృశ్యమైపోయెను.

౪

పండిత దేవదత్తుడు నిరాశతో ఇంటికి మరలివచ్చి విచారించుచుండెను. "ప్రాణసంకటమందున్న గిరిజయొక్క ఆరోగ్యముకొరకు నేనెంతయో విలపించుచున్నను ఫలములేకున్నదిగదా? వైద్యుడువచ్చి చూచుటకుపాయమేమున్నది? నాదగ్గర ఒక్కపైసఅయినను లేదే, నేనెట్లు వైద్యునకు ఫీజు ఇచ్చి ఇంటికి తీసుకొని రాగలను? నేనెట్లు కఠినహృదయుడగు వైద్యుని సంతోషపెట్టగలను? డాక్టరుబాబూ, నేను నాజన్మమంతయు నీసేవతో గడపెదను. నీయొక్క ఉదారత ప్రకటించెదను. నీమందులనునూరెదను" అనితనలోననుకొనసాగెను.

డెబ్బదిలక్షల అప్పుపత్రములు నేడొక గవ్వకైనను మారకున్నవిగదా యని దేవదత్తుడు తెలిసికొనెను. ఆఅప్పుపత్రములన్నియు నేటితో దూరముచేయుటకు సంకల్పించుకొని పెట్టి తెరచి ముఖమలు సందువాను బైటకు తీసి యొక్కొక్కటే దీపము దగ్గరపెట్టి కాల్చివేయసాగెను. ఏప్రకారముగా సుందరసుకుమారశరీరములు అగ్ని కాహుతియైపోవునో అట్లా అనేకలక్షలవిలువగల ఋణపత్రములుకూడ దీపమున కాహుతియైపోయెను.

ఇంతలో బయటనుండి దేవదత్తుని యెవరో పిలిచిరి. అతను ఉలికిపడి తలయెత్తి లేచి నిద్రనుంచి లేచిన వానివలె చీకటిలో తడుముకొనుచు వీధిద్వారమువరకువచ్చి తలుపుతీసి చూచెను. కొంతమంది భటులు చేత కరదీపికలను దాల్చి నిలచియుండిరి. ఏనుగుపై నెక్కి రాజదుస్తులతో ఒక సుందరయువకుడు కూర్చుని యుండెను. చూచువారలకు అతడు చాల గొప్పవాడని తెలియుచుండెను. అతను నల్లని అంగరఖాయును, తెల్లని పాయిజమాయును, మొలయందు ఒక విలువగల కత్తియును, మెడయందు బంగారుహారమును ధరించియుండెను. అవి యాతనికి మిగుల శోభకలిగించుచుండెను. దేవదత్తుని చూచుటతోడనే ఆనూతన పురుషుడు క్రిందకుదిగి దేవదత్తునకు నమస్కరించెను. అతనియొక్క వినయమునుచూచి దేవదత్తుడు లజ్జితుడై "తమయొక్క ఆగమనము ఎచ్చటనుండి?" అని అడిగెను. యువకుడు మిగులవినయముతో "నేనుతమయొక్క పూర్వుల సేవకుడను. దాసునియొక్క ఇల్లు రాజనగరమునగలదు. నేను అచ్చటి జాగీరుదారుడను. నాయొక్క పూర్వికులకు తమయొక్క పూర్వికులు చాలాదయకలిగిఉండిరి. ప్రస్తుత నాయీప్రతిష్ఠ, సంపాదనకు తమయొక్క పూర్వికుల దయయేకారణము. నేను నాయొక్క స్వజనులవలన తమయొక్క పేరువినియుంటిని. నాకు ఎన్నియో దినములనుండి తమ దర్శనము చేయవలయునని వున్నది. నేడు అట్టి అవకాశము కలిగినందువలన నేను మిగుల ధన్యుడను." అనిచెప్పెను. దేవదత్తునకు తన పూర్వికుల ప్రతిష్టవినినందున ఆనందబాష్పములు వచ్చెను. వానియొక్క దీనత కొంచెము సేపటివరకు దూరమయిపోయెను. అతను గంభీరభావముదాల్చి చెప్పెను. "మీరిట్లు చెప్పుట మీదయవలననే కాని ఆపూర్వికులసంతతిలోనివాడనని చెప్పుకొనుటకు నాకు తగినంత యోగ్యతలేదు."
ఇంతలో యువకుని నౌకరులు చావడిలో తివాసిపరచిరి. వారిరువురును దానిపైకూర్చుండి మాట్లాడసాగిరి. యువకుని మాటలు వినుచున్నకొలది దేవదత్తుని ముఖకమలము ప్రాతఃకాలసూర్యదర్శనమువలన వికసించినట్లు

వికసించెను. దేవదత్తుని పితామహుడు యువకుని పితామహునకు ఇరువదియైదు వేలరూపాయలు అప్పుగానిచ్చియుండెను. అట్లుఇచ్చి చాలకాలమవుటచే దానికి వడ్డీ ఏబదివేలరూపాయలు అయెను. ఆఋణము తీర్చుటకొరకే ఈయువకుడు రెండువందలమైళ్ల దూరమునుండి డెబ్బదియైదువేలును పట్టుకొని వచ్చియుండెను. యువకుడు దేవదత్తునిచూచి మీవద్దపత్రముండియేయుండవచ్చును. దానిని తీసికొనివచ్చిఇచ్చి రూపాయలు తీసుకొనుడని చెప్పెను. దేవదత్తునిహృదయము బరువాయెను. హృదయావేగమణచికొని "బహుశాఉండవచ్చును. ఇది సరిగాచెప్పజాలను. లోనికిబోయి వెతకి తెచ్చెద"నని చెప్పి లోనికిబోయెను. "అది కాలిబూడిదయాయెనో లేక మిగిలెనో తెలియుటలేదు. పత్రములేక రూపాయలు ఎట్లువచ్చును. ఆరూపాయలు డాక్టరు బాబునకు ఇచ్చి అతనిని సంతోషపెట్టి గిరిజకు స్వస్థతకలుగజేసెదను." ఇట్లు దేవదత్తుడు తనలో అనుకొనుచు మిగిలిన పత్రములను వెతుకసాగెను. అతని అదృష్టవశమున ఆపత్రము దొరికెను. ఆపత్రము చేతపట్టుకొని సంతోషముతో పరుగెత్తి గిరిజయొద్దకువెళ్లి "గిరిజా! భగవంతునికృపకల్గిన నీవిప్పుడు జీవించుటకు అవకాశముకలిగినది" అని సంతోషముతో చెప్పెను. కాని గిరిజ ఈలోకమునువీడి వెడలిపోయెను. కేవలము ఆమెయొక్క శవము మాత్రమే అచ్చట మిగిలియుండెను. ఆమెప్రాణవాయువులు ఎగిరిపోయి గంటకావచ్చెను.

దేవదత్త డాపత్రముచేతగొని యువకునియొద్దకేగి వానికాపత్రమునిచ్చి రూపాయలు పుచ్చుకొనెను. యువకుడును అతనికి నమస్కరించి 'నాపూర్వీకులు తమయొక్క ఋణమునుండి నేడు విముక్తులైరి.' అని వెడలిపోయెను.

పండిత దేవదత్తుడు ఈయువకుని వీడుకొల్పి ఇంటిలోనికి వెళ్లెను. అతను మిగుల సంతోషముగానుండెను. ఈసమయమునందాతనివద్దకు యాచకు లెవరైనవచ్చినయెడల నిరాశులై వెడలరు. సత్యనారాయణవ్రతము మిగుల గొప్పగచేయవలయునని నిశ్చయించుకొనెను. గిరిజకొరకు బట్టలు, వస్తువులు చేయించవలయునని యాతడు అనుకొనెను. కాని గిరిజ ఎట్లున్నదో ఈసంతోషసమయమునం దాతనికి తెలియనేతెలియదుగదా!

అంతఃపురములో నడుగిడగనే ఆతడు భగవంతునికి నమస్కారమర్పించి మిగిలిన పత్రములను వెతికి ప్రోగుచేసి ఆముఖమలంపెట్టెయందే ఉంచి దాచెను. "ఇక నాకీ జీవితకాలమున ధనసంపాదనగూర్చి చింతయుండదు. ఈశ్వరుడు నాకు కావలసినంత ధనమొసంగెను. దీనితో నాయొక్కయు గిరిజయొక్కయు జన్మములు సుఖముగా గడుపవచ్చును." కాని పాపము గిరిజయొక్క జన్మము ఇదివరకే సుఖముగా సమాప్తినొందినదని నాతనికి తెలియదాయెను. ఈసంతోష సమాచారము వినగనే గిరిజలేచి కూర్చుండునని ఆతడు అనుకొనుచుండెను. విచారము, కష్టము వానికి దశకలిగించినవి. కడుపునిండగ తిండి దొరుకనివానికి పరమాన్నము దొరికిన ఇట్టియవస్థయే సంభవించును. ఇట్లు ఆలోచించుకొనుచు గిరిజయొక్క పర్యంకముయొద్దకు వెళ్లి "గిరిజా! కనులను తెరువుము. ఈశ్వరుడు మనప్రార్థననువిని మనపై దయాదృష్టిబరపెను. నీదేహమున ఎట్లున్నది?" అని ఒక్కసారి అడిగెను. కాని గిరిజ మారుపలుకలేదు. వానికి ఆశ్చర్యముదయించి ఆమెపై కప్పియున్న శాలువును తీసిచూచెను. చూడగనే హృదయమునుండి మిగుల జాలిగొల్పు స్వరమున "ఆహా!" అను వేడినిట్టూర్పువచ్చెను. తలను చేతులయందు చేర్చుకొని అచ్చటనే కూలబడెను. కన్నులనుండి రక్తపుబొట్లు పడసాగెను. "ఆహా! ఈసంపదకొఱకు ఇంతప్రియమగుమూల్యమును ఇచ్చికొంటినా? ఈశ్వరా—నీవు మిగుల న్యాయవంతుడవని చెప్పెదరే? నాకు గిరిజయే కావలెను. ధనమక్కరలేదు. ఈధనమును నీవే తిరిగి తీసుకొని నాగిరిజను నాకీయుము."

౬

అమావాస్య నాటి అంధకారమయమగు రాత్రి గిరిజయొక్క అంధకారమయమగు జీవితమువలెనే పూర్తియాయెను. పొలములో నాగలిదున్నుచూ రైతులు గట్టిగా పాడుచుండిరి. నూతిఒడ్డున పురస్త్రీలు నీటికై కూడిరి. నీరునీరు తెచ్చుటకన్నమూ నవ్వుటకొరకు, కబుర్లుచెప్పుకొనుటకునూ చేరుచుందురు. ఒకతె నూతిలో చేదవేసి తనఅత్తసాధించు సాధింపులను చెప్పుచుండెను. ఒకతె నూతి చప్టాచాటునకు వెడలి తన ప్రియసఖితో తొలినాటిరాత్రి భర్తవద్ద జరిగిన ప్రేమాలాపములను రహస్యముగా చెప్పుచుండెను. వృద్ధస్త్రీలు ఏడ్చుచున్న పసుపలను ఒడియందిడుకొని తమతమకోడండ్రను తిట్టుచూ వారిచర్యలను చెప్పుకొనుచూవచ్చి గంట సేపయినను యింటికిమరలకుండిరి. కాని రాజవైద్యుడగు లాలాశంకరదాసు ఇంకను గాఢనిద్రయందుండెను. చాలమందిరోగులు చావిడియందు వేచియుండిరి. ఇంతలో పండితదేవదత్తుడు తలపైన, ఒడలిపైన నేమియు ధరించకుండ కేవలమొక ధోవతిమాత్రము అసందర్భముగా ధరించి, అగ్నికణములవలె మిగుల ఎర్రగానున్న కండ్లతో, భయంకరమగు ఆకారముతో కొన్నినోట్లకట్టను పట్టుకొని పరుగెత్తుచూ వచ్చెను. వచ్చి ఆసౌధాలయమునొక్క ద్వారమువద్దనిలుచుండి గట్టిగా తలుపుకొట్టసాగెను. ఆశబ్దమునువిని డాక్టరు బాబు వులికిపడి తలుపుతీయించెదనని చెప్పుచూ క్రిందకువచ్చెను. ఇంతలో దేవదత్తుడెదురుగవచ్చినిలుచుండి నోట్లకట్టను అతనిముందుపడవైచి "డాక్టరుబాబు! ఇవి డెబ్బదిఐదు వేలరూపాయలనోట్లు. ఇవి తమయొక్క ఫీజు. తమరు వచ్చి గిరిజను చూడుడు. మరియు ఆమెయొక్క కండ్లను ఒక్కసారి తెరపించుడు. కేవలము ఆమెయొక్క ఒక్కదృష్టిపై నివియన్నియు హీనములు. ఒక్కదృష్టిపై ఇదియంతయు మిగుల స్వల్పము. తమకు మనుష్యుల ప్రాణములకన్నను ధనమేప్రధానము. ఆధనము మీఎదుటనే ఉంచితిని. నాకు గిరిజ ఈరూపాయలకన్నను ఎన్నియోరెట్లు ప్రియమైనది." అని చెప్పెను. డాక్టరుబాబు మిగుల లజ్జితుడై జాలికలుగు వీక్షణములతో దేవదత్తునిపై పుచూచి "నాకుమిగుల విచారముగనున్నది. నేను నాజీవితకాలమునందంతయు మీకుఅపరాధిని. కాని మీరు నాకు శిక్షఇచ్చితిరి. ఈశ్వరుని దయవలన ఇట్టితప్పు ఎన్నడును చేయను. నాకుమిగుల విచారముగనున్నది. నిజముగనే నేను మిగులవిచారించుచుంటిని." అని అనెను. ఈవాక్యములు వైద్యుడు హృదయపూర్వకముగా చెప్పెను.

## చిత్రప్రశ్న

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

ఆరక్షరంబుల ఆర్యులగ్రంథమ్ము అతివ్యాప్తినొందుచు నలరుచుండు
ఆద్యక్షరద్వయంబనువుగా భగవంతుగొలుచువారిని తెల్పు కొమరుమిగిలి
ఒకటైదుఆరులు ఒనరంగకలిపిన భీతికిమారుపే రతికియుండు
నాలుగైదారక్షరాలనుగల్పంగ గెలుపునకర్థంబు నెలమిగాంచు
మూడునాల్గయిదారు మోదంబుదీపించుసంపూర్ణజయమును సరవిదెల్పు

అట్టిపుస్తకనామంబు సరసిమీరు
ఆర్యమతజ్ఞానమభివృద్ధియగువిధాన
పత్రికాబాల "గృహలక్ష్మి" కందజేసి
యశమునొందంగబూనుడో అమ్మలార!

☞ ఇట్టి వానియందు రుచిగల గృహలక్ష్మి పాఠకురాండ్రు ఈప్రశ్నకు జవాబు ఆలోచించి లేఖాముఖమున మార్చి 10–వ తేదీలోపున మాకు తెలుపుదురుగాక!

—సంపాదకుడు.

# జోలపాటలు

## ౧

(సంపాదకురాలు) శ్రీమతి యస్. వి. సరళాదేవిగారు

జోలపాడుకృష్ణా! జోకొట్టురంగా!
నిద్రపోబలభద్ర! శ్యామలకొమ్ముడవు
చిచ్చోచిబోయిందే బచ్చల్లీమెయ్య
చిన్నమాఅబ్బాయి రచ్చల్లనాడా
జోలపాడేవారు జోకొట్టేవారు
నిద్రపుచ్చేవారు భద్రకన్యకలు
ఆడబోయబ్బాయి మాడతెచ్చేడు
మాడకుమరిమాడ మద్దికాయల్లు
రావెరావేచిలుకా! రత్నాలచిలుక!
పంచుతేవేచిలుకా అబ్బాయికివ్వ
జోలారిపండెరుపు దొండపండెరుపు
తానెరుపుఅబ్బాయి తనవారిలోను.
చిన్నవాడా! రారా, చంద్రుడారార!
చంద్రుడాఅబ్బాయి చేతిచెండందుకోరా.
జోలారిపాపడికి జోడుంగరాలు
చిన్నమాఅబ్బాయికి పమిడుంగరాలు.
చిచ్చికీనూరేండ్లు నీకునూరేండ్లు
నినుగన్నతండ్రికీ నిండునూరేండ్లు.
ఆడబోయబ్బాయి వచ్చెగామాను
అందెల్లచప్పుడాయె అరుగుల్లమీద
చదువబోయబ్బాయి వచ్చెగామాను
సరస్వతిచప్పుడాయె సావిళ్లలోను.
అందరుమామల్లు చందమామల్లు
అబ్బాయిమామల్లు రామలక్ష్మణులు.
రామలక్ష్మణులంటి మామలుండేను
రాజ్యంబులేలుదురు రాజుల్లుమెచ్చ.
చిచ్చికీబెట్టరే చీమలెంగిలి
అబ్బాయికిబెట్టరే పాలమీగడలు.
రావెరావేపిట్టా! రత్నాలపిట్ట!
పాలుతేవేపిట్టా! అబ్బాయికిపట్ట.
బూచివాడా! రారా బుట్టల్లుకోరా
బుట్టలోఅబ్బాయిని వేసుకొనిపోరా.
ఏడువకుఅబ్బాయి ఏడువకుతండ్రీ
ఏడిస్తేనిన్నవ్వరెత్తుకొందూరు.
నిద్రబోఅబ్బాయి నిద్రపోఅయ్యా
భద్రకన్యకలొచ్చి నిన్నులేపేరు.
వాసాలమీదది మీసాలఎలుక
అబ్బాయిచేతిది రత్నాలగిలక.
పట్టులాగుచొక్కా నీకుఅబ్బాయి
మేనత్తతెచ్చింది ఏడువకుతండ్రి!
హాయివారింటికీ పోయివస్తాము
అరటిపండ్లత్తాలు కోసుకోస్తాము.

* * *

కొండలలోవున్నారు మండలేశ్వరులు
కట్టించుమీనాన్న గాలిగోపురములు
గాలిగోపురాన రెండుచిలుకల్లు
అందులోఒకచిలుక చిన్నిఅబ్బాయి
చూడబోయి పెదనాన్న సున్నమేయించె
అడుగబోయిపినతండ్రి అరుగువేయించె
పరుగుపరుగున అన్నబావిత్రవ్వించె
పుణ్యాలమీయమ్మ పూలవనమేసె
ప్రేమగలమీయక్క పూలన్నికోసీ
చిన్నిమాఅబ్బాయికి జడనిండగ్రుచ్చె.

* * *

పచ్చల్లుకెంపుల్లు పారిజాతములు
పావమనఅబ్బాయికి నీళ్లోసేచోట
రత్నాలుచెక్కినా రవ్వల్లపంపు
ఆడుకోమనియిచ్చెతాను మీనాన్న
వీథుల్లనాడకు నీవుఅబ్బాయి
విస్తరించినకుకులు దృష్టితాకేను
రచ్చల్లనాడకు నీవుఅబ్బాయి
అందాలనీమోము కందిపోయేను.

* * *

కోవిలబుద్ధుల్లు కొత్తల్లేమాకు
అబ్బాయిమాటల్లు వింతల్లేమాకు
పిట్ట! రావెపిట్ట! పిల్లల్లతల్లి!
పిల్లలకుపాలిచ్చి పల్లెలకువెళ్లు.

## ౨

(సంపాదకురాలు) శ్రీమతి దరిశి సుబ్బలక్ష్మమ్మగారు

ఊరికేఉయ్యాల లమ్మవచ్చినవి
కొనరె కొడుకులతల్లి కొనరెఉయ్యాల.
ఎమిబోసికొందునూ? ఏడువకుతండ్రి!
పాలిచ్చికొనవమ్మ పణతినాతల్లి!
కొబ్బరాచెట్లకూ వెయ్యరుయ్యాలా
గోపెమ్మమనుమణ్ణి ఊచరుయ్యాలా.
చిచ్చిలక్ష్మి! రావే, శ్రీలక్ష్మి! రావే
ఆదిలక్ష్మి! రావె అబ్బితోనాడ.
చిన్నవాడబ్బాయి చిలుకల్లపాన్పు
శ్రీలక్ష్మిఊపవే అబ్బిఉయ్యాల
మంచివాడబ్బాయి మల్లెల్లపాన్పు
మాలక్ష్మిఊపవే కృష్ణుఉయ్యాల.
చిలుకల్లుచెలరేగి జీడికొమ్మెక్క
అబ్బాయిచెలరేగి నాన్నభుజమెక్క.
ఏడువకుఅబ్బాయి! ఏడువకుతండ్రి!
ఏడిస్తెనిన్నెవ్వరెత్తుకున్నేరూ?
చిచ్చిమామిడిరావె శ్రీమామిడిరావె
చిలుకమామిడి క్రిందిచిన్నికోవెలవూ.
ఆడుకోవెలలొచ్చి ఆడుచున్నాయి
ఆడుకోకృష్ణయ్య! అన్నిటితోగూడి.

## 3

(సంపాదకురాలు) శ్రీమతి కాటంరెడ్డి శేషమ్మగారు

హాయివెంకటరమణ! ఆపదలుగాయి
అలమేలుమంగమ్మ! మాఅమ్మాయినిగాయి
హాయికిఆరేండ్లు ఆబ్బయ్యకువేయేండ్లు
పాలిచ్చుదాదులకు పరగనూరేండ్లు
ఊరికివుయ్యాల లమ్మవచ్చినవి
కొమరపిల్లలతల్లి! కొనరెవుయ్యాల
యేంబెట్టినేగొందు వెండివుయ్యాల?
పాలుబోసినేగొందు పసిడీవుయ్యాల.
మారుతల్లీచేత మాటబడలేక
అయోధ్యరాముండుఅడవికి వేంచేసె.
సారంగధరుడెంత చక్కనీవాడు
చిత్రాంగివలలో చిక్కినాడమ్మా.
చిన్నదిమాఅమ్మి చంద్రగిరిమొగ్గ
తోడిబాలురగూడి చెండ్లాడివచ్చు.
దొడ్లోనుఅమ్మాయి దోగాడజూచి
దోసపండని ప్రజలుదోసిలొగ్గెదరు.
ముంగిటఅమ్మాయి ఆడంగజూచి
ముంతమామిడి అనిముసరుచిలుకలు.
పందిట్లోఅమ్మాయి ఆడంగజూచి
'పనసపండూ' అనిపరుగులెత్తెదరు.

ఆడబోయి అబ్బాయివచ్చెగాబోలు
అందెలచప్పుళ్లు ఆమెఅరుగులమీద.
బడికిబోయి అబ్బయ్యవచ్చుచుండెనుగా
పలకలచప్పుళ్లాయె పందిళ్లలోన.
ఆడబోయినచోట ఘాడదొరికినది
మాడకుమరిమాడ మద్దికాయల్లు.
మద్దికాయలుముద్దు మాటల్లుముద్దు
తప్పటడుగులుబెట్ట తాతలకుముద్దు
ఆడంగనూముద్దు పాడంగముద్దు
అమ్మా! యనీపాలు అడుగంగముద్దు.
ఏడువకు ఏడువకు వెలగల్లపట్టి!
యేడిస్తేనీకనుల మంచిముత్యములురాలు.
ముత్యములురాలితే ముద్దుగలుగదు
రత్నమురాలునే ముద్దుబాలకనుల.
జోలపాడుకృష్ణ! జోకొట్టురమణా!
నిద్రబోబలభద్ర! రాముచెల్లెలివి.
జోలల్లుపాడితే బాలులకునిద్ర
నాగసరమూదితే నాగులకునిద్ర.

౪

(సంపాదకురాలు) శ్రీమతి కొసరాజు సీతారామమ్మగారు

జోజోనంద జోకొట్టునందా
నిద్రబోబలభద్ర! మమ్ముగన్నతండ్రీ!
జోలల్లుబాడితే బాలలకునిద్ర
నాగస్వరంబట్ట నాగులకునిద్ర.
చిన్నవాడబ్బాయి చెన్నగిరిమొగ్గ
బాలలతోయాడంగ పసినిమ్మపండూ.
ఏడువకు ఏడువకు వెఱ్ఱిఅబ్బాయీ
ఏడిస్తెనీకళ్లు నీళ్లుగారేను.
పాలన్నగారవే బంగారుకళ్లా
చిన్ననాడబ్బాయిని సిరికొండకిస్తే
సిరికొండచిచ్చెట్టి మరికొండకొచ్చే
మరికొండమంటెట్టి మాయింటికొచ్చే.
అబ్బాయిఅయ్యలూ ఎటువంటివారూ
గంతబొంతలవారు గంగెడ్లవారు.
అబ్బాయిమామలూ ఎటువంటివారూ
గుబ్బగొడుగులవారు గుఱ్ఱాలవారు
ఎల్లగొడుగులవారు ఏనుగులవారూ.
జోలజోలలపండు జోలల్లపండూ
పల్లజోలలపండు పాపడబ్బాయీ
ఆయిగారింటికీ పోయివద్దామూ
అరటిపండ్లగుత్తి తీసుకొద్దాము.

ఆంధ్రదేశమునందలి వివిధప్రాంతములందు జోలపాటలు వివిధరీతుల పాడబడుచున్నవి. అందు కొన్నిటిని సేకరించి గృహలక్ష్మి గతసంపుటమున కొన్ని సంచికలయందును, నాలుగవసంపుటము ఈతొలిసంచికయందును ప్రచురించియున్నాము. మేముప్రచురించిన ఈజోలపాటలకు ఇతరములైనవానిని సేకరించి పంపి వానిని 'గృహలక్ష్మి' మూలమున లోకమునకు చేకూర్ప మాపాఠకురాండ్రను, పాఠకులను ప్రార్థించుచున్నాము. —సంపాదకుడు.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి తూములూరి సీతమ్మగారు

పట్టుపట్టు—
ఏమిపట్టు?
పెంకిపట్టు—
ఏమిపెంకి?
రణపెంకి—
ఏమిరణ?
పోరురణ—
ఏమిపోరు?
గాలిపోరు—
ఏమిగాలి?
సుడిగాలి—
ఏమిసుడి?
నీళ్లసుడి—
ఏమినీళ్లు?
మంచినీళ్లు—
ఏమిమంచి?
తలమంచి—
ఏమితల?

బట్టతల—
ఏమిబట్ట?
పట్టుబట్ట—
ఏమిపట్టు?
తెల్లపట్టు—
ఏమితెల్ల?
పాలుతెల్ల—
ఏమిపాలు?
ఆవుపాలు—
ఏమిఆవు?
పెద్దఆవు—
ఏమిపెద్ద?
బడిపెద్ద—
ఏమిబడి?
వీథిబడి—
ఏమివీథి?
రాజవీథి—
ఏమిరాజు?

కొక్కురాజు—
ఏమికొక్కు?
పందికొక్కు—
ఏమిపంది?
అడవిపంది—
ఏమిఅడవి?
చెట్టుఅడవి—
ఏమిచెట్టు?
మల్లెచెట్టు—
ఏమిమల్లె?
కాడమల్లె—
ఏమికాడ?
గరిటకాడ—
ఏమిగరిట?
ఉక్కుగరిట—
ఏమిఉక్కు?
నీముక్కు—

౨. పాటలు

## పిల్లల పాటలు

1. శ్రీమతి డి. తులసీబాయిగారు

దాదం దక్కచ్చి
దాదిగారమ్మాయి నీళ్లకుబోతే
రావే వడ్లసాని

చిలకతిన్నాపండు జీడిపండు
హంసతిన్నాపండు అరటిపండు
మాఅబ్బాయి తిన్నపండప్పాలపండు!

### 2. శ్రీమతి చావలి బంగారమ్మగారు

కొత్తపేటసంతలో కొత్తకోక
నామొగుడుతెచ్చేడు నక్కతోక
ఎల్లాగకట్టుకోను ఎత్తిమొగడ?
ముళ్లేసికట్టుకో ముళ్లముప్పి!
దేముడా! నీకన్ను మెల్లకన్నైతే
వూరివారందఱూ వుడికించగలరూ
సృష్టికర్తానీకు చూడకళ్లుంటే
నామొగుడువొల్లింత నలుపేమిచెప్పూ!

### 3. శ్రీమతి కాట్రగడ్డ సీతారత్నముగారు

(బాలికలు గంతులు వేయుచు పాడు పాట)

రుంగురుంగుబిళ్ల
రూపాయిదండ
దండగాదురన్న
తామరమొగ్గ
మొగ్గగాదురన్న
మోటికనీరు
నీరుగాదురన్న
నిర్మలబావి
బావిగాదురన్న
బచ్చలకూర
కూరగాదురన్న
గుమ్మడిపండు
పండుగాదురన్న
పాపడుమీసం
మీసంగాదురన్న
మిరియాలపోతు
పోతుగాదురన్న
పొలిమేరగట్టు
గట్టుగాదురన్న
గాడిదయిల్లు
ఇల్లుగాదురన్న
యీగలతుట్టె
తుట్టెగాదురన్న
తుమ్మెదమన్ను
మన్నుగాదురన్న
మంచిగంధపుచెక్క
కాలుదీసికడగబెట్టు
కావంచమ్మ.

### 4. శ్రీమతి కొండాలి లక్ష్మమ్మగారు

(బాలికలు కూడి విలాసముగా పాడు పాట)

కోకోలంక
కొండవలిలంక
లంకాతీసి
రాముడుపీట
ముత్తెంబియ్యం
ములగాచారు
గారకాయ
బీరకాయ.

### 5. శ్రీమతి గోగినేని రాఘవమ్మగారు

(బాలికలు విలాసముగా తిరుగునపుడు పాడు పాట)

కాకీకాకికాకి
కాకీనాకు దీపామిస్తే
దీపామెత్తుకెళ్లి అమ్మాకిస్తే
అమ్మానాకు అటుకులుపెడితే
అటుకులెత్తుకెళ్లి పంతులుకిస్తే
పంతులునాకు పద్యముచెపితే
పద్యమెత్తుకెళ్లి మామకుచెపితే
మామానాకు పిల్లానిస్తే
పిల్లాపేరు మల్లిమొగ్గ
నాపేరు కలకచేరు.

### 6. శ్రీమతి కొండాలి వేంకట నరసమ్మగారు

(బాలికలు కొంతమంది ఒకచోటగూడి కాళ్లుచాచి పాడుకొను పాట)

కాళ్లగజ్జి
కంకాణమ్మ
వేకులచుక్క
వెలగపండు
మామిడిమొగ్గ
మల్లెసారి
లింగులిటుకు
పండెమారిపటుకు
రాజుగారిదొడ్లో
ఏముందంటే
కవ్వురి
మవ్వురి
కాలుదీసి కడగబెట్టు
వత్తితిపండు
వత్తిలేనిపండు
దానిమ్మపండు
దబ్బపండు.

### 7. శ్రీమతి గోగినేని మహాలక్ష్మమ్మగారు

(బాలికలు విలాసముగా తిరుగుచు పాడు పాట)

ప్రొద్దున్నె లెగిసిందిబోడి
పొయిదగ్గర కూర్చుందిబోడి
చింతలకు పోయిందిబోడి
చింతాకు తెచ్చిందిబోడి
అందరికి పెట్టిందిబోడి
అందరిని ఛంపిందిబోడి
అదికూడ తిన్నదిబోడి
అదికూడ చచ్చిందిబోడి.

### 8. శ్రీమతి కొండాలి అన్నపూర్ణమ్మగారు

(బాలికలు ఒకచోటకూడి విలాసముగా పాడుకొను పాట)

చందమామ చల్లగుంటె
మాబఱ్ఱె పాలిస్తె
పాలెత్తుకెళ్లి తాతకిస్తె
తాతనాకు దమ్మిడీయిస్తే
దమ్మిడెత్తికెళ్లి కోమటికిస్తె
కోమటినాకు బెల్లంపెడ్తె
బెల్లంఎత్తుకెళ్లి పంతులుకిస్తె
పంతులునాకు పద్యంచెప్పితె
పద్యమెత్తికెళ్లి మామకిస్తె
మామనాకు పిల్లనిస్తె
పిల్లపేరు మల్లిమొగ్గ
నాపేరుచిటపటాలు.

### 9. శ్రీమతి కూనూరి కమలాకుమారిగారు

(బాలికలు ఉడుతపోవునప్పుడు చూచి సంతోషముగా పాడు పాట)

ఉడుతఉడుతఊచ్చి
సన్నాబియ్యంసాచ్చి
ఎక్కడికిపోతావూచ్చి?
తెనాలిపోతానుఊచ్చి.
ఏమితెచ్చావూచ్చి?
రెండు రవికెగుడ్డలు
తెచ్చినానుఊచ్చి.
ఏమిచేసినావూచ్చి?
బావకిచ్చానూచ్చి.
ఎక్కడతన్నేడూచ్చి?
ఎక్కడపడ్డావూచ్చి?
పొయిలోపడ్డానుఊచ్చి.

### 10. శ్రీమతి కొడాలి నాగరత్నముగారు

[బాలికలు కొంతమంది చేరి సంతోషముతో పాడుకొను పాట]

కొండమీదబీరకాయ కొయ్యనన్నది
అత్తతెచ్చినపట్టుచీర కట్టనన్నది
మామతెచ్చినమల్లెపువ్వులు గుచ్చనన్నది
వదినెతెచ్చినవంకాయ వండనన్నది
నట్టింటకాపురము చేయనన్నది
మఱిది తెచ్చిన మంచముమీద కూర్చోనన్నది
పొయిమీదపాలచుక్క త్రిప్పనన్నది.

3. భూగోళశాస్త్ర కథలు

# లోకమిత్రమహారాజు, అతనిసంతతియు

శ్రీమతి శ్రీపాద శారదాదేవిగారు

భూమమ్మకథ చదివిన పాఠకులకు లోకమిత్రమహారాజులుంగారి పేరు క్రొత్తదికాదు. ఆయనను గురించి వ్రాయబడిన ఈ వ్యాసము క్రొత్తవారలకు గూడ నిది ప్రాంతరగునట్లొనర్పకపోదు.

లోకమిత్రమహారాజువంటి తేజశ్శాలి మనభూలోకమున జన్మించియుండడు. ఆయనసంతానసంపద చూచి మురియనివారుండరు. ఆయనకు పిల్లలనేకులు పుట్టిరి. కాని పేరుప్రతిష్ఠలుకలిగి ప్రజలలో నిప్పటికిని చెప్పుకొనబడువా రెనమండుగురుకలరు. ఆయనకొక్కతెయే యాడపిల్ల. ఆమెయే భూమమ్మ.

ఆయన పెద్దకుమారుడు 'నెప్తునుడు'. వారి వంశాచారమునుబట్టి లోకమిత్రమహారాజులుంగారి బిడ్డల బిడ్డలకు అందరకును 'వెన్నెలయ్య' యను పేరు పెట్టుకొనుట వాడుకయైపోయినది. కనుక నెప్తునునికి వెన్నెలయ్య యను నొకకుమారుడు కలడు.

రెండవకొడుకు పేరు ఊర్ణునుడు. ఊర్ణునునకు నలుగురు వెన్నెలయ్యలుకలరు.

మూడవకొడుకు సుప్రసిద్ధుడైన మన శనిమహారాజుగారే. లోకమిత్రమహారాజుగారిసంతతిలో నితడు మొదటినుండియు మందముగా నడచుస్వభావముగలవాడనుకొని పౌరాణికులు ఇతనిని కుంటివాడని పిలుచుచుందురు. కాని యీయన సత్యచరిత్రమును పరిశోధించిన దైవజ్ఞులు శనిమహారాజొక బ్రహ్మాండమైన గొప్ప రాష్ట్రమున కధిపతియనియు, అతనిరాష్ట్రమునకు గొంతదూరమున నొకచుట్టుగోడ శత్రురాజుల కభేద్యమైనదిగా నిర్మించియున్నాడనియు, అతడు తనరాష్ట్రమును నిరంకుశముగా పరిపాలించుచుండుననియు మున్నగు సత్యవిషయములను వెల్లడించియున్నారు. ఆయనకు తొమ్మండుగురు వెన్నెలయ్యలుకలరు.

నాల్గవకుమారుని పేరు కుజాధిపతి. కుజాధిపతికి గూడ తొమ్మండ్రుగురు వెన్నెలయ్యలు కలరు. ఇతని తరువాత లోకమిత్రమహారాజుగారికి గలిగినసంతానము అపారముగానుండియు వారంద అనామకులు. ఇద మిద్ధమని చెప్పదగినంత వారి సత్యచరిత్రము ఇంకను కనుగొనబడమిచే వారిపేర్లు ఈలోకమున ప్రసిద్ధిగాంచలేదు. కాని వారిముద్దుమొగములు, వారిప్రసన్నవదనబింబముల నావరించిన తెల్లనికాంతులనుజూచి లోకులు ప్రతిరాత్రియు సంతసించుచుందురు.

అయిదవకుమారుడైన అంగారకమహాశయుడు దేహచ్ఛాయయందు గుంకుమపురంగుకలిగి యున్నందున బామరులైన ప్రజలీతనిని జూచి భయపడెడివారనిన నాశ్చర్యమేమి? అంగారకమహాశయునికి ఇద్దరు వెన్నెలయ్యలు గలరు.



శ్రీమతి మఫర్ల లక్ష్మీనరసమాంబగారు



శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు
(జెయిలునుంచి విడుదలయైనతరువాత తీసిన ఛాయాచిత్రము)



శ్రీమతి మదమంచి అనంతమ్మగారు




శ్రీమతి ఆచంట సత్యవతిమ్మగారు



శ్రీమతి కె. యన్ మూర్తిబాయిగారు



శ్రీమతి జొన్నలగడ్డ శారదాంబగారు



శ్రీ పొణకా కనకమ్మగారు



శ్రీ కోటమర్తి తాయారమ్మగారు

ఈయన తరువాతసంతానమే మనభూగోళశాస్త్రకథల ప్రశంసకు గారకురాలైన భూదేవి. అంత మంది మగపిల్లలకు మధ్యమున నొక్కతెయైన భూమమ్మయందు వారికిఁగల వాత్సల్యమహిమ చెప్పతరము గాదు. ఈమెకు వెన్నెలయ్యయను నొక్కఁడే ముద్దులకొమరుఁడు గలఁడని మరల నొకసారి చెప్పుచున్నాను.

లోకమిత్రమహారాజుగారికి శుక్రాచార్యులు ఏడవకుమారుఁడు. శుక్రాచార్యులు నీతిశాస్త్రపారంగతుఁడై దేవగురువైన బృహస్పతికి ప్రత్యర్థిగా నిలుచుండునని పౌరాణికులవిశ్వాసము. ఈయనకేమియు సంతానము కలుగనందున తత్సోదరులకు గలిగినట్లు ఈయనకొక వెన్నెలయ్యయైన కలుగుభాగ్యము లేకపోయెను.

ఎనిమిదవ కుమారుడును, 'మైనార్టి' వదలని కడగొట్టుకుమారుడును నగు బుధమహర్షి బుద్ధిని బృహస్పతికి సమానుఁడై మహర్షి బిరుదమునకు అన్నివిధముల దగినవాఁడనిపించుకొనెను. ఇతనియందు లోకమిత్ర మహారాజుగారికి అమితమైన ప్రేమగలదు. అందువలననే ఆయన యీతనిని తన సమీపప్రదేశమునఁ నొంటరిగా కాలక్షేపము చేయనిచ్చియు నితనియోగక్షేమముల నెప్పటికప్పుడరసికొనుచుండును.

పైనచెప్పిన లోకమిత్రమహారాజాగారి యొనమండ్రుగురి బిడ్డలలో గల సామాన్యగుణము వారు విడక తెగక పితృప్రదక్షిణవ్రతము నిరాఘాటముగా జరుపుచుండుటయే. వారి వ్యక్తివిశేషములనుగూర్చియు వారి నివాసస్థల విశేషమునుగూర్చియు మునుముందు తెలిపెదనుగాని ప్రస్తుతాంశమైన లోకమిత్రమహారాజాగారి విషయమును జెప్పెదను.

లోకమిత్రమహారాజుగారికి యుక్తవయస్సువచ్చునప్పటికి, విరించి, ఆయనకుదగిన వయోరూపగుణసమన్వితయగు ఉషాకన్యను వెదకితెచ్చి ఆయనకు ఇచ్చివివాహము చేసెను.

ఆయనకొకరథము, దానినిలాగుట కేడుగుఱ్ఱములు, వానిని దోలుటకు అనూరుఁడను నొక సారథిని మాత్రమే అత్తవారు పెండ్లిసమయమున ఇచ్చిన వరకట్నము. అనగా ఆయనయంతకంటె ఎక్కువ కోరలేదు. ఎక్కువ ఇచ్చినను ఇప్పటిపెండ్లికొడుకులవలెగాక వరకట్నముఅడుగుటకుగాని తీసికొనుటకుగాని ఆయనయెంత మాత్రము ఇష్టపడువాడు కాడు. ఆయన ప్రతిదినము తనభార్యతోఁగూడ రథముపై కూర్చుండి ఆకాశము (అవకాశము) ఉన్నంతవరకు విహారార్థమై వెడలి భువనక్షేమంకరుఁడై విలసిల్లుచుండును. అతనిరాకకు ప్రజలు, చంద్రునిరాకకై నిరీక్షించు చకోరములవలె నమస్కారములు చేయుచు గొందరును, అర్ఘ్యము విడుచుచు కొందరును అనేకవిధములుగాఁ గనిపెట్టుకొనియుందురు. వేయేల? కమలములు సహితము ఆమహారాజు దర్శనముకానిదే వికసింపనే వికసింపవట.

లోకమిత్రమహారాజుగారి కాంతిసంపద ననుభవించుచు వారియందు మనకుగల కృతజ్ఞతాభావ మనేక విధముల కనపరచుచు పాఠకులారా! మనమందర మాలోకసాక్షి యనుగ్రహము బడయుదముగాక!

## ౪. వినోదకథలు

---

## ఈగకథ

శ్రీమతి చేబోలు లక్ష్మీనరసమ్మగారు

అనగాఅనగా ఒక ఊళ్లో ఒకఈగ ఉండేది. ఆఈగ ఇల్లలుకుతూ పేరుమరిచిపోయింది. పేదరాసి పెద్దమ్మదగ్గరకువెళ్లి "పెద్దమ్మా, పెద్దమ్మా నాపేరుచెప్పవా" అంది. "నాకుతెలియదు నాకొడుకుని అడు"గంది. ఈగ వానిదగ్గరకెళ్లి "పేదరాసి పెద్దమ్మా, పెద్దమ్మ కొడుకా నాపేరుచెప్పవా" అని అడిగింది. "నాకుతెలియదు నాచేతిగొడ్డల్ని అడు"గన్నాడు.

ఈగ గొడ్డలిదగ్గరకెళ్లి "పేదరాసి పెద్దమ్మా, పెద్దమ్మకొడుకా, పెద్దమ్మకొడుకు చేతిగొడ్డలా నాపేరుచెప్పవా" అని అడిగింది. "నాకు తెలియదు. నేను తోట్లోనరికినచెట్టుని అడు"గంది. ఈగ చెట్టుదగ్గిరకెళ్లి "పేదరాసి పెద్దమ్మా, పెద్దమ్మకొడుకా, పెద్దమ్మకొడుకు చేతిగొడ్డలా, గొడ్డలినరికేచెట్టా నాపేరేమి"టంది. "నాకుతెలియదు. తోటవేయించినరాజుగారినిఅడు"గంది. "ఈగ రాజుగారిదగ్గరకువెళ్లి పేదరాసిపెద్దమ్మా, పెద్దమ్మకొడుకా, పెద్దమ్మకొడుకు చేతిగొడ్డలా, గొడ్డలినరికేచెట్టా, చెట్టువేయించినరాజా నాపేరేమి"టంది. "నాకుతెలియదు కొత్వాలుని అడు"గన్నాడు. ఈగ కొత్వాలుదగ్గరకెళ్లి "పేదరాసి పెద్దమ్మా, పెద్దమ్మకొడుకా, పెద్దమ్మకొడుకుచేతిగొడ్డలా, గొడ్డలినరికే చెట్టా, చెట్టువేయించిన రాజా, రాజుగారి కొత్వాలా నాపేరేమి"టంది. "నాకుతెలియదు. నేనుఎక్కేగుర్రాన్ని అడు"గన్నాడు. ఈగ గుర్రముదగ్గరకెళ్లి "పేదరాసిపెద్దమ్మా, పెద్దమ్మకొడుకా, పెద్దమ్మకొడుకుచేతిగొడ్డలా, గొడ్డలినరికినచెట్టా, చెట్టువేయించినరాజా, రాజుగారిక్రిందకొత్వాలా, కొత్వాలెక్కేగుర్రమా నాపేరేమి"టంది. "నాకు తెలియదు. నాకడుపులోఉన్న పిల్లని అడు"గంది. "పేదరాసి పెద్దమ్మా, పెద్దమ్మకొడుకా, పెద్దమ్మకొడుకుచేతిగొడ్డలా, గొడ్డలినరికినచెట్టా, చెట్టువేయించిన రాజా, రాజుగారికొత్వాలా, కొత్వాలెక్కే గుర్రమా, గుర్రంకడుపులో పిల్లా నాపేరేమి"టంది. అప్పుడు గుర్రంకడుపులోఉన్న పిల్ల ఈహి-హి-హి-హి-హి అని సకిలించింది. అప్పుడు ఈగ నాపేరు జ్ఞాపకంవచ్చిందని "ఈ—గ" అనుకుంటూ ఇల్లుచేరినది. కథకంచికెళ్లింది. మనమింటికొచ్చేము.

## కోడి కూత

శ్రీమతి కొత్త లోపాముద్రికమ్మగారు

అనగనగా వకవూళ్లోవక పేదరాలిపెద్దమ్మ వుండేది. తనకు తానుతప్ప ఆమెకు ఇతర బంధువులుయెవరులేరు. ఏమైనా డబ్బువుంటేగా బంధువులుంటానికి? పాపం ఆమెభర్త చనిపోయినప్పటినుంచి యేదోవకవిధంగా కాలంగడుపుతోంది. తోడు యెవరులేకపోవడంవల్ల చాలాకాలంనుంచీ వకకుక్కపిల్లను వకకోడిపుంజును ముద్దుగా పెంచుకొంటోంది ఆముసలమ్మ. బీదవాళ్లకువుండే లక్షణాల్లో యిదివకటి. ఎవరైనా బాటసారులు వంటచేసిపెట్టమని వస్తే వాళ్లకింత వండిపెట్టడము వాళ్లవల్ల తృణమో కణమో పుచ్చుకోవడం తాను తనపరివారం జీవిస్తోంది. యిట్లాకొన్నాళ్లు జరిగిపోయినతరువాత ఒకనాడు జబ్బుచేసింది ఆముసలమ్మకు. ఆజబ్బురావడంవల్ల చూచేదిక్కులేక పాపం యీలోకాన్ని వదలిపెట్టిందా ముసలమ్మ. ఆమె చనిపోయినప్పటినుంచీ ఆకుక్కకు కోడికి ఆహారందొరకడంలేదు. ఆహారంలేకపోవడంవల్ల కొన్నాళ్లుదుఃఖించి వకవుపాయంపన్నినవి ఆలోచించు. 'మనముబ్రహ్మదేవుణ్ణిగూర్చి తపస్సుచేద్దాం. అప్పుడు మనకు బ్రహ్మప్రత్యక్షమవుతాడు. అప్పుడు మనయిష్టమువచ్చిన వరములు కోరుకొనవచ్చును.' అని అవిరెండూ వకఅడవికిపోయి తపస్సుచేయడం మొదలు

పెట్టినవి. యిట్లా కొన్నిసంవత్సరాలు గతించిపోయినతరువాత బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై మీరు యేంకోర్తారో కోరండి అన్నాడు ఆరెంటికీ. నాకు రెండు ఎరువుపోగులను, సోలెడు జొన్నలను నిత్యముయిస్తే నాపిల్లలునేను బ్రతుకుతాంఅన్నదికోడి. సరేను అన్నాడు బ్రహ్మదేవుడు. కుక్కవంకకుతిరిగి నీవేమి కోర్తావన్నాడుబ్రహ్మ. నేనుయెవరియింటికిపోయినా నాకు పంచభక్ష్యపరమాన్నాలతో అన్నముపెట్టాలి అన్నదికుక్క. అప్పుడు బ్రహ్మ దీనిబుద్ధిని పరీక్షచేయవలెనని నీవు రెండువారములదనుక చెడుపదార్థములు యేవి తినకపోయినట్లయితే నీకుయీవరంయిస్తానని బ్రహ్మ అదృశ్యుడైనాడు. ఆలాగేనని అవి రెండుయింటికిపోయినవి. యిట్లావకవారం గడిచింది.

కం. కనకపు సింహాసనమున
 శునకముగూర్చుండబెట్టి శుభలగ్నమునం
 దొనరగ పట్టముగట్టిన
 వెనుకటిగుణమేలమాను వినరాసుమతీ!

అని పెద్దలు చెప్పినట్లుగా వకయింట్లో పాదరక్షలను సంగ్రహించింది ఆకుక్క. ఈసంగతి కనిపెట్టిందికోడి. 'యీకుక్క చూడు' అని బిగ్గరగా అరిచింది. బ్రహ్మదేవుడు వినుపించుకోలేదు. అమాట ఎప్పటికేనావినిపించుకోడాఅని కోడి యిప్పటికిని 'కుక్కచూడూ' అంటుంది. చాలారోజులనుంచి అనడంచేత 'కుక్కచూడూ, కుక్కచూడూ' రానురాను 'క్కొక్కొరొక్కో'గా మారింది.

## పులి అల్లుడు

శ్రీమతి బూ. కం. వెం. రంగనాయకమ్మగారు

అనగా అనగా ఒకబ్రాహ్మణుడు. అతనికి ఒక్కతే కుమార్తె. ఆబ్రాహ్మణుడు రోజూ తెల్లవారకట్టే లేచి స్నానంచేసి జపానికని ముక్కుమూసికొని కూర్చొనేవాడు. పిల్ల చిన్నదవటంచేత తెలియక పాపం తండ్రిని ముట్టుకోబోయేది. ఆవూళ్లో ఒక పెద్దపులి వుండేది. ఎవ్వరికిజోలికిపోకుండా అదిరోజూ ఈబ్రాహ్మని వాకిట్లోనుంచి అడివికి పోతూవుండేది. ఆపులినిచూచేసరికి పిల్ల జడుసుకొని ఏడుస్తూ వుండేది. పులంటే పిల్లకు భయంగావుండేది. కాబట్టి నిన్ను పులికిచ్చి పెళ్లిచేస్తా వుండు అని తండ్రితనను మైలబడేయటానికి వచ్చినప్పుడల్లా కూతుర్ని జడిపిస్తూవుండేవాడు. ఈ మాటలు ప్రతిరోజూ ఆదారినపోతూవుండేపులి వింటూనేవుండేది. కొన్నాళ్లకు పిల్ల పెద్దదైంది. పెళ్లిచెయ్యాలని తండ్రి సంబంధం కుదిర్చేడు. ఈసంగతి పులికి తెలిసింది. తెలిసి సరిగా బ్రాహ్మణుడింటికెళ్లి 'బ్రాహ్మణుడా! బ్రాహ్మణుడా! రోజూ నాకిచ్చి పెండ్లిచేస్తానంటూ వున్న నీకూతుర్ని ఇంకొకరికివ్వాలని ఆలోచిస్తూ వున్నావా? నాకివ్వకపోయినావా? చూడు మిమ్మల్నందరిని ఏమిచేస్తానో నాతమాషా' అందిపులి. అప్పుడు బ్రాహ్మణుడు పులికిజడిసి ఆ పిల్లను పులికిచ్చేశాడు. పెళ్లి కావడంతోటే పులి అత్తకీ మామకీ నమస్కరించి పిల్లనుతీసికొని వెళ్లింది. బ్రాహ్మణుని భార్య కూతురుగతికి ఎప్పుడూ చింతించుతూవుండేది. ఇంకేటిట్టయినా తిట్టకపోయినారా? పులికిచ్చేస్తానసే అనకపోతే అని మొగుణ్ణి కూడా అప్పుడప్పుడు సాధిస్తూవుండేది. నాకేం తెలుసు ఇట్లాఅవుతుందనిఅని అతడు అప్పుడప్పుడు ఏడుస్తూ వుండేవాడు. కూతుర్ని తలుచుకొని కొన్నాళ్లకి ఇతనిభార్య పిల్ల ఏమైనదో చూచిరండి, పెద్దపులి మింగిందో

ఇంకా బతికివుందో, చచ్చిందో అని కొంగుణ్ణి పిల్లవున్న అడవికి పంపింది. జడుస్తూ, జడుస్తూ బ్రాహ్మణుడు తప్పనిసరిగా వెళ్లేడు అడవికి. ఇతను అడవికి వెళ్లేసరికి అడవిలో ఒక పెద్దమేడ కనిపించింది. దాని తలుపు దగ్గరకు వెళ్లి తలుపు తట్టేసరికి అతని కూతురే లోపలనుంచి బైటికి వచ్చి తలుపు తీసింది. తండ్రి కూతుర్ని చూచి చాలా సంతోషించి ఇష్టాగోష్టిగా మాట్లాడుకుంటూ మీ ఆయన ఏమైనాడని అడిగాడు. అడవికి వేటకెళ్లేరు ఆయన అందికూతురు. వారు ఇట్లా మాట్లాడుకుంటూవుండగానే పులివచ్చింది. ఎక్కడ చంపపోతుందో తండ్రీనని చెప్పి అటకమీదకు అతన్ని ఎక్కించింది. "మామగారెక్కడ? నీవు అలా భయపడుతున్నావేం? మరేం భయంలేదులే సంగతంతా చెప్పు" అన్నది పెద్దపులి ఇంటికి రావటంతోటే. అప్పుడు తండ్రిని అటకమీదనుంచి మెల్లగా దింపి అల్లుడిదగ్గర నిలబెట్టింది పులి భార్య. "మామగారూ! అంతా క్షేమమా? ఏమిపనిమీద వచ్చినారు?" అని అడిగింది పులి. బ్రాహ్మణుడు గడగడ వణుక్కుంటూ "అంతా బాగానే వున్నాము. ఇట్లోగడవక తమ దర్శనంచేసికొందామని వచ్చా"నన్నాడు. అనగానే అల్లుడు ఒక గుమ్మడిగింజ ఇచ్చేడు. అది తీసుకొని బ్రాహ్మణుడు బయలుదేరి ఇంటికి వచ్చేడు. "భార్య ఏమయ్యా అమ్మాయి బ్రతికివుందా, పెద్దపులి చంపి వేసిందా ఎట్లావుంది అక్కడి సంగతి" అని అడిగింది. "ఏమిచెప్పేదును దాని భాగ్యము. నిక్షేపంలావున్నది. పెద్దపులి అల్లుడయినాడనే కష్టంతప్ప తక్కిన అన్ని విషయములలోను పిల్లకు ఏవిధమైన లోపములేదు. అల్లుడు మన అమ్మాయిని నెత్తినబెట్టుకొని పూజిస్తావున్నాడు. నేను వెడితే నన్నెంతమర్యాద చేశాడనుకున్నావు. ఏవిధమైన బెంగా మనకు అక్కరలే"దన్నాడు బ్రాహ్మణుడు. అయితే అల్లుడేమైనా బహుమతి ఇచ్చాడా అన్నది భార్య. అ ఒక గుమ్మడిగింజ ఇచ్చినాడు అని కొంగునవున్న గింజ భార్య చేతిలో బెట్టినాడు. "అంతభాగ్యం వుండి ఇదా మీకిచ్చింది" అని కోపంతో ఆగింజని అవతల పారేసింది భార్య. ఆగింజ దొడ్డిగోడవత్తుగా పడి కొన్నాళ్లకు మొక్కమొలచి ఒకవంతుపాదు బ్రాహ్మణుడింటిలోకి మూడువంతులుపాదు పక్కనున్న కోమట్లయింటిలోకి పాకింది. కాయలు విపరీతంగా కాశాయి. ఒకనాడు కోమటి కూరయేమీలేక చిన్నగుమ్మడి కాయకోసి బద్దలకొట్టేడు. కొట్టగానే దానినిండా వరహాలు. కోమటికి మహైశ్వర్యమైంది. మళ్లీ బ్రాహ్మణుడొచ్చి ఎక్కడ కాయలన్నిటినీ కోసుకుపోతాడో చెట్టుభాగం మందని పిందెలన్ని తెంపి బద్దలగొట్టి వరహాలనన్నిటిని పెట్టెలోపోసుకొన్నాడు. తెల్లారగానే లేచి మెల్లగా బ్రాహ్మణుడింటికెళ్లాడు కోమటి. వెళ్లి బ్రాహ్మణుడా! బ్రాహ్మణుడా! నీ దొడ్డిలో గుమ్మడికాయలన్నీ కోసి నాకియ్యి. నీకైతే వేదపావలాకన్నా ఎక్కువియ్యరు. నేను కాయకు రూపాయిస్తా అన్నాడు. డబ్బాసకు పాపం బ్రాహ్మణుడు ఒక్కకాయైనా తినకుండా అన్నీ కోమటికి అమ్మేడు. కోమటి అదృష్టమేంచెప్పను! కోటీశ్వరుడైనాడు దానితో. గుమ్మడి పాదు అఖరైందాకా కోమటే కొన్నాడు కాయలన్నిటిని. బ్రాహ్మణునికి అన్నాల్గురూపాయిలు కాగానే మళ్లీ దరిద్రంప్రారంభం. కొన్నాళ్లకు మళ్లీ కూతురింటికెళ్లాడు దరిద్రంతో బ్రాహ్మణుడు. అల్లుడు మామగారిని మర్యాదాచేసి ఊరకే మాచిపోవటానికొచ్చాడుగదాఅని అంతాక్షేమమాఅని అడిగి వూరుకొన్నాడు. "అంతాక్షేమమే. మీరిచ్చిన గుమ్మడిగింజ మొలేసినాను కాయలు విపరీతంగా కాశాయి. కాపుడిగింది. అవి వున్నన్నాళ్లు హాయిగావున్నాము మీదయవల్ల. మళ్లీ దరిద్రం ప్రారంభమైంది. తిండికిలేదు. ఇబ్బందిగావుంది." అన్నాడు మామ అల్లుడితో. "గుమ్మడికాయలన్నీ ఏమైనవి? నీవేతిన్నావా?" అని అడిగింది పులి. "నేను ఒక్కటైనా తినలేదు. తింటే ఏమొస్తుంది? అమ్ముకుంటే డబ్బయినావస్తుందని అన్ని అమ్ముకుని ఆడబ్బుతో ఇంత వరకు జీవనంచేశాము. కాయల అఖరైనవి. డబ్బూ అఖరైంది" అన్నాడు బ్రాహ్మణుడు. అయ్యో! ఎంతపని చేశావయ్యా! సరేలే! అయినదానికి విచారించటం ఎందుకు అవిఅన్ని బంగారుగుమ్మడికాయలయ్యా! ఇకనైనా జాగ్రత! నేనిచ్చేభరిణ ఎవ్వరికీయ్యకు. అమ్మకు. ప్రాణపదంగాదాచుకో. మూతతీసావా నీకు, నీవాళ్లందరికీ

కాకుండా ఎన్నివేలమంది జనమొచ్చినా మాతతీసివున్నంతసేపు అనేకపంచభక్ష్యపరమాన్నములతో పదార్థసమేతమగు భోజనము అనేకమంది నౌకర్లు చాకర్లు వచ్చివచ్చి వడ్డిస్తూవుంటారు. మూతమూసెయ్యటంతోటే అన్నీ మాయమవుతాయి. ఈభరిణ జాగ్రత్త” అని చెప్పి ఒకభరిణ యిచ్చింది పులి బ్రాహ్మణునికి. అదితీసికొని ఇంటికెళ్లి భార్యతో “ఒసే! ఈ మాటు మంచివస్తువు తెచ్చా! మనమిక వంట వండుకో అక్కరలేదు.” అనిచెప్పి తానూ భార్యా పీటవేసుకొని కూర్చొని భరిణమూత తీశాడు బ్రాహ్మణుడు. తియ్యటంతోటే అనేకమంది నౌకర్లు చాకర్లువచ్చి మహావైభవంతో అనేకపిండివంటలతో పదార్థసమేతమగు వంట తయారుచేసి బ్రాహ్మడికి అతనిభార్యకు హాయిగా భోజనాలు పెట్టేరు. మళ్లీ మూతవేశేటప్పటికి ఏమీలేదు. అట్లు హాయిగా కాలక్షేపం చేస్తూవుండేవాళ్లుండగ ఒకనాడు ఆవూరిరాజును భోజనానికి పిలిచేరు. రాజు చాలా ఆశ్చర్యపడి ఇదేమిటి ఈ అష్టదరిద్రుడు నన్ను భోజనానికి పిల్చేడు. ఏమిటో ఈ వింతచూద్దామని రాజు తనపరివారమంతటితో బ్రాహ్మడింటికి విందుకువెళ్లాడు. బ్రాహ్మణుడు చాలాసంతోషించి వచ్చినవాళ్లందరికి పీటలువేసి కూర్చోబెట్టి భరిణమూత తీశాడు. తీశేసరికి అనేకమంది వంటవాళ్లు, నీళ్లుతెచ్చేవాళ్లు, విస్తర్లువేశేవాళ్లు, నౌకర్లు అందరువచ్చి సమస్తపిండివంటలతో రాజుగారికి ఆయన పరివారానికి పదార్థసమేతమగు భోజనాలు పెట్టేరు. తరువాత భరిణమూత మూశేసరికి అంతా మాయమైంది. ఈసంగతంతా చూచేసరికి రాజుకు ఆశ్చర్యమై ఎట్లాగైనా ఆభరిణను కాజేద్దామనే దురుద్దేశ్యం ఏర్పడ్డది. సమయం చూస్తూవున్నాడు. కొన్నాళ్లకు బ్రాహ్మడింటికి రాజు నెమ్మదిగా ఒకనాడు వెళ్లి శాస్తుర్లుగారు ఏదండీ మీభరిణ? దానిని ఎట్లాతియ్యటం? ఎట్లామెయ్యటం? అని ఆకబురు ఈకబురుచెప్పి ఇప్పుడే చూచి పంపుతానని ఇంటికితీసుకొనివెళ్లేడు రాజు ఆభరిణెను. రాజుగదా దగాచేస్తాడాఅని ధైర్యంతో యిచ్చేటప్పటికి ఎంతమోసంజరిగిందో చూచారా! ఇవాళొస్తుంది రేపొస్తుంది అని యెదురుచూచిచూచి పాపం బ్రాహ్మణుడు ఆఖరికి తానేవెళ్లేడు రాజుదగ్గిరకు భరిణ అడిగితెచ్చుకుందామని. ఇతన్నిచూచినతోడనే రాజుమండిపడి ఎందుకొచ్చావయ్యాఅని అడిగాడు. అయ్యా! నాభరిణయిప్పించండి, పోతానన్నాడు బ్రాహ్మణుడు. నీభరిణ నేనెరగను నిన్నూనేనెరగనుపో అవతలికి అని నౌకర్లచేత గెంటించేడు రాజు. బ్రాహ్మణుడు పాపం అలో లక్ష్మణా అని ఏడుస్తూవెళ్లేడుఇంటికి. వున్నవాణ్ణి వున్నట్టుండక రాజునెందుకు తెచ్చిపెట్టుకున్నాను. ఎంతగతి పట్టింది. గుమ్మడికాయలా అల్లాతువరమైనాయి. భరిణాఇలా అయింది. మళ్లీ ఏమొఖంపెట్టుకెళ్లను ఆయన దగ్గిరికి. వెళ్లి ఏమనిఅడగనుఆయన్ను. అని ఏడ్చిఏడ్చి చివరకు ధైర్యంచేసి ఎల్లాగైతేనేం వెళ్లేడు అల్లుడింటికి. మామను చూట్టంతోటే కోపమొచ్చి ఏంకథఅన్నాడు అల్లుడు. జరిగినకథఅంతాచెప్పాడు మామ. నాలుగు చివాట్లేసి ఈ మాటొక దుడ్డుకర్ర ఇస్తా. ఎవళ్లయితే నీభరిణ, డబ్బు హరించారో వాళ్లదగ్గరకెళ్లి మంచిమాటలతో నీసొమ్మివ్వమని అడుగు, ఇవ్వనంటే దుడ్డుకర్రను వడ్డించమను, అప్పుడు నిన్ను అన్యాయంచేసినవాళ్ల రోగం కుదిరేటట్టు బుద్ధిచెపుతుంది అని అల్లుడొక దుడ్డుకర్రయిచ్చేడు మామకు. అదుడ్డుకర్రను ఇంటికితీసికెళ్లి ముందు కోమటిని తనకు రావలసిన డబ్బు యివ్వమని అడిగేడు బ్రాహ్మణుడు. యివ్వనన్నాడు కోమటి. దుడ్డా వడ్డించుఅన్నాడు బ్రాహ్మణుడు. అక్కడనుంచి కొట్టడానికి మొదలుపెట్టింది దుడ్డు కోమటిని. దెబ్బ లుపడలేక కోమటి బ్రాహ్మణునిసొమ్ము యావత్తు పైసలదగ్గిరనుంచి తెచ్చి దాఖలుచేశాడు. అక్కడికి వదిలింది దుడ్డు కోమటిని. అట్లాగేరాజుగారి దగ్గిరకెళ్లికూడా దుడ్డా వడ్డించమన్నాడు బ్రాహ్మణుడు. దుడ్డు రాజును చావకొట్టటం మొదలెట్టింది. అప్పుడు రాజు బ్రాహ్మణుని కాళ్లమీదపడి అతని భరిణెను అతనికి దాఖలుచేసి కావలసినంతడబ్బుయిచ్చి వదలించుకున్నాడు దుడ్డును. అక్కడనుంచి యింటికెళ్లి భార్యపిల్లలతో బ్రాహ్మణుడు హాయిగా తెలివితేటలతో కాలక్షేపం చేశాడు.

౫. బుద్ధిపరీక్ష

# యుక్తిలెక్క

[ఈ యుక్తిలెక్కను సమాధానము స్వతంత్రముగ నాలోచించి 12 సంవత్సరములకు లోబడిన బాల బాలికలు మార్చి 10-వ తేదీలోపున లేఖాముఖమున-లేఖలో వారివయసు, లెక్కయొక్క పూర్తిక్రియంగ చూపవలెను-మాకు తెలుపవలెను. —సంపాదకుడు.]

౧

శ్రీమతి ఎమ్. పద్మావతిగారు

ఒకనిదగ్గర రెండుసంచులలో కలిసి 22 రూపాయల మొత్తమువున్నది. ఒక సంచిలో రూపాయలసంఖ్య ఎంతవున్నదో అణాల పైసలసంఖ్యకూడ అంతేవున్నది. మరియొక సంచిలో పైసలసంఖ్యకన్న రెండింతలు అణాలసంఖ్యయు, అణాలసంఖ్యకు రెండింతలు రూపాయల సంఖ్యయువున్నవి. ఒక్కొక్కసంచియందెంత పైకమున్నది?

## గృహలక్ష్మి

శ్రీమతి సీరము సుభద్రయాంబగారు

గృహమునందు సిరిగజెలఁగి, భర్తయెదను
హత్తుకొని, నిజప్రియాత్మజుల వ
లనను వంశవృద్ధియొనరఁజేయు గృహల
క్ష్మి గృహలక్ష్మి యనఁగఁదగును గాదె?

శ్రీమీఱం గలశాంబుధింబొడమి, శౌరిన్ నాథునింగా బహు
ప్రేమంజేకొని, లోకమాతయయి, సాధ్వీరత్నమై, స్త్రీలకుం
దా మాంగళ్యమొసంగి, యర్థులకు నర్థంబుల్ ప్రసాదించుచున్
క్షేమంబుల్ కలిగించు విష్ణుగృహలక్ష్మిన్ నేను గీర్తించెదన్.

ప్రాలేయాచలకన్యయై, తపముచే ఫాలాక్షు మెప్పించి, సా
బాలాయీశుని మేనుదానుగొనుచున్ భద్రాంగియై, సర్వదా
స్త్రీలోకంబున సర్వమంగళయనంజెన్నొంది, భక్తాళికిన్
మేలుంగూరుచునట్టి శంభుగృహలక్ష్మిన్ నేను గీర్తించెదన్.

భావాతీతబహుప్రభావము జగద్భద్రాయమానంబునౌ
ప్రావీణ్యంబునఁ బద్మసంభవు చతుర్వక్త్రంబులందాడుచుం

దావిద్యల్ గలుగంగఁజేయుచుఁ, గవిత్వంబుంబ్రసాదించు వా
గ్దేవిన్, భారతి, బ్రహ్మదేవుగృహలక్ష్మిన్ నేను గీర్తించెదన్.

ఈరేడున్ భువనంబులందుఁ దనతో సీడౌలకుంజాలు స్త్రీ
లేరీ, భవ్యపతివ్రతాత్వమున నేరీ, యేరి? నా, నెవ్వరున్
లేరంచున్ నుతిగన్న స్త్రీజనమతల్లిన్, జ్ఞానముం దెల్పి సా
మీరింబ్రోచిన తల్లి, రాముగృహలక్ష్మిన్ నేను గీర్తించెదన్.

గర్వాంధుండగు దుస్ససేనుఁ డతిశంకాహీనుఁడై ద్రౌపదిన్
దుర్వారోద్ధతి నీడ్చి తెచ్చి వలువల్ దూయంగ దన్మానమున్
సర్వేశుండగు శౌరినిల్పెనను తచ్చారిత్రమున్ విన్నచోఁ,
జెర్వౌ గుండెయుఁ; బాండుసూను గృహలక్ష్మిన్ నేను గీర్తించెదన్.

ఆకాశంబున మానిన త్రకమునందాత్మేశుతో నున్న త
న్నే కల్యాణములందు దంపతులు తామీక్షించుచున్ మ్రొక్కు నా
లోకాచారము స్వీయపావనతఁ దెల్పుంగాదె? సౌభాగ్యను
శ్రీకిందావగు నావసిష్ఠు గృహలక్ష్మిన్ నేను గీర్తించెదన్.

పాతివ్రత్యవిశోధనాత్మయుతులా భర్గున్, హరిం, బద్మజుం
జాతుర్యంబునఁ జిన్ని బాలురుగ నాశ్చర్యంబుగా మార్చినన్,
భీతిన్ గౌరియు, శ్రీయు, శారదయు దద్భిక్షుండనున్ వేఁడఁగాఁ
జేతోమోదము గూర్చు నత్రిగృహలక్ష్మిన్ నేను గీర్తించెదన్.

అతఁడల్పాయువటం చెఱింగియును గాసంతైనఁ జింతింపకే
పతిగాఁబొంది, పతివ్రతాత్వమునఁ దత్ప్రాణంబులంబ్రోవ, న
ద్భుతమైనట్టి విధంబునన్ యమునితోఁ బోరాడుచున్ భర్తను
మృతిదప్పించిన సత్యవంతుగృహలక్ష్మిన్ నేను గీర్తించెదన్.

సత్యంపున్ నుడికై పురంబు, సిరినిన్, సౌఖ్యంబులం, బుత్రకుం,
గృత్యంబంచెడఁబాయు నాధుకోలకై యెన్నేని గష్టాళిఁ దా
నత్యంతంబును బొంది, భక్తియుతయై, యాత్మేశు సేవించు నౌ
చిత్యంబూను త్రిశంకుపుత్రుగృహలక్ష్మిన్ నేనుగీర్తించెదన్.

ఇంద్రాదుల్ తనుఁగోరి ధారుణికిఁ దామే తెంచి ప్రార్థించినన్,
సాంద్రప్రేమ నలున్ వరించె, సురలన్ సద్భక్తితో వేడి, యా
చంద్రార్కంబగు కీర్తి నిల్పెఁబతికిన్ సాధ్వీలలామంబు: భూ
మీంద్రుండౌ నిషధాధినాధుగృహలక్ష్మిన్ నేను గీర్తించెదన్.




శ్రీమతి పాకల రత్నమాలగారు

పొందంగ "రాగుంజ పోగుంజలాట" చప్పట్లు వెట్టెడుసరిగుంజలాట"
"కుందెనగుడి" "గుడిగుంచంబులాట" "చేరబొంతలయాట" "చిట్లపొట్లాట"
"అప్పల విందులయాట" "పల్మ్రాలు "గోరెంతలాట" "దాఁగుడుమూఁతలాట"

—బసవపురాణము.

అని ప్రాచీనాంధ్రమహాకవులలో నొకడగు పాల్కురికి సోమనాథుడు మన బాల బాలికల ఆటలను కొన్నిటిని పేర్కొనియున్నాడు. ఈయాటలు ఆడబడునపుడు పాడుటకు ప్రత్యేకము పాటలుకొన్ని మన వాఙ్మయమున ఏర్పడినవి. ఈపాటలు ఎంతకాలమునకు పూర్వము రచియింపబడినవో చెప్ప వలనుపడదు. మిక్కిలి ప్రాచీనకాలమున రచియింపబడినవనుటకు సందేహములేదు. ఇవిమన జాతీయతకు ఒకచిహ్నము. ఈఆటలకు సంబంధించిన సారస్వతము ప్రచురణమునందవలసియున్నది. ప్రచురించుటకు గృహలక్ష్మిపత్రికాధిపతులు సదవకాశమునిచ్చియున్నారు. కావున సారస్వతాభిమానులు ఈవిషయమై శ్రద్ధ వహించెదరు గాకయని కోరెదను. "చిట్లపొట్లాట" "చిటికెలు మెటికలాట" అను రెండు ఆటలకు సంబంధించిన పాటలను సేకరించి నేనిచ్చట నిచ్చుచున్నాను.

చిటికెలు మెటికలాట

చిటికెలుమెటికెలు
బూటకనకాస్
అంబకుడిల్లకు
బెండకాయ్‌బస్
వడిమోరోచో
చచ్చుడో, చో.

చిట్లపొట్లాట

చిట్లపొట్లకాయ
చీమనెల్లికాయ
గోడపుచ్చకాయ
గొమ్మనెల్లికాయ
ముసుచుకోమీనాక్షీ.

# కీ. శే. మోతీలాల్ నెహ్రూ

శ్రీమతి జాలూరి తులసమ్మగారు

౧

ఘనత భారతమాత కన్ననాయకులలో నగ్రగణ్యుఁడవౌచు నలరినావు
భారతీయులకుఁదోడ్పడనెంచి కష్టించి సర్వస్వమర్పింపఁజాలినావు
భావిహిందూరాజ్యపాలనారీతి ధీపటిమ నీవారి కేర్పరచినావు
చిరతరదారిద్ర్యచింతలనెడలించి సిద్ధాన్నకటకంబుఁ జేసినావు
అస్తమించుటతగదయ్య యయ్య! యిపుడు
పంటముఖ మెనచేనిని పరులపాలు
చేసినట్టికృషీవలు స్థితిదనర్ప
బాసిపోయితె భారతభాగ్యభూమి.

ఘనతరసద్విద్యగాంచి సుదీక్షతో విమలమనీషను వెలసినావు
ఇంద్రభోగంబుల కెనయగుసుఖములఁ దులదూగిసిరులతో జెలఁగినావు
విపులవైరాగ్యవిద్యాపాటవముమించ సద్భుతత్యాగివై యలరినావు
సరసవాక్పటిమ నేసభనైన విజయసంశీలత్వమును బొందఁజాలినావు
సర్వవిధముల నినుఁబోల జాలినట్టిఁ
మాన్యుగనలేదు భారతమాతృదేవి
దొలగుటెట్లామె కీపుత్రదుఃఖ మకట!
మోతీలాల్ధీరరత్న! యమోఘయత్న!

గాంధికి దక్షిణకరమనిపేరొంది ఘనకార్యములదీర్పఁ గడగినావు
అకట త్రిశతకోటిహైందవచిత్తాబ్జభానుండవై ధరప్రబలినావు
మెట్టియిక్కట్టుల పట్టుననైనను భూరియూర్జవదీక్ష బూనినావు
ఆడంబరం బిసుమంతయెందును లేక శాంతితో సమరంబు సల్పినావు
స్వర్గరాజ్యముపాలించి చక్కఁబఱుప
నరిగినాడవు భారతీయాంబవిడచి
యెచటనుండిననీకు లోటింతకలుగ
దకట! మాలోపమికఁ దీఱదంతెకాని.

భారతమాత తపోభాగ్యగరిమచే కడుపునచల్లగ గనినబిడ్డ
నతి సురూపారాజ్ఞి సంకల్పసఫలతగావించు దేవు డీఘనయశుండు
కొడుకుపై నరలేని కూరిమినింపుచు 'బిడ్డ! రారా' యని పిల్చుతండ్రి
ప్రాణమేనియునిచ్చి పరితృప్తియొనరించు మెలకువగలయట్టి మిత్రవరుఁడు

తల్లియును దార తనయుడు దవిలినేస్తు
లేడ్వ నెహ్రూను గొనిపోతివేమి సెప్ప
నెందఱనుదింటివో నిండ దేమికడుపు
కాలమా! యుచ్చనీచముల్ గలవెనీకు?

కట్టా? దైవమ; మోతిలాల్ నెహ్రూడా గన్పించెనే నీకినీ
పట్టె భారతజాతికెల్ల శుభసంపాద్యంబె గావించువా
డిట్టె పొట్టనుగొంటి వయయో యీనిందబోదింక నీ
కట్టెసంభువికీర్తి మాయుజుమి నిన్నేమందునే రక్కసీ!

గుండెలవిసెను నీపోకగూర్చివినిన
నట్టుడికినట్లు లుడికిపోనయ్యె జగము
కీర్తిగాకింక లేదెనీమూర్తిగనుట
వెన్నపడవైచి వ్రేల్నాకువితముదోఁప.

భారతిమాత! చింతిలగఁబాడియె కజ్జలధార చెక్కులన్
జాఱ మహాపదన్ బడి విచారపుసింధువుదోఁగకమ్మ యే!
వారికి మృత్యుకృత్యమనివార్యము చింతను జేలలైననీ
కూరిమిబిడ్డలంగను మకుంఠితవీర్యవిశాలతేజులన్.

౨

## శ్రీమతి పండిటి వీరరాఘవమ్మగారు

మోతీలాలు జీవితము అంగసౌష్టవమును, రసపుష్టియుఁగలిగిన ఐదంకములనాటకము. 1861-వ సంవత్సరములో ఢిల్లీనగరమున జననము. మ్యూర్, సెంట్రల్ కాలేజీ, అలహాబాదులో విద్యార్జనము. కాన్పూరు, తదుపరి అలహాబాదులో న్యాయవాదివృత్తి. ఇది మొదటియంకము.

ఆనాటినెహ్రూ వేరు. న్యాయవాదులలో నాయకమణియని పేరుగాంచెను. పొలన కైదులక్షలార్జించుచుండెను. శ్రీమంతులతో-ధీమంతులతో-ఉన్నతోద్యోగులతో నెయ్యము నెఱపుచుండెను. ఆనందభవనములోసుపుత్రవంతుడై సకలసంపదలతో తులదూగుచుండెను. అతనివస్త్రములనుతుకువారు ప్యారిసుచాకలులు; అతని పుత్రునకు విద్యగఱపునది కేంబ్రిడ్జి కళాశాల; అతనివిందులారగించువారు ఐ. సి. యస్. ఉద్యోగులు. అతనికి చెల్లనికోర్కెలేదు. తీరనివేడుకలేదు. అతడే మహాభోగినెహ్రూ.

ఇంతలో భారతదేశమున ఆకస్మికముగ ఒక నూతనవాతావరణము పొడసూపెను. దానినందుకొని నెహ్రూపండితుడు అమృతసరుకాంగ్రెసున కాధిపత్యమువహించెను. కార్యక్రమమును సూచించి సేనానియై సమరము సమీక్షించుచుండెను. అంతకంతకు సమరము సంకులమగుచుండెను; ఇక నెహ్రూ సహింపజాలక పోయెను. సేనాని సైనికుడై యుద్ధరంగమున కురికెను. న్యాయవాదివృత్తిని విరమించెను. సౌఖ్యసంపదలను విసర్జించెను. ప్యారిసుపుట్టముల పారవైచి ముదుకఖద్దరుతో ముదుసలియోధుడు సమరమునకు బూనెను.

కా తనకు ఇల్లు లేదు, వాకిలి లేదు; ఆలు లేదు, ఆస్తి లేదు; అధికారము లేదు, ఆసక్తి లేదు. ఇతడే అఖండత్యాగి నెహ్రూమహాశయుడు.

*1922*-వ సంవత్సరముతో నెహ్రూజీవితమున మూడవ అంకము ప్రారంభించెను. జాతీయనాయకులందరు చెఱసాలలో చిక్కిరి. చెక్కుచెదరక వారితో గూడ వారిసైనికులందరు చెరల నాక్రమించిరి. ఇంక బహిరంగముగ పోరాడుటకు తగినంత సాధనసంపత్తి లేదు. ఐనను సమరము సమాప్తి చెందుటకు వీలు లేదు. 'బార్డోలీలోని విశాలములగు పొలములలో బదులు, ఢిల్లీనగరములోని శాసనసభాభవనమున పోరాడుదము: ప్రతిపక్షుల శక్తిని బైటనుండి పగులగొట్టుటకు బదులు లోపలనుండి గుల్ల చేయుదము.' అని స్వరాజ్యపక్షమును నిర్మాణము చేసి, దానికి నాయకుడై ప్రభుత్వపు కూటమి నెదిరించి, ఎత్తునకు పై ఎత్తు వేసి వారి పన్నుగడలను పగులగొట్టెను.

1923 నుండి 1929 వరకు భారతశాసనసభ చరిత్ర మోతీలాలుగారి దూరదృష్టిని, చాతుర్యమును, రాజకీయ పరిజ్ఞానము, నాయకత్వపు నిపుణతను చాటుచున్నది. అతడు చర్చించని సమస్య లేదు. ఎదుర్కొనని అక్రమ చర్య లేదు. మారకపుధర నియమించుచో మోతీలాలు తన గాంభీర్యోపన్యాసముతో స్వపక్షము వారిని, పరపక్షము వారిని ఆశ్చర్యనిమగ్నుల చేసెను. ఉప్పుపన్ను నిరాకరణమున నెహ్రూ తన ఆవేశముచే సభనంతటిని రగుల్కొల్పెను. కోస్తా వ్యాపారము విషయమున తన ప్రజ్వలితదేశభక్తిచే ప్రతివాదులను తల్లడిల్ల జేసెను. 1923 నుండి 1929 వరకు నెహ్రూ భారతీయుల భారము తానొక్కడే వహించి దేశీయులకు విశ్రామ మొసగెను. ఈ వ్యవధిలో స్వాతంత్ర్య సైనికులు కోలుకొని 1929 సరికి మరల సంకులసమరమునకు సంసిద్ధులైరి.

ఉప్పొంగుచున్న ఉత్సాహముతో "ఇక చిల్లర బేరములకు తావు లేదు, సంపూర్ణ స్వాతంత్ర్యమె మన మసంపాదింపవలె"నని యువకులు ఘోషించిరి. దానితో జాతీయవాదులలో చర్చలు చెలరేగెను. భారతాశయములకు గమ్యస్థాన మెయ్యది? డొమినియను విధానమా లేక పరిపూర్ణస్వాతంత్ర్యమా? ఈ క్లిష్టసమస్యను తీర్చగల సమర్థుడెవడు? మరల దేశమంతయు నెహ్రూవంక దృష్టి సారించెను. అతడే మరల సూత్రధారియై స్వరాజ్యరథమును నడపవలెనని భారతీయులెల్లరు ఏకగ్రీవముగా ఘోషించిరి. తదనుసారముగా పౌరుల జయధ్వనులు, బుధజనుల స్వస్తివాక్యములు, నానావిధమంగళవాద్యములు, విజయఘోషములు నీభూమండలమునింప ముందువెనుకలను జాతీయపతాకములను గేలబూని జాతీయగీతముల పాడుచు బారుబందీరి స్వచ్ఛంద సేవకులు నడువ, ఇరుప్రక్కలను సర్వాలంకృతులగు అశ్వికులు సాగుచుండ, నలువదిగుఱ్ఱములబండిలో ఊరేగి మహావైభవముతో నెహ్రూ కలకత్తా కాంగ్రెసు గద్దెనెక్కెను. అచ్చట భారతీయుల ఆశయములను, స్వరాజ్యపీఠను కుంటువోని శక్తితో లోకమునంతటికిని జాటెను. "ఒక సంవత్సరములోగా డొమినియను ప్రతిపత్తి నొసగవలెను. అటుగానిచో భారతీయులు బ్రిటిషువారితోడి సంబంధమును మొదలంట త్రెంపుకొందు"రని శౌర్యపూరితమగు భారతసందేశమును ఇండియామంత్రికంపెను. తదనంతరము బర్కెనుహెడ్ ప్రగల్భములకు ప్రత్యుత్తరముగ భావిభారతరాజ్యాంగప్రణాళిక సిద్ధముచేసెను.

ఇక వైద్ధవయుంకము చరమదశ. పండితునకు 68 వత్సరములు నిండిపోయెను. అనవరతకృషివలన శరీర పటుత్వము ఇంచుక సడలెను. క్షయవ్యాధి ఈ వృద్ధవీరుని పీడింపజొచ్చెను. రాజకీయరంగమునుండి విశ్రాంతి అత్యవసరమయ్యెను. కాని అందువలన జాతీయసమరమునకు మాత్రము అంతరాయము కలుగగూడదు. తన ధర్మముల నిర్వహించి తన సమరమును సాగించు బాధ్యతను అతడు కార్యధురీణుడు, స్వరాజ్యయోధుడు, పుత్రుండు జవహరిలాలుపై నిడెను. లాహోరులో కాంగ్రెసుసింహాసనమున నాతని పట్టభద్రుని జేసి తనభారము వదలుకొనెను. నాటినుండి వానప్రస్థమున నుండు రాజపుంగవునివోలె స్వయముగ వ్యవహారములను చక్కబెట్టుకున్నను పెదదారిని బోకుండ కుమారుని మందలించుచు ప్రోత్సాహపఱచుచు దారిజూపుచు కాలముగడుపు

చుండెను. కాని ఆ తేజస్విలో శక్తులింకను అణగిపోలేదు. శరీరదార్ఢ్యము సడలినను మనోబల మినుమడించెను. ముదిమివచ్చినను ఆ పెదవులలోని పట్టుదల సడలలేదు; ముడుతలుపడినను దవడలలోని ప్రతిఘటనశక్తి తగ్గలేదు; గుంటలువట్టినను ఆ కండ్లలోని జ్వాల కృశింపలేదు; ఆవిశాలఫాలములోని అపమానవతీక్ష్ణత మందగింపలేదు. 1930 లో గాంధిమహాత్ముడు ఉప్పుచట్టముపై దాడిచేసెను. అతని రణభేరి వృద్ధసింహము సైతము వినెను. సపుత్రసబాంధవముగ సంగ్రామరంగమున కురికెను. జైలుకుపోయెను. రోగగ్రస్థుడై బయటకువచ్చెను. నాటినుండి పక్కబట్టి తుదకు ప్రాణములు విడిచెను. కాని తుదయూపిరిలో జయభేరీ ప్రోగించియే ఆశూరుడు జనెను. "స్వరాజ్యమును స్థాపించితి" మని సగర్వముతో సైతము నిర్యాణమొందెను. అట్టిపోరాటము ధన్యము. అట్టిజీవితము ధన్యతరము. అట్టిమరణము ధన్యతమము.

అఖండభోగి-అద్వితీయత్యాగి-అసమానరాజ్యతంత్రజ్ఞుడు - స్వార్థరహితుడగు భారతపుత్రుడు - తేజోమయజాతీయనాయకుడు-నిర్మలప్రజాసేవకుడు; అతని జీవిత మొక జాతీయగీతము!!!

## వియుక్త

శ్రీమతి పాటిబండ వేంకటఅలమేలుమంగతాయిగారు

౧

"ఏమటులొంటిమై బొగిలె
దీభయదాటవిలోన? ఈడరా
నేమికతమ్మొ? ఈపాదల
నీమృగపంక్తులంగాంచ భీతిలే
దో? మఱిసుంత దుఃఖమటు
ద్రోచి, వచింపుము నీచరిత్ర నీ
సేమము పొంటెపాటుబడి
చేయుగలంతయు చేతుమంగనా!
నీపతి నీవు హాళికి వ
నీస్థలికిన్ జనుదెంచి యీడ నీ
తోపున దప్పిపోయి కను
దూరమునంగల భర్తజాడగా
నోపక కుందుచుంటివ?
అహో! ఇకనేమన? మందబుద్ధి యా
పాపపుబ్రహ్మవ్రాలు మగువా!
ఇటులుండె లలాటపట్టిపై.
సిగ్గుచేబోయి పొదరింటి చెంతజేరి
దాగెదో? నిన్నుగాంచ మాత్రముగాదు.
కచములెయ్యవో? తుమ్మెదగములవేవో?
కరచరణములవేవో? తలిరులవేవో?
తీవలెవ్వియొ? నీదుమైతీవయేదో?
గుర్తుపట్టంగలేము పోకమటుసుంత."

౨

"కాననా కూతవేటుదూరాన విభుడు
బిగ్గరగ కేకవేసి యరాపెదనటన్న
నాధుకలకంఠకంఠంపునాదుపంచ
మస్వరముమించ దీపికాళీస్వరాల
నెట్లు నాకంఠరవము గుర్తించువిభుడు?
చప్పటుల్ గొట్టి పిలుతుగా స్వామినన్న
హస్తపల్లవములు ధ్వనియగుటలేదు.
వడివడింబోయి కలియగావచ్చునన్న
కుచజఘనఘనభారమెక్కుడయి పాదు
మందయానమ్మొకండు సంప్రాప్తమయ్యె
దృష్టిపథమున నాధుమూర్తి నెలకొల్పి
చూచుచుకబోయి చేరవచ్చుననుకొన్న
చంచలాక్షమ్ములకు నిల్వరించలేను."

# శారదలేఖలు

## సౌభాగ్యవతియగు కల్పలతకు

నెచ్చెలీ! నేను నీకొక శుభవర్తమానము తెలియజేయుభాగ్య మొదవినందులకు నాకు మిగుల సంతసమగుచున్నది. ఏమన? ఏపత్రికాకుమారి మూడువత్సరములనుండి మనలేఖా ప్రచురణభారమువహించి మన యుత్తరప్రత్యుత్తరములను నిర్నిరోధముగా జరుగునట్లు తోడ్పడుచున్నదో, ఏపత్రికాకుమారి మనయాంధ్రమహిళామణుల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుటకై కంకణము ధరించి పాటుబడుచున్నదో, ఏపత్రికాకుమారిపై మన యాంధ్రులెల్లర కెనలేనిమక్కువయో అట్టిపత్రికాకుమారియగు మన గృహలక్ష్మికి నేడు పుట్టినదినముపండుగ. కావున మనకీదినము సుదినము. ఆపత్రికాపుత్రికి ఆశీర్వచనములంపవలసినదినము. ఆమె శైశవవిహారములను దలంచి యానందింపవలసినదినము. ఆమె సర్వాంగ సౌందర్యమునుగని ముద్దులాడవలసిన దినము.

కల్పలతా! 1928-వ సంవత్సరము మార్చి ఒకటవ తేదీని గృహలక్ష్మి కేసరికుటీరమున జన్మించినది. పురిటిబిడ్డయగు గృహలక్ష్మి యపుడు అఱమూతకన్నులతో, పిడికిలి పట్టినచేతులతో, ఒడలునిండిన ముడుతలతో, మొగమును గప్పిన ముంగురులతో శరీరమంతయు కుంచించుకొని యొత్తిగిలి పడుకొనియున్నది. ఆంధ్రమహిళాప్రయోజనంబులకై యుదయించిన పత్రికాపుత్రికలెల్ల పురిటిలోనే సందుకొట్టిపోవుటయు, లేదా పాలనవత బిడ్డవలె నాదారుగా ద్రవ్యముయొక్క లేబరమున పెంపుసొంపులు లేక కొన్నాళ్లుండి కడముట్టుటయు సర్వసాధారణమగుటచే ఈగృహలక్ష్మి భవితవ్యమునుగూర్చి గూడ అత్యధికమగు నిరాశ నామనంబున నావరించియుండెను. కాని పత్రికాపుత్రికలపై నాకుగల సహజమైన ప్రేమచే ఆమె జననమునకు మిగుల సంతసించినదాననై 'కుమారీ! నీవైన చిరంజీవివై వర్ధిల్లి మాయలమటదీర్తువుగాక!' యని మనఃపూర్వకముగా నాశీర్వదించిముద్దాడి ఆమెశైశవ క్రీడాకలాపంబుల నరయ మహోత్కంఠతో నెదురుజూచుచుంటిని. అయితే నిత్యము జూచువారికి బిడ్డలనెలలబలుపును గుర్తించుట కష్టముగదా! ఆకన్గవయెప్పుడు విప్పారి విశ్వవిలోకనంబునకు దొరకొనెనో, ఆపిడికిళ్లెప్పుడు విడివడి సర్వవస్తు వితతిఁబిడికిటఁబట్టనేర్చెనో! ఆశరీరమెప్పుడు ముడుతలుదీఱి స్నిగ్ధసుందరమై తనరారెనో, ఆతొగరు పెదవులపై మొలకనవ్వులెప్పుడు తొలకాడెనో, ఆజిహ్వాగ్రంబు మనోజ్ఞమధురభాషణంబుల కెపు డుద్యోగించెనో, తెలియదు. క్రమవికాసముయొక్క సుముహూర్తమును నిర్ణయింప సాధ్యముకాదుగదా! ఒక్కసంవత్సరములో గృహలక్ష్మి ఆంధ్రుల కల్లారుముద్దయినది. నేడాంధ్రమహిళలు తమ బిడ్డలను ఆటలకు బోవిడిచి గృహలక్ష్మిని ముద్దులాడుచున్నారనినచో అతిశయోక్తికాదు.

కల్పలతా! నీవు చూడలేదు గాని మొన్న మచిలీపట్టణమున గూడిన రాష్ట్రీయ మహిళాసభలో మన ఆంధ్రసోదరీమణులు గృహలక్ష్మిపై జూపిన అభిమానము, ప్రేమ

యేమని చెప్పుదును? గృహలక్ష్మి నెలకొకమారు గన్పడుటచే మాకు తృప్తిగలుగుటలేదు. కాన వారవార మామె దర్శన గలుగు నవకాశమొసంగుడని యామె జనకునకు కబురంపుద మని కొందఱు, అబ్బా! వారమున కొకమారా చాలదుచాలదు దైనందిన మామె దర్శన, స్పర్శన, సల్లాపసౌభాగ్యంబబ్బ వేడికొందమని కొందఱు యీవిధముగా వాదులాడు కొనిరి. ఆసమయంబున ఆనారీమణులుచూపిన యుల్లాసోత్సాహములుగని అహో! మన గృహలక్ష్మి మూడేండ్లలో నెంత జనాదరణబడసినది? అని నాలో నేనాశ్చర్యపడితిని. కల్ప లతా! మన గృహలక్ష్మి యింత జనానురాగమును బడయుటకు కారణము లేకపోలేదు. గృహలక్ష్మి పూర్వజన్మమున సిరిగలయింట బుట్టవలెనని చిటిబొట్టు నోముపట్టి శ్రీగారును ప్రార్థించినదో ఏమో! ఆమెకోరిక దీఱినట్లు శ్రీమంతులయింటబుట్టినది. ఇఁక నామె కేమి కొదువ? తియ్యనితిండ్లు! మెత్తనిశయ్యలు! మేలైనదుస్తులు! ప్రశస్తములైన అలంకారములు! ఇట్టిపోషణసౌకర్యముగల బిడ్డలుమేల్మిబంగరువలె మెఱుగులీనుచుండరా? తెలివితేటలు గల చక్కనిబిడ్డలనుచూచిన నెట్టివారికైన ముద్దేగదా! కావుననే అల్పకాలములో గృహలక్ష్మి ఆంధ్రుల మనంబును జూఱగొన్నది. ఆమె ముఖావలోకన మాంధ్రమహిళల కకాలసుధా కరదర్శనమైనది! ఆమె దరహాసజ్యోత్స్న లాంధ్రగృహదీపికలైనవి. ఆమెపలుకుచిలుక లాంధ్రహృత్పంజరనివాసములైనవి. ఆమె గమనవేగము యావదాంధ్రదేశమునుజుట్టి వచ్చుటయేగాక దేశాంతరఖండాంతరాంధ్రజనసందర్శనాసమర్థంబయి తనరారినది. ప్రాచీ నులను నవీనులనుగూడ నామె సమాధాన పెట్టుచున్నది. బాలలను వృద్ధులనుగూడ నామె రంజిలపజేయుచున్నది. స్త్రీలకు పురుషులకుగూడ నామె ప్రేమభాజనమగుచున్నది. వేయేల? "పలుకుల, నగవుల, నడవుల, నలుకల, నవలోకనముల" నఖిలాంధ్రలోకమును స్వాయత్తము గావించుకొని స్త్రీల ఆరోగ్యసౌభాగ్యముల పెంపొందించుటకై యుదయించితినను స్వవచ నమును స్వాభివృదిచేతనే గృహలక్ష్మి లోకమునకు విశదీకరించుచున్నది. నెలనెలకు క్రొత్త యుడుపులు; క్రొత్తసొమ్ములు; క్రొత్తఆటలు; క్రొత్తపాటలు; క్రొత్తమాటలు; క్రొత్త ఊహాలు; క్రొత్తకోరికలు; దేనికదియే నవ్యము-దేనికదియే సుందరము - దేనికదియే అన ద్భుశ్యము. ఒక్కదేశపు నాగరికతయేనా? ఒక్కజాతి సౌందర్యమేనా? తెల్లవారి అందచంద ములు; నల్లవారి నయవినయములు; ప్రాచీనుల విధినిషేధములు; నవీనుల సంస్కరణభావ ములు విశృతము గొల్పక వెగటుబుట్టింపక సరసనవోరచనల చవిజూపుచున్నది గృహలక్ష్మి.

కల్పలతా! త్రివర్షప్రాయయగు గృహలక్ష్మి యిన్నివిధముల వికాసమునొంది యల రించుచున్నను ఇంకను ఈమెయెడ నసంతృప్తులైనవారుగూడ కొందఱు లేకపోలేదు. గృహ లక్ష్మి కేవలము నవయువతులచేతి క్రీడాకందుకముగానున్నదేగాని ఆత్మోన్నతి కనువైన యాధ్యాత్మికవిషయము లామెకడ బొత్తిగాలేకున్నవనియు, భగవచ్ఛింత కొంచెమైన లేకుం డుట ఆమెయందలి లోపములలోకెల్ల గొప్పలోపమనియు, గృహలక్ష్ముల కత్యంతావశ్యక

మగు పాకకళవిషయమై గృహలక్ష్మి ప్రస్తావింపకుండుట సమంజసముగాలేదనియు, భౌతిక శాస్త్రాదులనుగూర్చి గూడ గృహలక్ష్మి స్త్రీల కెఱుకపఱచుట ఆవశ్యకమనియు, అర్థార్జనా సాధనలుగూడ గృహలక్ష్మి యప్పుడప్పుడెఱిగించుచుండినచో పేదస్త్రీలకు చాలయుపకారము చేసినదగుననియు ప్రస్తావవశమున కొందఱు సోదరీమణులు తమ అభిప్రాయములను వెల్లడింపగా వింటిని. నన్నే ముఖాముఖనడిగిన మిత్రురాండ్రతో 'మాగృహలక్ష్మికిప్పుడే యీడుకు మించిన తలపులు, శక్తికిమించినచేతలుగదా! ఇంకను మీాఅభిమతములు దీర్చుట కామెకు వయస్సుండవలదా? వడసారము మూఁడేండ్లునిండని మాగృహలక్ష్మి యింతకంటె నేమిచేయ గలదు? ఇంకనాలుగేండ్లు గడవనిండు. మీాకెన్ని విద్దెలుచూపునో! అప్పుడామెవలుగు మీారందుకోగలరా?' అని నవ్వితిని. మిత్రమా! భక్ష్యభోజ్యములచే బావని, విషయనివేదనముచే పతితను రంజింపజేయుట మానవునకు సాధ్యమైనకార్యముగాదు. ఎన్నిరుచిరపదార్థములతో విందుచేసినను బ్రాహ్మణుడు యింకను రెండు పిండివంటలుండిన లెస్సగానుండెడిదనును. ఎన్ని విషయములు క్రోడీకరించి సమర్పించినను పతిత యింకను కొన్ని విషయములుండిన బాగుగా నుండుననును. ఎంత తినబెట్టినను యింకా, ఎంతకట్టిబెట్టినను యింకా, ఎంతచుట్టియిచ్చినను యింకా, అనుటమానవులకు పుట్టుతోబుట్టినబుద్ధి. మానవుల జీవితమునకు పరిమాణమున్నది కాని యిచ్ఛలకు పరిమాణములేదు. కావుననే మనుష్యులు నశించినను యిచ్ఛలు నశింపక పీడించుట గాంచుచుందుము. అయితే మన గృహలక్ష్మి విషయమున ఇంకా అనెడి వారి యెడ మనము కోపపూరితులము కాగూడదు. బాగుగానున్న దానిని యింకను బాగుగా నుండవలయుననుట దానియందలి ప్రేమాతిశయముచేతనేగాని వేఱుగాదు గదా. కావున గృహలక్ష్మిని విమర్శించెడువారుగూడ ఆమె క్షేమాభిలాషులలో నగ్రగణ్యులే యగుచున్నారు. కల్పలతా! ఈసందర్భమున గృహలక్ష్మి మనకుచేసిన యుపకృతిగూడ స్మరించుట కర్తవ్యము. నెలనెలకుదినివచ్చి "అమ్మా ఏదండీ మీాలేఖ" యని నయవినయములతో గృహలక్ష్మి తొందరింపకున్నచో నిన్నిలేఖలు యింతక్రమము దప్పక నీకు వ్రాయుటకు నాకు సాధ్యమయ్యెడిదికాదు. గృహలక్ష్మి నెన్నియో నవనవరీతుల గైసేయగల చతురమతులగు విదుషీమణులు పెక్కండ్రేర్పడినను, వారు తమ యలంకరణాసామర్థ్యముచే నానాటికి తన చెలువ మినుమడింపజేయుచున్నను మనప్రాతకమ్మల యెడగూడ గృహలక్ష్మి గౌరవాదరములు గలిగి శ్రవణాలంకృతులుగా ధరించుట ప్రశంసనీయమగు విషయమే గదా!

నెచ్చెలీ! మన గృహలక్ష్మిని ఆమె జన్మదినోత్సవసందర్భమున నెట్లు బహూకరింప వలయునో తోపకున్నది. ఆంధ్రమహిళాజనముల నోములపంటయైన గృహలక్ష్మిని చిరంజీవివై వర్ధిల్లుమని నారీజనమెల్ల మనఃపూర్వకముగా నాశీర్వదించుటయే ఆమెకుదగిన బహూకరణ మని నాఅభిప్రాయము. కావున ఈదినమే ఆమెకట్టి శుభాశీర్వాదము నంపుచున్నాను.

భావపురి, ౧-౩-౩౧.

ఇట్లు, శారద.



## ఉప్పును హెచ్చుగ తినుటవలన దృష్టిమాంద్యము కలుగును:—

క్రిందివిషయములు 'గుడ్ హెల్తు' పత్రికనుండి గ్రహింపబడినవి.

"భోజనానంతరము బాగుగా మగ్గిన పండునేదైనతిను నలవాటు చేసుకొనుట ఆరోగ్యాభిలాషుల ప్రథమకర్తవ్యమై యుండవలయును. పండు మంచిఆహారపదార్థమగుట యొక్కటియేకాదు మనమాలోచింపవలసినది. మనము భోజనములో తీసికొను పదార్థములలో కొన్ని మనదంతములకు హానికలుగచేయజాలినవిగనున్నవి. భోజనమైనతోడనే ఏదైనపండును తింటిమేని దంతములకు ఆపై పదార్థములవలన రాగలిగిన హానిరాకుండ బోవును. పండురసము దంతములను మంచిస్థితిలో నుంచగలుగుటయేగాక వానికెట్టి చెడుపు కలుగకుండ చేయగలుగును. ఫలములందు ఉప్పుగలదు. ఫలములను విరివిగ తినుచో మనశరీరమునకు కావలసిన ఉప్పు అందుమూలమున లభ్యమగుచుండుటచే ఇక మనకు మామూలు ఉప్పుపై వాంఛ తగ్గిపోవును. మామూలుఉప్పు తీసికొనుచో అది మరల ఉప్పుగానే బహిర్గతమగును. శరీరమునకు దానిమూలమున ఎట్టిమేలును లేదు సరిగదా లోపలి పేగుకండరములనంటియుండు సున్నితమగుపొరకు హానిచేయును. అందుమూలమున పడిశభారము కలుగుటకు అవకాశమేర్పడును. లీప్జిగ్గుకు చెందిన ప్రొఫెసరు లామెన్ గారు 'నాచురల్ హైజిన్' అను తమ గ్రంథమున ఇట్లు వ్రాసియున్నారు. "నేటి నాగరికప్రజాసంఘములో దృష్టిమాంద్యవ్యాధి విశేషముగనున్నది. అట్లుండుటకు ముఖ్యకారణములు అపథ్యకరమగు ఆహారమును తిని శరీరమునకుతగిన పోషణలేకుండ చేసికొనుట, మామూలుఉప్పును మితిమీరి ఉపయోగించుట అని నాఅభిప్రాయము."

## దంతములనుగూర్చిన జాగ్రత:—

'మదర్ అండ్ చైల్డు' అనుపత్రిక పై విషయమునుగూర్చి ప్రచురించిన క్రిందివిషయములు స్త్రీలు ముఖ్యముగ పరిశీలింపదగియున్నవి.

"దంతములను బాగుగ పరిరక్షించుకొనవలయునన్నచో గర్భవతియగు స్త్రీ మంచిపోషణగల ఆహారపదార్థములను గ్రహింపవలయును. పాలు, గ్రుడ్లు, శాకములు, ఫలములు ఆమె విరివిగ భుజింపవలయును. ప్రసవానంతరము బిడ్డను బహుజాగ్రత్తగ సాకవలయును. తల్లిపాలు శ్రేష్టము. తల్లిపాలుత్రాగుటవలన దవడలకు మంచి పరిశ్రమకలుగును. పండ్లు మొలుచుటకు పూర్వము దవడలకు ఇట్టిపరిశ్రమ ఉండుట అత్యవసరమైనది. పండ్లు వచ్చినతరువాత ఆహారము నములునప్పుడుగూడ చిన్ననాటి ఈదవడల వ్యాయామము అక్కరకు రాగలదు. చిన్నపిల్లలు నిద్రపోవుచుండగా ఉమ్మిఊరును. వారినోటిలో పాలచుక్కలుగాని

యితరపదార్థములు గాని నిలిచిపోయినచో నిద్రించునెడ ఊరినఉమ్మి ఆపదార్థములతో కలసి విషముగా మారును. ఉమ్మి క్షారమువలె నుండవలెను. అట్లుండనిచో బిడ్డకు క్షారసంబంధమైన ద్రవములతో నోటిని శుభ్రము చేయుచుండవలయును. పండ్లు రాకమునుపు ప్రత్యేకదంతవైద్యము చేయింపవలసిన అవసరముండదు. తీసికొనవలసిన జాగ్రత ఒక్కటియు బిడ్డకు బాగుగ పుష్టిచేయు ఆహారమిచ్చుచుండుటయే. పండ్లువచ్చునప్పుడు గలుగుచిగురువాపు చిగురును శస్త్రచికిత్సకునిచే కొంచము ఛేదించుటచేగాని నెత్తురుతీయించుటచేగాని నివారింపనగును. ఈ చికిత్సల అవసరము లేకుండగనే సూక్ష్మప్రక్రియచేకూడ దీనిని నివారింపవగును. వాచిన చిగుళ్లను నారింజపండురసముతో తోమిన బాధనివారణయగును. ఈ ప్రతిక్రియ పలుతావుల బాగుగ పనిచేయుట మేము ప్రత్యక్షముగ చూచియున్నాము. చిరకాలానుభవమున మేమీ ప్రతిక్రియనందఱుగు అవలంబింప వచ్చునని చెప్పగలుగుచున్నాము."

## నిర్మలచిత్తము:—

శ్రీమతి రొక్కం సుందరమ్మగారిట్లు వ్రాయుచున్నారు.

"ముఖమును అద్దములో నీవు స్పష్టముగా చూచుకోగోరినపక్షమున అద్దమును పరిశుభ్రము చేయుము. నిర్మలము చేయుము. ఉజ్జ్వలముచేయుము. అపుడు నీయొక్క ముఖమేగాక ఎవ్వరిముఖమైనను అందు చక్కగా ప్రతిఫలించును. కొంచెముపాటి మాలిన్యమున్నను ముఖము సరిగా కనుపించదు. నీజీవనదర్పణమునందు నీవు ఈశ్వరుని ముఖమును దర్శింపగోరితివేని జీవనమును నిర్మలము చేయుము, ఉజ్జ్వలముజేయుము, మాలిన్యరహితము చేయుము, పవిత్రము చేయుము. విధ్యుక్తముగా అనుష్ఠానములనెల్ల జరిపినంతమాత్రమునగాని నీజీవనము నిర్మలమగుననియు, అందు ఈశ్వరముఖము ప్రతిబింబించుననియు తలంచుట కేవలము పొరపాటు. చిత్తములో నేమాత్రము కాపట్యమున్నను, కపటచింత యొకటి చిత్తములో ప్రవేశించినను గూడ చిత్తము నిర్మలమైనది కానేరదు. కొంచెము నిర్దయకలిగినను, ఒక్కనికైనను హింసచేయవలయునన్నబుద్ధి జనించినను జీవనమునిర్మలమైనదికానేరదు. దృష్టియందును, వాక్యమునందును, మనసునందును, కార్యమునందును కొద్దిగా కుత్సితభావము ప్రవేశించినను చిత్తము శుద్ధమైనదికానేరదు. స్వార్థభావ మెంతకొంత కలిగినను, చేసెడు ధర్మకార్యములో, దయాకార్యములో దురుద్దేశ మేమాత్రమున్నను మనస్సు పవిత్రమైనదికాబోదు. జీవనమును నిర్మలము చేసికొన్నచో ఈశ్వరుని స్వరూపప్రతిబింబమునందుచూడనగును. సకలమైన అసత్యమును దూరముచేయుము, సకలమైననిర్దయనువిడిచిపెట్టుము. చింతలోను, వాక్యములోను, భావములోను, కార్యములోను పవిత్రుడవుకమ్ము. సకలమైన అభిసంధులనుండియు, సకలమైనస్వార్థచింతలనుండియు, సకలమైన అహంకారములనుండియు ముక్తుడవుకమ్ము, సత్యము లభ్యముకానిమ్ము, త్యాగము లభ్యముకానిమ్ము, ప్రేమ లభ్యముకానిమ్ము, పవిత్రత లభ్యముకానిమ్ము, సేవ లభ్యముకానిమ్ము, ఆత్మవిలోపము లభ్యముకానిమ్ము. చిత్తము శుద్ధమగును. నిర్మలచిత్తమునందు ఈశ్వరుడు ప్రతిఫలించును."

## ఉద్యోగములు లేని ఆంగ్లస్త్రీలు:—

లండనుటైమ్సు వారపత్రిక యిట్లు ప్రచురించుచున్నది.

"ఇంగ్లాండుదేశమున ఇప్పుడు అయిదులక్షలమంది స్త్రీలు ఉద్యోగములేక అల్లాడుచున్నారు. వారు పరిశ్రామికకర్మాగారములందు పనిసంపాదించుటకే త్రొక్కిళ్లుపడుచున్నారుగాని గృహములందు పనికికుదురుటకు సంసిద్ధులుకాకున్నారు. దీనికి కారణము వారికి గృహకార్యనిర్వహణజ్ఞానము బొత్తిగ లేకపోవుటయే. ఈలోపమును నివారించుటకు మిస్ మార్గరెటు బాన్డుఫీల్డుగారు ఒక ఏర్పాటు చేయుచున్నారు.

లండనునగరమున యువతులను గృహకార్యనిర్వహణవిద్యయందు తరిబీయతు నొసగుటకు కేంద్రసదన మొకటి ఏర్పాటుపబడును. ఈ సదనమునకుచేర్చి హాస్టలొకటియుండును. దీనిశాఖలు క్రమముగ దేశమునందలి ముఖ్య పట్టణములందు నెలకొల్పబడును. వంటపని, బట్టలను శుద్ధముచేయుట, కుట్టుపని మొదలగు విషయములు బోధింపబడును. ఈవిషయములందు ఆరితేరినవారు ఉపాధ్యాయినులుగా నియమింపబడుదురు. వారివారి నివాసస్థలములనుండి ఇచ్చటికివచ్చుటకు విద్యార్థినులకు ప్రయాణపుఖర్చులీయబడును. వారమువారము కొంత జీతనముకూడ ఈయబడును. చెప్పబడువిషయములు పూర్తిగ నేర్చుకొనుటకు పదివారములు పట్టును. ఈపది వారములయనంతరము వారియుద్యోగసంపాదనమున ఈకేంద్రసదనమువారే సహాయముచేయుదురు. ల్యాంకు షైరునందు మిల్లులలో ఉద్యోగము పోగొట్టుకొని అల్లాడుచున్న స్త్రీలసంఖ్య విస్తారముగ గలదు. కావున శీఘ్రకాలములో అచ్చటకూడ నిట్టి సదనము స్థాపింపబడును. ల్యాంకుషైరుమిల్లులయందు పనిచేసి ఇప్పుడు ఉద్యోగములులేక అల్లాడుచున్న అనేకస్త్రీలు గృహకృత్యనిర్వహణమన్న ఏవపడుచున్నారు. ఆ ఏవతొలగించి వారిని గృహకార్యనిర్వహణవిద్య నేర్చుకొనుటయందు అభిలాషగలవారిగా చేయుటకూడ ఈకేంద్రసదనమువారి ముఖ్యకర్తవ్యములలో నొకటి కాగలదు."

స్వాయత్తమైన దేశమగుట స్త్రీజనాభ్యుదయమునకై ఆంగ్లదేశమున నిట్టి విపుల ప్రయత్నములు జరుగుచున్నవి. మనదేశమున ముఖ్యములగు స్త్రీసమస్యలనుగూర్చి తలపోయువారేలేరు.

**మెంతికూర: పాకవిశేషము:—**

1930 డిసెంబరుమాసపు గృహలక్ష్మిలో మెంతికూరవ్యాసముచివర మేముచేసిన ప్రార్థనమునుబట్టి శ్రీమతి అక్కరాజు సీతారామమ్మగారు మెంతికూర పాకవిశేషములలో నొకటియగు క్రిందిదానిని తెలుపుచున్నారు.

"ఒక శేరు మెంతులు రెండు శేర్లకందిపప్పుగాని శనగపప్పుగానికలిపి ఉడికించి పప్పుకొంచెము మెత్తపడగానే దించివార్చి తగినంతఉప్పు పులుసుకారము పసుపుకలిపి రెండుకొబ్బరికాయలకొబ్బరితురిమి పైకూరలో కలిపి నూనెలోమిరపకాయలు, మినపపప్పు, ఆవాలు, కరేపాకువేసి తిరగబోతవేయించి పైకూరతిరగబోతలో వేసి కొంచెము వేగగనేచూచుకొని దించుకోవలెను. ఇష్టమయితే కొంచెము ఇంగువ వేసుకోవచ్చును."

**మేలుకొలుపు:—**

ఈనూతనవత్సరారంభమున శ్రీమతి లలితాకుమారిగారు గృహలక్ష్మినుద్దేశించి యిట్లు వ్రాయుచున్నారు.

"కాంచనారుణవర్ణములు సమ్మిశ్రితములై అమృతమయమగు నొక వినూతనకాంతిని ఉదయగిరినుండి ప్రకృతిపై విరజిమ్మినవి. నూతనవత్సరారంభంబున గృహలక్ష్మివిజయసంగీతము వసంతకోకిలము లధికమనోహరముగా నాలపించుచున్నవి. గులాబీమల్లీచంపకాద్యనేకకుసుమగుచ్ఛములచే శృంగారితములై యాంధ్రగృహసముదాయములు విశ్వకల్యాణగృహములవలె గన్పట్టుచున్నవి. ఆంధ్రనారీమణుల సుకుమారహృదయములు హైందవసౌభాగ్యము నాకాంక్షించి అతిలోకరమణీయమును, అమృతపదభూషితమును, ఆనందావేశామధురితమును అగునొక మేలుకొలుపు పాడుచున్నవి. సోదరీ! ఆలింపుము."




**హుగ్లీనదిలో బ్రహ్మాండమగు చేప:—**

హుగ్లీ నది ముఖద్వారమున ఈనడుమ నొక పెద్దచేప పట్టుబడినది. బంగాళీభాషలో వానిని కైభాల్ చేపలందురు. ఆచేప ఆరడుగులతొమ్మిదిఅంగుళముల పొడవున్నది. దానితూకము నాలుగువందల పన్నెండు పౌనులు అనగా దాదాపు అయిదుమణుగులు. దానిరెక్కలు పదునెనిమిది అంగుళముల పొడవున్నవి. నోరు తెరిచినప్పటి వెడల్పు ఇరువది అంగుళములు. తానుపడిన వలనుండి తప్పించుకొనిపోవుటకు అదిచేసిన అర్భాటములో దానిని పట్టిన చేపలవాండ్రు తమ పడవతోసహా తలక్రిందులైరి. మఱికొందరు చేపలవాండ్రువచ్చి వారిని రక్షించిరి. ఆచేపను ఒకగొప్పహోటలు అధికారికొనెను. దానికూర ఎంతమందికి సరిపోయినదో?

**ముగ్గురు బిడ్డలు: ఒకే కాన్పున, ఒకే పోలికను:—**

ఆల్బెర్టాలోని స్టోనీప్లెయిన్‌నందు నివసించుచున్న జర్మను దంపతులకు ఒకేసారి ముగ్గురుపిల్లలు కలిగిరి. వారికిగల పదునలుగురుసంతానములో వీరే మిక్కిలి పిన్నవారు. ఈబిడ్డలు ముగ్గిరికిని ఇప్పుడు పదిసంవత్సరములు నిండినవి. ముగ్గురును ఒకేపోలికనున్నారు. తల్లియే వారిలో వారిని ఆనవాలు పట్టలేక వారిపేర్లుచెక్కిన బంగారుకడియములు వారికి చేయించినది. ముగ్గురకును వెంట్రుకలు మెలికెలు తిరిగియుండుటయేగాక మెడ మీదకూడ మొలచియున్నవి. ఈరీతి ఇంతకుముందటి బిడ్డల కెవరికిని లేదు. వీరు ముగ్గురును మగబిడ్డలే. ఈబాలురను పరీక్షచేయగా అందరికిని ఒకేమోస్తరు మార్కులువచ్చెను. ఒకేమోస్తరు తెలివిని ప్రదర్శించిరి. ముగ్గురును ఒకేమోస్తరు ఆటలయందు అభిరుచికలవారు. పాఠశాలలో వారు ముగ్గురును లెక్కలలో చురుకుతనమును, భాషావిషయములందు వెనుబాటును కనబఱతురు. వీరుగాక ఆదేశమున ఒకేకాన్పునబుట్టిన మఱియొక ముగ్గురుపిల్లలు గలరు. వారికిప్పుడు రెండేసివత్సరములు. వీరును చాలవఱకు ఒకరునొకరు పోలియేయుందురు. కాని తలిదండ్రులు వీరిలోవీరిని ఆనవాలు పట్టగలిగియున్నారు. ఈబిడ్డలు మువ్వురకును పురచేతివాటము. మువ్వురును నడకవిషయములో మందులు. బిడ్డలకు పండ్లువచ్చునప్పుడు కలుగుజబ్బు ఈమువ్వురకును ఒకేసారి వచ్చెను. ఒకేమోస్తరు తీవ్రతవహించెను.

**రెండు సంవత్సరముల బాలుడు గాయకుడు:—**

దినాజిపురిమున రెండుసంవత్సరములవయస్సుగలబాలుడు ఎట్టిపాటగానికైనను తృప్తిగలుగునట్లు తబలా వాయించుచున్నాడు. ఆతనిపేరు అనిలభూషణరాయి.

# గ్రంథవిమర్శనము

**తిలకధారణ విధి:—**

తిలకధారణ విధియనంగా బొట్టుపెట్టుకొను పద్ధతి. "బొట్లెట్లపెట్టుకొనవలయును? పెట్టుకొనవలసియుండినచో నందఱొక్కవిధముగా నేల ధరింపకుండిరి? ఎవరెట్లు ధరింపుచుండిరి?" అను విషయములను శాస్త్రప్రమాణములతో సర్వంకషముగ చర్చించు ఉత్తమగ్రంథమిది. నేటి హైందవులు తమమతవిధులను అతిక్రమించుటలో ఎట్టిజంకును నొందకున్నారు. అట్టితఱిని హిందూమతవిధులయొక్క శాస్త్రీయత నిరూపించి వాని అంతర్యమును ప్రబోధించు ఇట్టిగ్రంథముల ప్రచురణమెంతయు ప్రోత్సహింపదగియున్నది. కావున ఈగ్రంథ రచయితలగు భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారిని మేమెంతయు నభినందించుచున్నాము. ఇది కాణ్వీయగ్రంథరత్నమాలలో ఏకాదశరత్నము. క్రౌనుసైజున 24 పుటలు. వెల రు 0-2-0 అణాలు మాత్రము. వలయువారు గ్రంథకర్తపేర, రామచంద్రపురము, తూర్పుగోదావరిజిల్లా అనుచిరునామాకు వ్రాయునది.

**భావనాయిక:—**

భావనాయికకు శ్రీయుత బులుసు రామయోగరావుగారు కర్తలు. శరీరవ్యాయామవిషయమునందే వీరింతకుమున్ను ఆంధ్రులకు పరిచితులైయున్నారు. ఈగ్రంథప్రచురణముతో రామయోగరావుగారు సారస్వతవ్యాయామవిషయికముగ ఆంధ్రులపరిచయమున కెక్కుచున్నారు. గ్రంథము ఫుల్‌స్కాప్ సైజున 40 పుటలు. ఆంటిక్ కాగితములు. అట్టబైండు. వెల రు 0-8-0 మాత్రము. గ్రంథాంతమున మహనీయులిచ్చిన అభిప్రాయములు శ్రీయుతులు వి.యల్. శాస్త్రి, తిల్లార్ఘుల శివశంకరశాస్త్రి మొదలగు వారివి—చదువదగియున్నవి. రామయోగరావుగారి శిష్యులగు దివాకర్ల సోమసుందరశర్మగారు గ్రంథమునకు పీఠిక వ్రాసియున్నారు. గ్రంథకర్తలు శ్రీకృష్ణజన్మస్థానమునుండగా ఇది వ్రాయబడినది. గ్రంథమునకుగల విలువను హెచ్చించుటకు ఇందుకొన్ని చిత్రములుకూడ చేర్చబడినవి. శ్రీయుత బులుసు రామయోగరావుగారి ఛాయాచిత్రమును గలదు. తండ్రి చెఱసాలలోనుండగ జనియించిన ఈకావ్యకన్యక చెఱసాలలోనేయున్న శ్రీభట్టిప్రోలు సూర్యప్రకాశరావుగారికి అర్పింపబడినది. గ్రంథమువలయువారు గ్రంథకర్తకు వ్రాయునది.

**జ్ఞానబోధిని:—**

లోకజ్ఞానజ్యోతిషవైద్యగణితసంగీతవిషయాదులనుగూర్చిన ముఖ్యముగు సంగతులన్నియు క్రోడీకరింపబడిన చిన్నగ్రంథము. ఆబాలగోపాలము ఉపయోగించుకొనదగు గ్రంథము. సంపాదకులు దంతుర్తి శ్రీరామమూర్తి, అప్పలవీర వెంకటయోగయ్యశాస్త్రిగార్లు. గ్రంథము చిన్నసైజున దాదాపు 100 పుటలు. వెల 0-1-6. దొరకుచోట దంతుర్తి శ్రీరామమూర్తి అండ్ బ్రదర్సు, వెదురుపాక, తూర్పుగోదావరిజిల్లా.

**కథాసుమాంజలి:—**

ఇదియొక చిన్నవచనకావ్యము. ఇందు క్రౌనుసైజున 72 పుటలును, సరసములగు 8 కథలును గలవు. గ్రంథకర్తలు (1) ఆకొండి వేంకటశాస్త్రి (2) మాదిరాజు సీతాపతిరావు (3) కిరిమెళ్ల వేంకటరావు గార్లు. ప్రకాశకులు. టి.వి. చెల్లప్పశాస్త్రి అండ్ సన్సువారు. వెల 0-4-0 అణాలు. వలయువారు గ్రంథప్రకాశకులపేరున పెంబుదాసువీధి 1 నెంబరు మద్రాసునకు వ్రాసికొనవలయును. ఈచిన్నిపొత్తములోని కథలన్నియును చరిత్రాత్మకములే. ఈపొత్తమున విదేశీయులచరిత్రలుకూడ వర్ణించుట ముదావహము. సమస్తదేశీయుల చరిత్ర

ములుకూడ తెలిసియుండుట నాగరకతకు ముఖ్యసాధనము. ముగ్గురు గ్రంథకర్తలగుటచే మఱియొక విశేషము కూడగలదు. వేలువేలురుచులు ఒక్కచోట చవిచూచుభాగ్యము చదువరులకుగలుగుచున్నది. "భిన్నరుచిర్హి లోకః" (లోకము ఎప్పుడు వేలువేలు రుచులను గోరుచుండును గదా!) అని పెద్దలు చెప్పియున్నారు. ఇందలిశైలి అందమై, మృదుమధురమై యొప్పుచున్నది. వాక్యరచనలో నొకనియమమున కంతగా నెడము కానరాదు. పదములు ప్రసిద్ధములే. ఈగ్రంథము మాధ్యమికపాఠశాలలోని బాలురకు పఠనీయగ్రంథముగా నుండుటకు వీలైనదని చెప్పనగును.

**అగ్నికులప్రకాశిక:—**

అగ్నికులక్షత్రియమహాసంఘము తరపున ప్రచురింపబడుచున్న మాసపత్రిక. సంపాదకుడు పొన్నమండ లక్ష్మణస్వామివర్మగారు. కార్యస్థానము తూర్పుగోదావరిజిల్లా కోరంగియందుగలదు. మాకందిన సంచికలలో మద్యపాననిషేధప్రచారక్రమము, దండగరాములు మొదలగు విషయములు గలవు. సంవత్సర చందా రు 1–8–0 లు.

**శ్రీలక్ష్మీనారాయణీయము:—**

'మృత్యుంజయ విలాసము' అను యక్షగానము 'సింహాద్రి నారసింహ శతకము' అను సీసపద్యశతకము; 'శ్రీరామతీర్థ శ్రీరామసేవ' అను స్తోత్రగ్రంథము రచించిన పూర్వకవి గోకులపాటి కూర్మనాథునిచే విరచితమగు ఏకాశ్వాసప్రబంధము. లక్ష్మీనారాయణుల శృంగారసంవాదము ప్రస్తావితవిషయము. ప్రాచీన రచనమగుట ఆదరణీయమైనది. ఆంధ్రభూషణ అప్పల వీరవెంకటభోగయ్యశాస్త్రిగారిచే ఈగ్రంథము పరిష్కరింపబడినది. విస్మృతిగహనము పాలుగాకుండ నీప్రాచీనగ్రంథమును ముద్రించిన ప్రకాశకులెంతయు ప్రశంసాపాత్రులు. క్రౌనుసైజున 28 పుటలు. వెల 0—3—0. గ్రంథమువలయువారు 0—4—0 బిళ్లలు పంపవలయును. ప్రకాశకులు: దేవులపల్లి వీరరాఘవశర్మగారు, కాజులూరు, కాకినాడతాలూకా, తూర్పుగోదావరిజిల్లా.

**శ్రీభక్తకుచేల:—**

ఆరంకముల నాటకము. కర్త బ్రహ్మశ్రీ అప్పల వీరవేంకటభోగయ్యశాస్త్రిగారు. పోతనామాత్యుని భాగవతములోని కుచేలోపాఖ్యాన మిందు దృశ్యానుకూలమగు స్వల్పభేదములతో ప్రదర్శింపబడినది. నాటకమున అందందు పోతనపద్యరత్నములు వాడబడినవి. భక్తిరసము వెల్లివిరియుచుండ హాస్యరసముగూడ పోషింపబడినది. ముసలిఆనందుడు, పడుచురత్నావతుల కాపురము హాస్యవర్ధకము. శైలి నిర్దుష్టము. ముద్రణాదులు మెచ్చుటగనున్నవి. డెమ్మీసైజున 94 పుటలు. వెల 1—0—0 మాత్రము. తూర్పుగోదావరిజిల్లా వెదురుపాక లోనున్న గ్రంథకర్తగారివద్ద లభింపగలవు.

**శ్రీదాసులింగమూర్తిజీవితము:—**

గ్రంథకర్తలు శ్రీయుతులు పాలపర్తి సూర్యనారాయణ, డాక్టరు గంగరాజు వేంకటరామయ్యగార్లు. 'నిష్కామ్యముగా ననేకసత్రస్థాపనలు, దేవాలయప్రతిష్ఠలు, దేవాలయోద్ధరణములు' మొదలైనవి గావించి దేశమునందు భక్తిరసగుల్కలొలికిన ఆదర్శప్రాయుడు శ్రీ పోణంగి లింగమూర్తి దాసుగారిజీవితమిందు చక్కగ వర్ణింపబడినది. భక్తులాదరింపదగిన గ్రంథము. డెమ్మీసైజున 84 పుటలు. వెల 0—12—0 అణాలు. గ్రంథ

ప్రకాశకులు డాక్టరు గంగరాజు వేంకటరామయ్యగారు, చాగలమఱ్ఱి. గ్రంథములు వలయువారు ప్రకాశకులకు వ్రాయవలెను.

## ఆకొండివారి వైద్యము:—

ఉభయగోదావరిమండలములందును సుప్రసిద్ధమైయున్న ఆకొండివారివైద్యమును, వైద్యులగు ఆకొండివారివంశచరిత్రమును, వారి వైద్యమునుగూర్చి వారువారు వ్రాసిన ఉత్తరములను ప్రదర్శించు గ్రంథము. సుప్రసిద్ధులగు పానుగంటి లక్ష్మీనరసింహముగారు పీఠికవ్రాసియున్నారు. అది పాఠకమును శైలితో నొప్పుచున్నది. గ్రంథకర్తలు మధునాపంతుల సత్యనారాయణమూర్తిగారు. గ్రంథాలయములకు ఒక అణాబిళ్ల పంపిన గ్రంథము ఉచితము. క్రౌనుసైజున 100 పుటలు. వలయువారు గ్రంథకర్తగారిపేర (పల్లిపాలెము: ఫ్రెంచియానాంపోస్టు) వ్రాయవలయును.

## వైద్యోపన్యాసములు:—

ప్రథమసంపుటము. ఇందు వైద్యవిషయికములగు మూడుఉపన్యాసములుగలవు. వీనికర్తలు శ్రీయుత మధునాపంతుల సత్యనారాయణమూర్తిగారు. గ్రంథము క్రౌనుసైజున 20 పుటలు. వెల తెలుపబడలేదు. దొరుకుచోటు: ధర్మవైద్యాశ్రమము, పల్లిపాలెము, యానాంపోస్టు, ఈస్టుగోదావరిజిల్లా.

## గ్రామపునర్నిర్మాణవ్యాసములు:—

శ్రీయుత అన్నంరాజు శ్రీరాములుగారు గ్రామపునర్నిర్మాణవిషయమై 'స్వతంత్ర' 'ఆంధ్రపత్రిక' మొదలగు పత్రికలలో అప్పుడప్పుడు వ్రాయుచువచ్చిన వ్యాసముల సంపుటియిది. గ్రామపునర్నిర్మాణము అను కేక తఱచుగా తెనుగునాటనుగూడ వినిపించుచున్నదిగాని అందునుగూర్చిన వాఙ్మయమంతగా నింతవరకు తెనుగున పొడసూపలేదు. ఏతద్విషయికమగు ప్రత్యేకగ్రంథములలో ప్రస్తుతము మనవిమర్శనకు పాలుపడిన గ్రంథమే తొలుతటిది. గ్రామసీమలకు చెందిన సమస్యలు ఈ పుస్తకమున సులభశైలిలో వివరింపబడినవి. ప్రోత్సహింపదగిన ఉత్తమగ్రంథము. గ్రామపునర్నిర్మాణ విషయికములగు గ్రంథములను వ్రాయుటలో గ్రంథకర్తగారింకను పరిశ్రమించి మఱికొన్ని ఇట్టి ఉత్తమగ్రంథములను వెల్వరింతురుగాకయని కోరెదము. క్రౌనుసైజున 230 పుటలు. నెల్లూరు ఉస్మాన్‌సాహెబుపేటలోనున్న గ్రంథకర్తగారి పేర వ్రాసి పుస్తకము బడయవచ్చును. వెల తెలుపబడలేదు.

## వీరపూజ:—

చంద్రగుప్తుడు, పృథ్వీరాజు, భీమసింహుడు, హమీరసింహుడు, సంగరాణా, ప్రతాపసింహుడు అను ఆర్గురు భారతవీరుల వీరజీవితములను గానముచేయు చారిత్రకగ్రంథము. ఇందు గ్రంథకర్త కేవలవిషయనివేదనములతో తృప్తినొందక సూక్ష్మవిషయముల నెన్నింటినో విమర్శించినారు. నిదర్శనముగా పృథ్వీరాజు సంయుక్తల వివాహవిషయకవిమర్శనమును చేకొనవచ్చును. పృథ్వీరాజు గోరీని విడిచిపెట్టుచు వచ్చినవిషయకమైన విమర్శగూడనట్టిదే. ఇట్టి స్వతంత్రవిమర్శనలతో నవరసైన చారిత్రకగ్రంథపఠనము జారిన దేశగారవమును లేవనెత్తు ఉత్సాహము యువకులలో రేకెత్తించగలదు. శైలి ప్రౌఢమును సుందరమును. విషయముచేతను, శైలిచేతను ఆదరింపదగిన ఉత్తమగ్రంథము. విద్యాశాఖాధికారు లీగ్రంథమును పాఠశాలలలో పఠనీయగ్రంథముగ నెట్టి ఇందుకీర్తింపబడిన హైందవవీరుల వీరజీవితములతోడను, ఇందలి వ్యక్తిత్వముగల శైలితోడను విద్యార్థులకు పరిచితి కల్గింతురుగాకయని కోరెదము. ఈ వీరపూజయొక్క మిగిలినభాగములను గూడ సాధ్యమైనంత త్వరలో ఆంధ్రులకు ప్రసాదింప గ్రంథకర్తలగు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని

కోరుచున్నాము. గ్రంథము క్రౌను సైజున 200 పుటలు. వెల 1—0—0 మాత్రము. దొరుకుచోటు: కళాభివర్ధనీపరిషత్తు, ఇన్నీసుపేట, రాజమండ్రి.

పురాణగాథలు:—

ఇది శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే విరచితము. శ్రీ శాస్త్రిగారి గద్యశైలి ముద్దులుమూటగట్టుచుండును. ఇట్టి శైలితో విద్యార్థులకు చిన్నటనాటనే పరిచయమయ్యెనేని వారి వ్యాసరచనయు మెఱుగగును, అదియునుగాక ఇందలి కథలన్నియు నీతిబోధకములు. హైందవహృదయమునకు సన్నిహితముగనుంటుపురాణములనుండి గ్రహింపబడినవి. నీతివిద్య గ్రహించుటకు బాల్యమే మంచికార్తి. ఈగ్రంథము పాఠశాలలయందు పఠనీయముగ బెట్టుటకెంతయు దగియున్నది. 'స్వజాతి నుద్ధరింపుము', 'బ్రాహ్మణశాపముతప్పదు', 'పనిచేయువాడుమాటలు చెప్పడు' మొదలగు కథలు ప్రత్యేకము ప్రశంసింపదగియున్నవి. గ్రంథము క్రౌను సైజున 154 పుటలు. అట్టబైండు. వెల 0-10-0 అణాలు. దొరుకుచోటు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండుసన్సు: ఎస్ప్లనేడ్, చెన్నపురి.

చమత్కారచాటుపద్యములు:—

శ్రీపీఠికాపురప్రభుపోషితుండగు శ్రీదాసరి లక్ష్మణస్వామిగారిచే సమకూర్పబడినవి. సమస్యలు, లోకనీతులు, హాస్యపద్యములు, చాటుపద్యములుగలవు. డెమ్మీసైజున 32 పుటలు. మొదటికూర్పు. పిఠాపురము శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు ముద్రితము. వెల 0-6-0 అణాలు. వలయువారు గ్రంథసంధాతపేర పిఠాపురమునకు వ్రాయవలెను.

శ్రీరామకథామంజరి:—

అధునికాంధ్రవిదుషీమణులలో నొకరైన శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారిచే వ్రాయబడిన వచనగ్రంథము. దేవిగారు ఇంతకుమున్న పద్యగ్రంథములకేగాని వచనగ్రంథములను వ్రాయలేదు. వారి జీవితవిశేషములను వివరించుచు వారి గ్రంథములనుగూర్చిన విమర్శనొకసారి గృహలక్ష్మిలో వెల్వరించితిమి. వీరుపద్యకవిత నెంతహృద్యముగ వ్రాయగలరో గద్యకవితకూడనంతహృద్యముగనే వ్రాయగలరని ప్రస్తుతము మనవిమర్శకు పాల్పడిన శ్రీరామకథామంజరియను ఈవచనగ్రంథముమూలమున తెలియనగును. రామకథ చవిచూడనొల్లనివారెవరు? మఱియునది ఈగ్రంథమున నవలాస్వరూపమునొందినది. శైలిధారాళము. గ్రంథమంతయు నీతులతో నిండారియున్నది. హైస్కూళ్లయందును, ట్రెయినింగుస్కూళ్లయందును పఠనీయముగనుంచదగినది. విద్యాశాఖాధికారులీగ్రంథమునుచేకొని ఈవిదుషీకవలయు ప్రోత్సాహమొసంగుదురుగాక! గ్రంథము డెమ్మీసైజున 260 పుటలు. వెల రు ౧-౮-౦. పబ్లిషరు: గుడిపూడి రామారావుగారు, గాంధినగరము, బెజవాడ. వారికి వ్రాసిన గ్రంథములు లభియనగును.

సత్యవ్రతిశతకము:—

శ్రీమదానంద గజపతి సార్వభౌములిచ్చిన 'సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్' అను సమస్య మూలగాగొని శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు రచియించిన కందపద్యముల శతకము. ఇది 1890 సంవత్సరమున రచియింపబడినది. వ్యాఖ్యానసహితము. గ్రంథమున శ్రీ శాస్త్రిగారి ఛాయాచిత్రముకూడగలదు. శ్రీ శాస్త్రిగారు 1922 లో పరమపదించిరి. వారికుమారులీ గ్రంథము నిప్పుడుముద్రించి వెలువరించిరి. క్రౌను సైజున 60 పుటలు, వెల 0-4-0 దొరుకుచోటు: భాగవతుల లింగమూర్తిపంతులుగారు, ఛత్రపురము, గంజాంజిల్లా.

# డైరి

## జనవరి

20:—పార్లమెంటు సభ్యురాలు డాక్టరు ఏథెలు బెంథాము అను నామె చనిపోయెను. ఈమె స్త్రీల పురోభివృద్ధి కెంతయు తోడ్పడెను.

:—మదరాసులో పికెట్టింగు నేరమునకు ఎరస్టుచేయబడియున్న శ్రీమతి పి. అంజలి లక్ష్మిఅమ్మగారు, శ్రీమతి వి. శకుంతలాదేవిగారు విచారింపబడి ఆరేసిమాసముల విడిఖైదును బొందిరి. శ్రీమతి అంజలి అమ్మాళ్ గారితో ఆమె మూడేండ్లబిడ్డ కూడ నుండెను.

21:—కలకత్తాలో బర్రాబజారున పికెటింగు చేయుచున్నప్పుడు డిప్టీకమీషనరు గార్డన్ తనపైన అనవసరబల ప్రయోగము గావించెనని జగ్గేశ్వరిదేవిగారు తెచ్చిన కేసులో అదనపురాజధాని మేజిస్ట్రేటు యామె వాదము నిరాకరించెను. పోలీసుకమీషన రీసందర్భమున స్త్రీపికెటర్లనుగురించి వచించుచు, స్త్రీలు పురుషులగు వలంటీర్ల మధ్యచేరి, అంగడులకువచ్చుచు పోవుచున్నవారిని నిరోధించుచు వారివస్త్రములను లాగుచున్నపుడు తమసహజాభిజాత్యమును కోల్పోయినవారేయగుచున్నారనియు పోలీసులు వీరి అభిజాత్యమునకు భంగము కలిగించిరనుట సహేతుకము కాదనియు సమర్థించెను.

22:—కలకత్తా నారీసత్యాగ్రహసమితి కార్యదర్శిని కుమారిశాంతిదాసుగారు ఎం.ఏ. పోలీసుచట్టము 3 సెక్షను క్రింద ఆగ్రాలో నాలుగు నెలలవిడిఖైదువిధింపబడిరి. వీరిటీవలనే బెంగాలు జైలులో ఒకశిక్షననుభవించిరి.

:—శ్రీమతి చేకుమళ్ల వరహాలమ్మగారు వేలూరు స్త్రీల జయిలునుండి విడుదలయిరి. వీరుగత జూలయి మాసమున కంజీవరములో శిక్షింపబడిరి.

:—దర్బారు గోపాల్దాసుగారి సతీమణి భక్తిలక్ష్మిదేశాయిగారిని బోర్సదులో స్త్రీల ఊరేగింపుకు నాయకత్వము వహించినందులకు అరెస్టుచేసిరి.

23:—అంతర్జాతీయమహిళామండలివారు భారతరాజకీయనిర్బంధితుల నందరిని తక్షణము విడుదలజేసెదమని ప్రకటనమును గావించవలెనని బ్రిటీషుప్రధానామాత్యునకు తంతినంపిరి.

24:—ముజఫర్ పూర్ లో చెఱసాలయందున్న తనభర్తనుచూచుటకు వెళ్లుచుండగా పన్నులనిరాకరణోద్యమ నాయకురాలగు శ్రీమతి సునీతిదేవిగారు అరెస్టుచేయబడిరి.

25:—కలకత్తాలో శ్రీమతి లక్ష్మిదేవి ఉపాధ్యాయగారికి రు 50 జరిమానా, జరిమానాచెల్లింపనిచో ఒకనెల విడిఖైదు విధింపబడెను. బురాబజారు పికెటింగులో త్రోవకడ్డముగనిలచినందుకు ఈశిక్ష.

26:—గద్వాలమహారాణిగారైన శ్రీమతి ఆదిలక్ష్మమ్మగారు, ధూమకొండరాజా రాజారామేశ్వరరావుగారు బి. యె. తోటి పరివారసమేతముగా ముడుపులుచెల్లించుటకు తిరుపతికొండ చేరిరి.

—స్వాతంత్ర్యదినోత్సవసందర్భమున ఏలూరులో శ్రీమతులు ముల్పూరి చుక్కమ్మ, దుగ్గిరాల కమలమ్మ గార్లను ఎరస్టుచేసిరి.

—రాత్రి 11 గంటల 15 నిముషములకు ఎఱవాడజయిలునుండి గాంధిమహాత్ముని, శ్రీమతి సరోజనీదేవి గారిని విడుదలచేసిరి.

—లక్నో చెరసాలలో శిక్షననుభవించుచున్న శ్రీమతి కమలానెహ్రూ గారిని ఒకకారులో యిటనుండి అలహాబాదు తీసుకొనివెళ్లి అచట విడుదలచేసిరి.

27:—కలకత్తాలో జాతీయపతాకమును ప్రతిష్ఠించినందులకు శ్రీమతి గిరిబలా రాయిపతి గారికి 50 రూపాయిల జరిమానా, జరిమానా చెల్లింపనిచో నెల విడిఖైదు అనుభవింపవలసినట్లు ఆజ్ఞాపింపబడెను.

:—ఏలూరులో ఎరస్టుఅయిన శ్రీమతులు ములప్వారి చుక్కమ్మ, దుగ్గిరాల కమలమ్మ గార్లకు చెరినాల్గుమాసములశిక్ష విధింపబడెను. ఎ. తరగతి ఈయబడెను.

28:—జె. ఎం. సేనగుప్త గారిభార్య విడుదలచేయబడెను.

29:—అహమ్మదాబాదులో శ్రీమతి లీలావతిదేశాయి గారు గుజరాతురాష్ట్రీయ కాంగ్రెసుసంఘ నియంత్రిగా నియమింపబడెను.

:—అహమ్మదాబాదులో శ్రీమతి భక్తిలక్ష్మిగోపాలదాసు దేశాయిగారికి -కెరాజిల్లానియంత్రి- 6 నెలలు ఖైదుశిక్ష, రూ 200 జరిమానాయు, జరిమానా చెల్లింపనిచో మఱియొక నెలఖైదును విధించబడెను. ఎ. తరగతి ఒసగబడెను. సబర్మతిజెయిలులో నుంచబడెను.

30:—

31:—మహాఘనతవహించిన నిజాంప్రభువుగారు భారతదేశ స్త్రీవిద్యాసంఘమునకు రెండులక్షల భూరివిరాళ మొసగిరి.

ఫిబ్రవరి

1:—ఆస్ట్రేలియాలోని సిడ్నేలో 48 గంటల 15 నిమిషముల కాల మొకచిన్న తటాకములో నీదగలిగి మెర్సిడిస్గ్లీట్జయను నారీమణి స్త్రీల ఈతపోటీలో గెలుపొందెను.

:—అఖిలభారత స్త్రీ మహాసభయందు పాల్గొనజేగిన శ్రీమతి హుమాయూన్ మీర్జాగారు లక్నోనుండి హైద్రాబాదునకువచ్చి చేరిరి.

2:—కలకత్తాలో సారజసేన్‌గుప్త, లక్ష్మిమణిపాల్, సుకీమాసేన్, నళినగుప్త గార్లు నల్వురును బుర్రాబజారు పికెటింగునకై క్రిమినలులాసవరణచట్టము 17 (1) క్రింద అరెస్టుచేయబడిరి. జామీనుమీద విడుదల నిరాకరించినందున వీరు రిమాండులో నుంచబడిరి.

:—మదరాసులో పోలీసువారు వలంటీరులను ప్రజలను అతికఠినముగ లాటీలతో కొట్టుచుండుటను తమ అసమ్మతిని తెలుపుటకుగాను చాలమంది స్త్రీలు జార్జిటవునులో ఊరేగింపుజరిపిరి.

3:—మదరాసులో విదేశవస్త్రముల పికెటింగు సందర్భమున శ్రీమతులు శంకరయ్యరుపతి, కమలాబాయి గార్లు అరెస్టుచేయబడినది.

:—కలకత్తాలో శ్రీమతి లక్ష్మిఉపాధ్యాయగారు పికెటింగునకై రు 50 జరిమానా, లేక 8 వారములు విడిఖైదు విధింపబడిరి.

:—పాట్నా శరణమండలమున అమ్నూరులో సుప్రసిద్ధజమీందారువంశమునకు చెందిన రామశరపాదేవి గారిని పోలీసులు అరెస్టుచేసిరి. వారు హరిమధుసూలగుగారి పతిమణి.

4:—మదరాసు రతన్‌బజారులో విదేశవస్త్రముల దుకాణములవద్ద పికెటింగుచేసినందులకుగాను అరెస్టు చేయబడిన శ్రీమతి లక్ష్మిఅమ్మగారును, శ్రీమతి కమలాబాయిగారును చెరి ఆరేసినెలల విడిఖైదును పొందిరి. లక్ష్మిఅమ్మగారికి ఎ. తరగతి, కమలాబాయిగారికి బి. తరగతి.

:—ఢిల్లీచూడవచ్చు పేదప్రయాణీకులకు నిర్మింపబడిన విశ్రాంతి గృహమునకు—హార్డింజిప్రభ్విసత్రము—హార్డింజిప్రభువుగారు ప్రారంభోత్సవము జరిపిరి.

5:—లాహోరులో జష్టీచెల్లెంద్రకు మరల ఒక్కొక్క సంవత్సరము ఖైదు విధింపబడెను.

6:—మోతీలాలు నెహ్రూగారి నిర్యాణము.

7:—మదరాసులో పికెటింగు సందర్భమున శ్రీమతి కమలాబాయి [లక్ష్మణరావుసతి], శ్రీమతి కృష్ణాబాయి [హరిరావుసతి] గార్లు అరెస్టుచేయబడిరి.

8:—

9:—మదరాసులో శ్రీమతి కమలాబాయి [లక్ష్మణరావుసతి] శ్రీమతి కృష్ణాబాయి [హరిరావుసతి] గార్లకు చెరి ఆరు నెలలశిక్ష విధింపబడెను. ఎ. తరగతి ఈయబడెను.

10:—

11:—ఏలూరులో శ్రీమతులు శృంగారకవి లక్ష్మీనరసమ్మ, కొవ్వలి కనకమ్మగార్లు అరెస్టుచేయబడిరి. నాలుగు నెలల విడిఖైదు విధింపబడెను. క్రిమినలులాసవరణచట్టము 17-వ సెక్షను, ఇండియను పినలుకోడు 188 సెక్షనుక్రింద.

12:—శ్రీమతి శృంగారకవి లక్ష్మీనరసమ్మ, శ్రీమతి కొవ్వలి కనకమ్మగార్లు వేలూరు స్త్రీలజెయిలుకు గొనిపోబడిరి.

13:—కలకత్తాలో శ్రీమతులు సరళాదేవి, సుందరాణిసింగు, వినోదినీ సర్కారుగార్లు మూడవరాజధాని మేజస్ట్రేటుముందు విచారింపబడి చెరి రు 100 జరిమానా, చెల్లింపనిచో 2 నెలలఖైదు పొందిరి.

14:—శ్రీమతి డాక్టరు పచ్చిముత్తుఅమ్మాళ్ గారు తిరుచునాపల్లిలో కాలేజిపికెటింగుచేసినందుకు విధింపబడిన 6 నెలలశిక్ష ననుభవించి విడుదలనొందిరి.

15:—మంగుళూరు ప్రభుత్వకళాశాల ప్రిన్సిపాలుగారిభార్యయగు శ్రీమతి జె.క. చెత్తూరుసతిగారు మంగుళూరునందు హానరరిమాజిస్ట్రేటుగ నియమింపబడిరి.

16:—శ్రీమతి సరోజినీనాయుడుగారు మన్మాడుమీదుగ హైద్రాబాదునకుబోయిరి.

:—బొంబాయిలో 14 యేండ్లబాలికయగు కుమారిగులాబి పార్కరుగారు గత అక్టోబరు 26-వ తేదిని మరి 13 గురు స్త్రీలతో సహా బొంబాయి పోలీసులుజైలుబండిలో ఎక్కించుకొనిపోయి ఊరిబయట ఎక్కడనో దిగవిడిచిన సందర్భమున సార్జెంటు ఫీనానుపై కేసు తెచ్చియుండిరి. దానిని మూడవరాజధాని మేజిస్ట్రేటు ఖండల్వాలాగారు త్రోసివేయుచు తీర్పుచెప్పిరి.

17:—మదరాసులో శ్రీమతి మిసెస్ హాస్సెన్ ఏంజలోగారు (మ్యునిసిపలుకవున్సిలరు) తమ మోటారుబండిలో తాపినింగుబజారురోడ్డు మీదుగాపోవుచుండగా పోలీసువారు ఆపి సోదాచేసిరి.

:—సూరతులో విద్యార్థిమండలి అధ్యక్షురాలు శ్రీమతి జ్యోత్స్నశుక్లగారు షోలాపూరుదినమున 144 సెక్షన్ ఉత్తరువును ధిక్కరించినందులకై రెండు నెలల విడిఖైదుపొందిరి.

18:—ధోలెరాసమరసంఘమునకు గంగాబెన్ జవేరిసతిగారు 15-వనియంత్రిగా నియమింపబడినది. ఈమె సబర్మతి ఆశ్రమవాసి. గాంధిగారి ఆదేశముపై స్వరాజ్యప్రాప్తిలోపుగా ఆశ్రమమునకు మరలి రామని ప్రతిజ్ఞపట్టిన 12 మంది స్త్రీలలో నీమె యొకతె.

:—సూరతులో శ్రీమతి జ్యోత్స్నశుక్లగారు నాలుగు నెలల విడిఖైదునొందిరి.

19:—శ్రీమతి మధుమతి చూనీలాల్ కన్య సూరతుమండలమున తొమ్మిదవ నియంత్రిగా నియమింపబడెను. 1921 నుండియు ఈమె దేశీయోద్యమమున పాల్గొనుచున్నది.




**త్రాగుడా? తరుణియా?**

మున్నిగంజిలో నొక చేపలపట్టువానికి వివాహము నిశ్చయమయ్యెను. సర్వప్రయత్నములు తుదముట్టెను. ఇంతలో పెండ్లికుమారుడు త్రాగుటకు అలవాటుపడియున్నాడను వార్త పెండ్లికూతురుతండ్రి చెవినిబడెను. 'త్రాగుబోతువానికి నాతనయ నీయజాలను. త్రాగుట మానెదనని ప్రమాణమైన చేయవలెను; లేదా నాకూతురుని వివాహమాడుటయైన విరమింపవలెను.' అని పెండ్లికూతురుతండ్రి పెద్దలసన్నిధిని చెప్పెను. పెండ్లికుమారునకు పచ్చివెలగకాయ గొంతుకలోపడెను. అలవాటుపడియున్న త్రాగుడును విడిచిపుచ్చుటా? అర్థాంగికానున్న తరుణిని విడిచిపుచ్చుటా? అనుసమస్య నాతనిని గజిబిజిచేసెను. చిరకాలముగా త్రాగుటకు దురభ్యాసమునకు దాసుడై యున్నను ఇంకను వానిహృదయమున ఏమూలనో కొంచెమింత ఉన్నతభావము నిలచియుండెను కావున అతడు 'నాకుత్రాగుడు వద్దు. తరుణియేకావలెను' అని చెప్పెను. అయితే ఈవాక్యములు అతడు హృదయపూర్వకముగాఅనినవని నమ్ముట కాధారమేమి? అతడు కల్లుదుకాణములను పికెటింగుచేయుచున్న కాంగ్రెసు వాలంటీరులయొద్దకుబోయి తానికనెప్పుడును త్రాగనని ఒట్టు పెట్టుకొనెను. సత్యఋషియగు గాంధిమహాత్ముడు నాయకుడుగాగల కాంగ్రెసువారిచెంత ఇట్లు ప్రమాణముచేయుటతోడనే పెండ్లికూతురుతండ్రికి కాబోవుఅల్లునిమాటలయందు నమ్మకము కుదిరెను. పెండ్లికూతురికి తృప్తికలిగెను. పెండ్లిపెద్దలు సంతోషించిరి. సంతోషములతో పెండ్లిసమాప్తమయ్యెను. అయితే అధికారు లీవిషయముకూడ పికెటింగు ఆర్డినెన్సుక్రిందకు వచ్చునందురో, ఏమో? ఏమోకాని త్రాగుడు మాని తరుణిని చేకొన్న ఈచేపలనుబట్టువానిని ఎక్సైజుఅధికారులు అభినందింపజాలరనుట మాత్రము నిశ్చయము.

**బీకనీరుమహారాజావారి దుబారాఖర్చు:—**

రౌండుటేబిలుసభకు ప్రతినిధులుగా బోయిన సంస్థానాధీశ్వరులలో బీకనీరుమహారాజుగారొకరు. వీరు లండనునగరమున రిట్జిహోటలులో మకాముచేసిరి. ఒక్కనాడు వీరు

అల్పాహారములవిందులకై ననేమి, విందుభోజనములకై ననేమి 575 బంగారుకాసులను వెచ్చించిరి. ఒక్కదినమున కెంతఖర్చు? భారతదేశమునందలి పేదరైతునుండి నెత్తురుచుక్కలట్లు పన్నుడబ్బులులాగి ఆంగ్లదేశమునకుబోయి అచ్చటివిలాసములకు ధనమును నీళ్లప్రాయముగ ఖర్చుపెట్టుట మనమహారాజులకు మామూలై పోయినది. బీకనీరుమహారాజుగారు తమగౌరవమునకు ఎక్కడలోపమువచ్చునోఅని బిల్లుపుచ్చుకొనిసొమ్ముకట్టక ముందుగనే సొమ్ముకట్టివేయుచురట. అనంతరము బిల్లు వారి కార్యదర్శిగారికి అందజేయబడునట. ఎట్టి ఉదారత? భారతదేశమున హెచ్చురాబడిగల మహారాజులలో ముఖ్యుడే కావచ్చును, రౌండుటేబిలుసభలో వాక్చాతుర్యము ప్రదర్శించిన ఉపన్యాసకుడే కావచ్చును, ఇంతవఱకు నూటనలుబదిమూడుపులులను వేటాడిచంపిన మేటివిలుకాడేకావచ్చును, మనచక్రవర్తిగారికి ఎయిడ్‌డికాంప్ అయిన మహాశయుడే కావచ్చును, ఆంగ్లసైన్యమున లెఫ్టనెంటుజనరలు గౌరవముపొందిన వీరాధికుడేకావచ్చును-గాని ఈమహారాజుచేసిన ఈదుబారాఖర్చు మాత్రము ప్రజలఆమోదమునుబడయజాలదు. తనదేశమునందలిప్రజలకు కాని కాసుగానుండగా ఈమహారాజు విదేశములందు కాసును కాసీగా ఖర్చుపెట్టినాడు. ఒడలు తెలిసియా?

మదరాసు రాజధానియందు శిక్షనొందిన స్త్రీసత్యాగ్రహులు:—

మొన్నజరిగిన మదరాసు శాసనసభలో శ్రీ సామి వెంకటాచలముచెట్టిగా రడిగిన ప్రశ్నకు ప్రభుత్వమువారు క్రిందిప్రత్యుత్తరమునిచ్చిరి. "1930-వ సంవత్సరము డిసెంబరు 3-వ తేదీసరికి రాజకీయనేరములకు శిక్షనొంది జైలునందున్న స్త్రీలనుగూర్చినవివరములు:-

| జైలు పేరు. | స్త్రీ సత్యాగ్రహుల సంఖ్య. | | |
|---|---|---|---|
| | ఎ. తరగతి | బి. తరగతి | సి. తరగతి |
| మద్రాసుపెనిటెన్షియరీ | ... | ... | 1 |
| వెల్లూరు జయిలు | 4 | 21 | 17 |
| కాలికట్టు సబ్ జైలు | ... | ... | 1 |
| మొత్తము. | 4 | 21 | 19 |

ఈ నలుబదినలుగురు స్త్రీ సత్యాగ్రహులలో ముప్పదిమందికిపైగా ఆంధ్రస్త్రీలే యను విషయము ఆంధ్రులు గర్వముతో చెప్పుకొనదగినది. ఈనడుమ కొందరు స్త్రీసత్యాగ్రహులు విడుదలచేయబడినను గతమాసమున ఏలూరునందు నలుగురును, మదరాసునందు ఆఱుగురును, కాలికట్టునందు ఇరువురును, గుంటూరునందు ముప్వురును ఖైదుచేయబడిరి. స్త్రీలు సత్యాగ్రహోద్యమనిర్వహణమున చేసిన విశేషప్రయత్నమునకు వారి ఈనిర్బంధము మంచి యోగ్యతాపత్రము.

### విధ్యుక్తధర్మమెఱిగిన మాతృదేవి:—

ఫిబ్రవరి 19-వ తేదీనాటి మధ్యాహ్నభానుడు మదరాసునందలి తారురోడ్లను కరగించుచుండెను. అట్టిసమయమున కొందరు పెద్దలు పోలీసుకమీషనరు ఆఫీసువద్దకువచ్చిరి. వచ్చినవారిలో అరువదియేండ్ల వృద్ధవితంతువుకూడ నుండెను. వారందఱును ఇంతకురెండు దినములకుముందు 'విదేశవస్త్రములదుకాణములను పికెటింగుచేసినందులకు ఎరస్టుచేయబడిన శ్రీపాద శంకరుగారిని చూచుటకువచ్చిరి. అల్లంతదూరమున నాతనినిచూచి ఆవృద్ధవితంతువు "ఈ నా ఏకైకపుత్రుని దేశముకొఱకు సమర్పించితిని. ఈతడు ఎరస్టుచేయబడినందులకు నేనెంతయు సంతోషించితిని."అని అనెను. ఇంతలో స్తన్యమిచ్చి సాకిన మాతృభావము ఆమెకు జ్ఞప్తికితట్టినదికాబోలు ఆమెకంటతడిబెట్టినది. కాని క్షణములో మఱల నామె కోల్కొని "నాకానందము. నాతనయుడు దేశమాతకు తనవిధ్యుక్తవిధి నెఱవేర్చినందులకు నాకానందము" అని ధైర్యముతో ననెను. విద్యుక్తధర్మమెఱిగిన ఇట్టి ఉత్తమమాతలు భారతదేశమున ఎందరో ఉండిరి గావుననే అరువదివేలభారతపుత్రులు మాతౄణ మీగికొనుటకు కారాగారజీవితములను సంతోషపూర్వకముగ స్వీకరించినారు.

### విక్టరు బ్రూనుసతి ప్రజ్ఞ:—

అబలయను పర్యాయాభిదానముగల స్త్రీజాతికిచెందిన ఈ ఆంగ్లయువతి ఆకాశవిమానముమీద ప్రపంచమునుచుట్టివచ్చినది. సెప్టెంబరుమాసమున తన ఆకాశ విమానముమీద ఆంగ్లదేశమునుండి బయలుదేరి క్రమమున జపానుచేరినది. ఓడప్రయాణము గావించి ఫసిఫిక్ మహాసముద్రము ను త్తరించినది. వాన్‌కవర్‌నుండి న్యూయార్కునకుతిరిగి విమానప్రయాణముగావించినది. అచ్చటనుండి ఓడమీద అట్లాంటిక్ మహాసముద్రము ను త్తరించి ఆంగ్లావని చేరినది. ఆమె విమానముపై ప్రయాణముచేసిన దూరము పందొమ్మిదివేలమైళ్లు. ఇట్లుప్రపంచమును చుట్టివచ్చుట కామెకు నూటనలుబదియేనురోజులు పట్టినది. ఈప్రయాణములోఆమెకువచ్చిన విఘాతములకు లెక్కలేదు. వానినేమియు సరకుగొనక ఆమె పట్టిన పంతము చెల్లించి ప్రపంచమును చుట్టివచ్చినది. స్త్రీలప్రజ్ఞాదక్షతల కొకప్రబలనిదర్శనము. మోటారునడుపుటలో విక్టరుబ్రూనుసతి చూపిన అసాధారణప్రజ్ఞను గృహలక్ష్మి కీర్తించియున్నది. మఱియొక అద్భుతప్రదర్శనముగావించి ఆవిక్టరుబ్రూనుసతి తనకీర్తి రెట్టించినది. ఆమెప్రజ్ఞకు మఱలనొకసారి జయవెట్టుచున్నాము.

### కీ. శే. బ్రహ్మజోస్యుల లక్ష్మినరసమ్మగారు:—

సహాయనిరాకరణోద్యమముమూలమున ఆంధ్రలోకమునకు ఎఱుకపడిన వీరమాతలలో బ్రహ్మజోస్యుల లక్ష్మినరసమ్మగారొకరు. ఆమెకుమారుడు—సీతానగరమునందలి సత్యాగ్రహాశ్రమసంస్థాపనాచార్యుడు—సుబ్రహ్మణ్యము పీరుడగుటయేగాదు వముపైన

ఉపన్యాసము లీయగలవ ర్తకూడ. ఈతనికి వచ్చిన ఈఉపన్యాసధోరణి తల్లిపెట్టిన భిక్షయే. ఆవృద్ధమాత రాజమహేంద్రవరమున ఉపన్యసించుచుండగా ఒకటిరెండుసారులు వినుభాగ్యము మాకు కలిగినది. ఉత్తేజము, ఉద్వేగము కలిగించుటకు తోడు ఆఉపన్యాసములు ఉత్తమములైన తెలుగుపలుకుబళ్ల నెన్నిటినో బయటపెట్టినవి. చక్కని సామెతలనుగూడ నెన్నిటినో ఆఉపన్యాసములల్లో ఆమె ఉపయోగించినది. ఆంగ్లవాసనసోకని ఆ తెలుగుతనమునకు మేమెంతయు నలరితిమి. ఆతల్లినోటినుండి వెలువడిన పలుకుబళ్లను, సామెతలును మనస్సునకు బాగుగహత్తుటచే అవకాశము కలిగినప్పుడు మారచనములందు గూడ ప్రవేశము గాంచినవి. ఆమెకు మాసుమాసములుగ జబ్బుగనుండెను. తుదివఱకును ఆమెకుస్మృతి తప్పలేదు. కుమారుడు కడలూరుజయిలునుండి ఫిబ్రవరి 18-వ తేదీని విడుదలయైన వార్త ఆమె వినెను. మరినాలుగురోజులకు 22-వ తేది ఉదయము 2 గంటలకు ఆయమ సీతానగరమున గౌతమీసత్యాగ్రహాశ్రమమునందు దేహము చాలించెను. బ్రతికిఉన్నంతకాలమును సౌజన్యముగల ఆమె ఆశ్రమవాసులచేతను, గ్రామవాసులచేతను 'మామ్మగారు' అనియే పిలువబడుచువచ్చెను. ఆయమ ఆత్మ శాంతిధామమున నెలకొనునుగాక!

### ప్రథమ అఖిల ఆశియా స్త్రీలసభా తీర్మానములు:—

జనవరి తుదివారమున వారముదినములు లాహోరునగూడి ప్రథమఅఖిలఆశియా స్త్రీలసభ జయప్రదముగ తుదముట్టినది. ఆత్మస్వాతంత్ర్యసంపాదనమునకును, పురుషునితో సమానహక్కులను పొందుటకును ఐరోపియనుస్త్రీలు తీవ్రతరమైన ఆందోళనముచేసిరి. ఒక్కొకచో నది యుద్ధపథముగూడనందెను. ఈ ఆశియాస్త్రీలసభలో నట్టిగాలి పిసరంతేని సోకలేదు. పైగా ఐరోపియనుస్త్రీలు ఆత్మస్వాతంత్ర్యమును పొందుటలో గావించిన అత్యాచారములనుండి తాము దవ్వులనుండవలయుననువాంఛ ఆశియాస్త్రీల మనములందు బాగుగనున్న ట్లీసభ లోకమునకు ప్రదర్శించినది. చేయుబడినతీర్మానములుగూడ ప్రశంసాపాత్రములై యున్నవి. ఆశియాఖండపు బాలబాలికలకు నిర్బంధోచితప్రాథమికవిద్యాప్రదానము నేర్పరుపవలయును; త్రాగుబోతుతనమును నిరోధింపవలయును; ఆధ్యాత్మికవిషయములకు మిక్కిలి దూరముగా బోవుచున్న నేటి నాగరికతను నిరసింపవలయును; వ్యభిచారగృహములు నిర్మూలింపబడవలయును; గర్భాదానవయస్సు హెచ్చింపబడవలయును; స్త్రీలవేతనములు, పనిచేయుకాలము, ప్రసూతికాలవిశ్రాంతి, రోగకాలవిశ్రాంతి మొదలగు కార్మికస్త్రీసమస్యలు ప్రభుత్వపుశాసనములద్వారా పరిష్కరింపబడవలయును; అనుతీర్మానములు సభికురాండ్ర దేశహితబుద్ధిని వెల్లడించుచున్నవి. ఈతీర్మానములకన్నిటికిని మకుటప్రాయముగ రాజకీయస్వాతంత్ర్యముండిన గాని ఆధ్యాత్మికస్వాతంత్ర్యము కలుగదు గాన ప్రతిదేశమునకు రాజకీయస్వాతంత్ర్య ముండవలయునను తీర్మానము గావింపబడెను. ఎంతటి విలువయైన తీర్మానము!

**నిజాము రాష్ట్ర ద్వితీయాంధ్రమహిళాసభ:—**

ఈ నెల 3, 4, 5 తేదీలయందు నల్లగొండజిల్లాలోని దేవరకొండయందు నిజాము రాష్ట్రద్వితీయాంధ్రమహిళాసభ సమావేశమగును. నిజామురాష్ట్రపు టాంధ్రస్త్రీలు బ్రిటీషురాష్ట్రపు టాంధ్రస్త్రీలకంటె అనేకవిషయములందు వెనుకబడియున్నారు. ఈదుస్థితిని తొలగించి ఆరాష్ట్రపుటాంధ్రస్త్రీల పురోభివృద్ధికి పునాదులు వేయుటలో ఈ ద్వితీయ మహిళాసభ గట్టిప్రయత్నములు సల్పునుగాకయని కోరెదము. ఆహ్వానసంఘాధ్యక్షురాలగు శ్రీమతి పి. సత్యవతీబాయిగారును, కార్యదర్శినియగు శ్రీమతి పి. చంద్రమతిగారును సభను జయప్రదముగనిర్వహించుటకు జామీనుడున్నారు. మహాసభకు అధ్యక్షురాలు శ్రీమతి నడింపల్లి సుందరమ్మగారు. ఇక జయఘంట మ్రోగింపబడుటలో జాప్యము జరుగదు.

**మహాత్ముడును, మ్యాక్డొనాల్డును భారతస్త్రీలను ప్రశంసించినారు:—**

ఫిబ్రవరి 20-వ తారీఖున ఢిల్లీనగరమున బ్రహ్మాండమగు బహిరంగసభలో ప్రస్తుతదేశోద్యమమునందు స్త్రీలుగావించిన సేవను శ్లాఘించుచు గాంధిమహాత్ము డిట్లుపన్యసించినాడు: "తక్కిన పట్టణములందువలె ఇచ్చటగూడ సోదరీమణులు చాలప్రశంసనీయముగా పనిచేసిరి. ఈ యుద్యమమునుగూర్చిన చరిత్రను వ్రాయబూనినపుడు స్త్రీలును, బిడ్డలును చేసినసేవకే ప్రాముఖ్య మియ్యబడగలదనుట కెట్టిసంశయమునులేదు." మహాత్ముడీయుపన్యాసముగావించుటకు ఒకమాసమునకు ముందు జనవరి 20-వ తారీఖున లండనునగరమున ఉపన్యసించుచు మ్యాక్డొనాల్డు భారతస్త్రీలనుగూర్చి ఈక్రింది ప్రశంసావాక్యములను పలికినాడు: "బాధ్యతవలన హైందవులలో శ్రద్ధగలుగుచో సంతతియు సుఖముగ నుండును. అటుల జరుగునని నేను నమ్ముచున్నాడను. నేటి హైందవనారీమణులు పెక్కుమంది చాల చురుకుతనము, తెలివితేటలు ప్రదర్శించుచుండుటపై ననే నా యీవిశ్వాసము చాలమట్టు కాధారపడియున్నది. హైందవనారీమణుల రాజకీయాంతస్థు యిపుడే గుర్తింపబడుచున్నది." ఇట్లు భారతనాయకాగ్రేసరుడగు గాంధిమహాత్మునిచేతను, అట్లు ఆంగ్లమంత్రిమాణిక్యుడగు మ్యాక్డొనాల్డు చేతను ప్రశంసింపబడునట్లు భారతజాతీయోద్యమమున పాల్గొనిన పురంధ్రీమతల్లులు చరిత్రకెక్కి చిరస్మరణీయలై వెలయగలరు.

**స్వవిషయము:—**

తొలివత్సరపు దసరాసంచిక ప్రచురణ మప్పుడే తలపెట్టితిమి. కాని జంకుపొడమినది. ద్వితీయవత్సరపు దసరాసంచిక ముద్రించునపుడు మరల నాసంగతి స్మరించితిమి. కాని సందేహము కలిగినది. తృతీయవత్సరపు దసరాసంచిక వెలువరించునపుడును అతలపులు కలిగినవి. జంకు, సందేహము అప్పటికి మమ్ము విడిచినను వలయు ధైర్యము మాత్రము కలుగలేదు. ఆనాటితలపులు ఈనాటికి కార్యరూపముదాల్చినవి. నాలగవవత్సరపు ఈతొలిసంచిక ప్రత్యేకము స్త్రీలువ్రాసినవ్యాసములతోడనే వెలువడగలిగి వినీతభావముతో అ

మహాజనుల కరకమలముల కందించుచున్నాము. ఈ సంచిక రుచివిషయమున గృహలక్ష్మి సాధారణసంచికలకు తీసిపోకుండనున్నదని పెద్దలభిప్రాయపడుచో ఆకీర్తి ఈ సంచికయందు వ్యాసములు వ్రాసిన ఆంధ్రవిదుషీమణులది. ఈసంచికయందు వేరొకచో ప్రచురింపబడిన 'శారదలేఖ' గృహలక్ష్మిప్రశంసతో నిండారియున్నది. ఆలేఖలు వ్రాయు సుప్రసిద్ధాంధ్ర విదుషి. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికి గృహలక్ష్మియనిన వల్లమాలినయభిమానము. అభిమానము కావుననే గృహలక్ష్మిని ఆమె అట్లు పొగడినది. గృహలక్ష్మి అట్టి విశేషమైన వినుతికింకను తగదనుసంగతి మాకు తెలియును. గృహలక్ష్మి ఇంకను ఎన్నియోరీతుల అభివృద్ధినిగోరుచున్నది. ఆమె ఆలేఖయందువ్రాసిన ప్రశంసావాక్యములకంటె స్త్రీజనము తెలిపిన గృహలక్ష్మికొఱతలనుగూర్చిన వాక్యములే మాకు ఎక్కువ ప్రియమైనవి. ఆధ్యాత్మికవిషయములు, పాకశాస్త్రవిషయములు, పరిశ్రామికవిషయములు స్త్రీలు నేర్వదగిన ముఖ్యవిషయములనుట ముమ్మాటికి సత్యము. ఆవిషయకములగు వ్యాసప్రచురణవిషయమున మేము జాగరికులమయ్యేయుంటిమి. జనవరిసంచికనుండియు వేంకమాంబగారి ద్విపదభాగవతము భాగములు భాగములుగ ప్రచురించుచున్నాము. భాగవతము ముముక్షుజనకల్పతరువు. మఱియు నది వేదాంతవిదుషియగు తఱికుండ వేంకమాంబగారు భాషాంతరీకరించినది. వేదాంతఘట్టములందు అది పోతరాజుగారి పద్యభాగవతముకంటె విరళమైయున్నది. విశేషించి అది స్త్రీలు పాటగపాడుకొనుటకు ద్విపదలో వ్రాయబడినది. ఆత్మోన్నతికనువైన ఆధ్యాత్మికవిషయములు లేనిలోపమును నివారించుటకే మేమీభాగవతమును గృహలక్ష్మిలో ప్రచురించుచున్నాము. పాకశాస్త్రవిషయకవ్యాసప్రచురణమునుకూడ మేము పాలుమాల లేదనుటకు గతసంపుటమున ప్రచురింపబడిన 'మెంతికూర' 'వంకాయ' అను వ్యాసములు నిదర్శనములు. పారిశ్రామికవిషయప్రచురణము, తదనుకూలమగు కార్యాచరణము విశేష వ్యయప్రయాసలతోఁగూడినది. ఆంధ్రమహాజనులనుండి వలయు ప్రోత్సాహముకలిగినతోడనే గృహలక్ష్మి ఏతద్విషయమునందును పర్యాప్తకాగలదు. విరివిగ చందాదారులను సమకూర్చి అర్థికపుష్టిని, మనోహరములగు వ్యాసములనువ్రాసి సారస్వతపుష్టిని కలిగించి మాయుద్యమమునకు ఇంతవఱకు చేదోడు వాదోడు అయిన ఉదారులగు ఆంధ్రసోదరసోదరీమణుల నీ నూతనవత్సరారంభమున కృతజ్ఞతాపూర్వకముగ స్మరించుచు ఇకముందుగూడ గృహలక్ష్మిని వారు తమ ఆదరణాభిమానములకు తావలమగునట్లుచేసి పత్రిక నింకను సర్వాంగసుందరముగ వెలువరించుటకు వీలుకలిగింతురుగాకయని కోరెదము. ఈనూతనవత్సరారంభ శుభావసరమున మేమీవత్సరము మాచందాదారులకును, మాపాఠకులకును నిరంతరశుభపరంపరావాప్తిగలిగింప భగవంతుని మడిచేతులుగట్టుకొని ప్రార్థించుచున్నాము.

---

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.